# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట

కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౫.]	మార్చి 1932	[సంచిక ౧.

PRINTED AT LODHRA PRESS, EGMORE, MADRAS

. . . . . . . . .

శ్రీయుత దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'కృష్ణపక్షము'లోని 'ఆకులో ఆకునై, పూవులో పూవునై' అను గేయముతో ఈసంచికయందలి 'ఈజీవితంబులో నింతదుఃఖముండేనా?' అను ఆచంట సత్యవతమ్మ గారిగేయము వడకలో చాయకుబోవుచున్నది.

. . . . . . . . .

'ఒక యస్పష్టస్వరూపాన్ని విస్పష్టంచేసికో'వలెనను 'ఉత్కంఠాతీవ్రత'. భగవదన్వేషణమే మానవుని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు. కాని మానవుడు భగవంతుని కనుగొనగలిగినాడా? శ్రీమతి యన్. వి. సరళాదేవి గారి 'గడ్డిపూలు' తెలుగున ఒకక్రొత్తరకపు గద్య శకలములకు దారితీయుచున్నది. మార్గము చక్కబడునుగాక!

. . . . . . . . .

దత్తుపోయినతావున తెగిపోగా స్తన్యమిచ్చినతల్లి లాలనకోరివచ్చినట్టి ఆ బాలునికి 'ఎవరివాఁడవు? నాయనా!' అనుప్రశ్న. నింగిముట్టినఆశలు నేలమట్ట మగుటలో ఆశ్చర్యమేమి? సోదరులగు ఆముగ్వురి పంక్తినికూర్చుండ తనకును హక్కుగలదుగదా? కాని తలుపుగొళ్ళెము పట్టుకొన్నాడు. తరువాతగాని తల్లి చేపట్టుదొరకలేదు. తనకును ఆబాలునకునుగల అంటు తెలిసినతరువాత ఆతల్లి తెలిసికొనకుండగనే అంటు పడినది. 'పుత్రవంతులగు పగవారికైనఁ బుత్రదాన దారిద్ర్యముమాత్రమువలదు' అని అనుశాసించినది. దారిద్ర్యశార్దూలము మాతృప్రేమ నంటజాలదు.

. . . . . . . . .

'ఇల్లాలు' అనుకథ 'నిష్కలుషపు గ్రామ్యజీవనపు కమ్మదనమును' గుబాళించుచున్నది. తెలుగువారి గ్రామ్యజీవనపుమర్యాదలెన్నియో మెలుకువతో నిందు ప్రవేశముగాంచినవి. రామిరెడ్డి కనకంమీద 'ఉట్టి పుణ్యానికి' అనుమానపడ్డాడు. ఆఅనుమానము కథా వేగమును అరికట్టగలిగింది. కనకం అనుమానకారణ మున్నను రామిరెడ్డిపై అసూయపడలేదు. ఈ అనసూయ కథావేగమును హెచ్చించినది. కనకంప్రాణములకొఱకు రామిరెడ్డి ఎదురుఅడ్డుపడి కథను పెంచినాడు. రామిరెడ్డిప్రాణములకు కనకంఅడ్డుపడి తలుపు తెఱచి కథనుతుంచినది. సాదృశన్యాయము ఈకథ యందు చక్కగహత్తినది.

. . . . . . . . .

హారిస్ చిన్నకథలకు దాయాదిరైయె 'తాచెడ్డకోతి' తనరుచున్నది. వస్తువుఉండదు. కాని రుచికిలోప ముండదు. సమస్యఉండదు. కాని చర్చింపబడు నవన్నియు సమస్యలే. సంభాషణతో నిర్వహణము. ప్రధానప్రాప్యము నీతిబోధ. ఆనీతిబోధ అచ్చవైదికముగగాదు; జిజ్ఞాసనురేపి. ప్రధానపాత్రఅభిప్రాయములతో ఏకీభవించుటకుగాని వ్యతిరేకించుటకుగాని వినోదపాఠకునకు వీలుండదు.

. . . . . . . . .

అలగ్జాండరు ఎత్తివచ్చినపుడు అంభి అతనితో కుమ్మక్కు అయినాడు. పురుషోత్తముడు ఎదిరించినాడు. గోరీఎత్తివచ్చినపుడు జయచంద్రుడు అతనితో కుమ్మక్కుఅయినాడు. పృథ్వీరాజు ఎదిరించినాడు. అప్పుడు స్త్రీప్రసక్తిలేదు. ఇప్పుడు సంయుక్తప్రసక్తి. మొదటిది కావ్యములకెక్కలేదు. ఇది యెక్కినది. దానికికారణము సంయుక్తఉద్బోధనయే. పరునిగూడి దేశమునుమఱచిన తండ్రిపై మగనితోగూడి కత్తికట్టిన రమణి మఱియే దేశచరిత్రయందైన గలదా?

. . . . . . . . .

వేదమును సవిమర్శముగపఠించిన నేటి ఆంధ్రపండితులలో భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు ఎన్నికగన్నవారు. వారు అలవోకగా రచియించి గృహలక్ష్మికిఅనుగ్రహించిన 'బ్రాహ్మణకాలమునందలి స్త్రీ గౌరవము' అనువ్యాసము వారి వేదపాండిత్యమును కొంతకుకొంత వెల్లడించుచున్నది.

. . . . . . . . .

భూగోళశాస్త్రమును కథలరూపమున బోధించు చక్కనివ్యాసములను శ్రీమతి శ్రీపాద శారదాదేవి గారు గృహలక్ష్మికి ప్రసాదించుచున్నారు. ఈసంచికయందు 'వెన్నెలయ్య' అనువ్యాసము చంద్రుని గూర్చి చిన్నపిల్లలు నేర్చుకొనగలసంగతులనన్నిటిని ప్రదర్శించుచున్నది. కథలరూపమున విషయావబోధముగావించుట ధారణకు దోహదకారి. గృహలక్ష్మిని తెప్పించుచున్న పాఠశాలాధికారులు ఈవిషయమున తమ అనుభవమును అనుగ్రహింతురుగాక!

—ఆంధ్ర శేషగిరిరావు బి. యె.

# విషయసూచిక

---

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. దసరా ప్రత్యేకసంచికగవెలువడు అక్టోబరుసంచిక మాత్రము రు. 0-8-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభముచేయవచ్చును. విడికాపీలువలయువారు వానివిలువమేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందియవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికిపూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనచార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి $12\frac{1}{2}$ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లుతెలుపమిని కాపీలు చేరనిచో తిరుగ పంపజాలము.

## చాందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారిచందానెంబరును ముద్రించుటమూలముగా గృహలక్ష్మియందు ఆయామాసములయందు సూచింపబడును. ఇదివఱకువలె ప్రత్యేకముకార్డు వ్రాయజాలము. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము. ఆ వీ. పీ. ని తిరుగగొట్టినచో మాకు అనవసరవ్యయము కల్గించినవారగుదురు.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనమని వ్రాయు ఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు. ఇది ముఖ్యముగా గమనింపవలసియున్నది.

గృహలక్ష్మీ కార్యాలయమున

# వెలకు దొరుకు గ్రంథములు

## తులసి

గ్రంథకర్త డాక్టరు కే.యన్. కేసరిగారు. తులసియను జాతీయమూలికనుగూర్చిన యమూల్యగ్రంథము. తులసియందలి భేదములు, తులసినిగూర్చి వైద్యశాస్త్రముచెప్పు వాక్యములు, తులసిదళములు తినుటవలన త్రాచుపాముగరచిన వారు బ్రతుకుట, తులసివలన నయమగువ్యాధులు మొదలగు విషయములేగాక తులసి పురాణమును, తులసిగోవిందనామములును, తులసిషోడశోపచారపూజయు నిం దుదాహరింపబడియున్నవి. గృహస్థులెల్లరును ఈగ్రంథమునుచదివి తులసివలన బొందదగిన సర్వలాభములను పొందుదురుగాక. శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఈగ్రంథమునకు చక్కనిపీఠిక వ్రాసియున్నారు. పత్రికలు, ప్రముఖులు ప్రశంసించియున్నారు. క్రౌనుసైజున మంచి ఫెదరువెయిటుకాగితము. 72 పుటలు. రేపరుబైండు. వెల రు. 0—8—0 అణాలు. పోస్టేజిప్రత్యేకము. మొదటికూర్పుప్రతులు చాలతక్కువగనున్నవి గావున వెంటనే ఆర్డరుఇచ్చుట మంచిది.

## బిల్వ

ఇదియు డాక్టరు కే.యన్. కేసరిగారువ్రాసినదే. బిల్వనుగూర్చిన శాస్త్రవిషయకపరిశ్రమచేసికూర్చిన సర్వవిషయములు ఇందుగలవు. ఈమూలిక ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణవివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు భక్తులకు మిక్కిలిఉపయోగకరమైనగ్రంథము. పత్రికలుమెచ్చినవి. క్రౌనుసైజు. మంచి ఫెదరువెయిటుకాగితము. 48 పుటలు రేపరుబైండు. వెల రు. 0—8—0 అణాలు. పోస్టేజిప్రత్యేకము.

## వేప

గృహలక్ష్మిసంపాదకులు కే.యన్. కేసరిగారువ్రాసినదే. మనదేశమున ప్రతిపెరటిలోను ఉండు వేప చెట్టువలని పూర్ణమైన ఉపయోగమును పొందదలచినవారు ఈగ్రంథమును చదివితీరవలయును. వేపచెట్టు యొక్క ఓషధీగుణము, పాకకళలలో దానిభాగము మొదలగువిషయములెన్నో అందు చర్చింపబడినవి. క్రౌను సైజున మంచి ఫెదరువెయిటుకాగితములమీద సుందరముగ ముద్రింపబడుచున్నది. త్వరలో వెలువడగలదు. వెల రు. 0—8—0 అణాలు. పోస్టేజి ప్రత్యేకము. నేడే ఒకకార్డువ్రాసి ఒకకాపీకి తమనామము రిజిష్టరు చేసికొనుట మంచిది.

## శివకథాసుధారసము

ఆర్యసోమయాజుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే రచియింపబడిన పద్యకావ్యము. ఇందు పార్వతీ వివాహము, కుమారజననము, తారకాసురవధ, దేవసేనాపరిణయము వర్ణింపబడినవి. ధారాళమగు కవిత్వము. డెమ్మీసైజు, దళసరికాగితములు. 260 పుటలు దిట్టమైన అట్టబైండు. వెల రు. 1—0—0. తపాలా. వ్యయములు ప్రత్యేకము. నాలుగుఅణాలస్టాంపులుపంపు గ్రంథాలయముల కీగ్రంథము అన్‌రిజిష్టర్డుపార్సెలు ద్వారా ఎట్టిక్రయమును లేక ఉచితముగాపంపబడును. కొద్దికాపీలే ఉన్నవిగావున త్వరపడుట మంచిది.

గృహలక్ష్మి, పోస్టు బాక్సు 752, ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి

ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ

సంపుటములు వెలకు సిద్ధముగనున్నవి

ఒక్కొక్కవత్సరపు పండ్రెండుసంచికలును కలిపి బైండుచేసిన నాలుగుసంవత్సరములకు నాలుగుసంపుటములు. కాలికోబైండు. దిట్టమైనఅట్ట. గ్రంథభాండాగారములకు అలంకారములు. ఒక్కొక్కసంపుటము కొద్దికాపీలుమాత్రమేఉన్నవికావున త్వరపడి ఆర్డరు చేయవలయును. ఆలసించిన దొరకనేరవు. తిరిగి అచ్చుపడనేరవు.

వెల సంపుటము ఒక్కంటికి రు. 6—0—0 మాత్రము

రైల్వేపార్సెలుగా తెప్పించుకొనుట మంచిది

వలయువారు:

## గృహలక్ష్మీ కార్యాలయము

పోస్టుబాక్సు నెంబరు 752, ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ ప్రజంటేటివు ఆఫ్ న్యూస్ |
| బళ్లారి: | వి. రాజుమొదలియార్ & సన్సు, కారువీధి. |
| బెజవాడ: | నామల ఆంతోని. |
| మచిలీపట్టణము: | కె. బాలకృష్ణ, ఫోటోఆర్టిస్టు, కొజ్జిలిపేట. |
| ,, | సి. వి. అవధాన్లు, ఇన్సూరెన్సుబీరో. |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడు,(మన ప్రాంతపు 1 రూడుస్మానియారూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాడిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| రాజమండ్రి: | ఏ. కృష్ణమూర్తి బ్రదర్స్, న్యూస్ఏజంట్స్. |
| తాడేపల్లిగూడెం: | కాశీరాజు శ్రీరాములుగారు |
| బరంపురం: | గోనియశెట్టిగారు, గొల్లపల్లి. |
| గుంటూరు: | వెల్కం అండు కంపెని. |
| ఏలూరు: | సనకా రాజారావుగారు, పవరుపేట. |
| సామర్లకోట: | పద్మనాభశాస్త్రిగారు, న్యూస్ఏజెంటు. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| పాలకొల్లు: | వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపర్రు. |
| అనకాపల్లి: | గ్రంధి కన్నయ్యపంతులు, గాంధిమార్కెటు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | ఎం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| ,, | ఎం. నూకరాజు, ఆంధ్రన్యూస్ఏజన్సీ. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు, బుక్ సెల్లర్సు. |
| జేమ్షెడ్పూరు. | టి. వి. రమణయ్యగారు, 3 టిల్జుగ రోడు, న్యూ 'L' టౌను. |
| మదరాసు: | వై. జానకమ్మగారు, కమెర్షియలు బుక్ డిపో, 364, ఎస్ప్లనేడు. |
| ,, | ఆకుండి వేంకటశాస్త్రిగారు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.



గంగిరెద్దు

పూర్వమొకప్పుడు గజాసురుడు ఈశ్వరునిగూర్చి ఘోర వీరతపము చేయదొడగెను. ఆతపమునకు మెచ్చి ఈశ్వరు డారాక్షసునకు దర్శనమిచ్చెను. వరమడుగు మనియెను. "దిక్పాలురను నిర్జించుబలమును, సంపదను అనుగ్రహింపుము. నీవు నాహృదయమునందే ఉండిపోవలయును. నీచేతప్ప నాకు అన్యులచే మరణములేకుండవలయును." అడుగుటయే తడువుగా ఈశ్వరు డీవరములనుప్రసాదించి గజాసురుని హృదయమునందు ప్రవేశించెను. అందుతో పార్వతి వికలచిత్తయై తనపతిని తనకిప్పింప శ్రీహరిని వేడుకొనెను. ఈశ్వరవరదర్పితుడగు గజుని దండోపాయమున జయింపనేరమని హరి బ్రహ్మాదులతో ఆలోచనసాగించెను. "గజుడు హాస్యలాస్యలాలసుడు. వినోదప్రియుడు. కావున ఈశ్వరునివాహనమగు నందికి గంగిరెద్దువేషమువేయుదము. బ్రహ్మయు, ఇంద్రుడును, నేనును గంగిరెద్దుదాసులమై దానివెంటపోవువారము. ఆడియు పాడియు ఆరక్కసుని మెప్పించి వానివలన వానిమరణమునే వరముగాబడయుదము" అని శ్రీహరి చెప్పెను. దీనికి అందరును సమ్మతించిరి.

నందికి వెన్నుపొడుగునను చిత్రవిచిత్రంపు బొంతలు వైచిరి. మూపురమున నొకచక్కని సరిగవలువబెట్టిరి. వెండిగొరిజలు, బంగారపుకొమ్ములు నమర్చిరి. నడుమునకు బంగారుపట్టెడచుట్టిరి. మెడకు గంటలును, ఒడ్డలిచుట్టు మువ్వలు, ముక్కునకు చక్కనిత్రాడును గట్టిరి. శ్రీహరి, బ్రహ్మ, ఇంద్రుడు, నారదుడు గంగిరెద్దుదాసులైరి. నలుగురు నామములుదీర్చిరి. చిత్రమైనబట్టలు. మెడలలో రంగురంగుల పూసల పేర్లు. వంకతలపాగలు. చంకలను జోలెలు. బ్రహ్మ వీరణము, నారదుడు సన్నాయి, ఇంద్రుడు డోలు, హరి చేగంటపుచ్చుకున్నారు. గజాసురునిపురమునకు పోయినారు.

శ్రీహరి మేళనాయకుడు. గజాసురుడు రెప్ప వేయనికన్నులతో కాంచుచున్నాడు. మేళనాయకుడు బసవనిపిలచెను. గల్లుమనుచువచ్చు నాయెద్దును గజాసురునియెదుట నిలువబెట్టి అతివినయముతో నాతడిట్లనెను. "మాప్పెబో! మా బసవన్న మనలాగ మాటాడనేడు. కాని మనమాటలన్ని గురుతేనండి. చిత్తగించండి యీవిద్దెలు. తమరెక్కడనూడనేదు. బసవన్నా! బాబాయ్యగోరి సభలోకొచ్చినాం. పది కోసులుదోవ నడిచొచ్చినాము. దగయేస్తుంది. బాబుగారు పాలు తెప్పిస్తారు. పాలుతాగుతావా? బసవా!" అనుసరికి తలయూచి బసవడంగీకారముసూచించెను. "పాలకుండఅడుగున గోకుఉంది. కుండగోకాలె. బసవా! కుండగోకూ. సూస్తారు బాబుగారు!" అనునంతలో ముందటికాలొకటి మీదికెత్తి కొంచము వంచి బసవడుగోకుట నభినయించెను. "మోకాళ్లతో నడూ. పెబువారు సూస్తారు" అని చెప్పునంతలో చూపఱు లాశ్చర్యపడున ట్లావిద్య చూపించెను. పిమ్మట వాద్యధ్వనితో వికటనృత్యము చేయుచు

"తకటతధిమి కోడిపందెము
కోడలేమైనాదిరా!
అత్తకూడూపెట్టనంటె
అలిగితొంగున్నాదిరా!"

అనిపాడి "బసవా! ఆకోడల్లాగ కడుపులో కాలెట్టుకుతొంగో" అని నాయకు డాజ్ఞాపించగా నుస్సురనుచు కడుపులోకాలుపెట్టుకొని పన్నుపడుకొనుట చూపెను. ఇట్లే నాయకునియాజ్ఞననుసరించి బసవడు చేనిలో చెవులపోతునవలె చెంగున గంతులువేసెను. బండగట్టుమీద బావురుపిల్లులపోరాటము చూపెను. వనములో వఱదుదాట్లును వేయుటయు, మెట్టమీద మెకము పశువులదొడ్డిలోపడి యెద్దుమెడపట్టి రొయ్యగుర వేసికొనిపోవుటయు నెట్లో చూపించెను. అయ్యగారికి దండముపెట్టి జరీకండువాయిప్పింపుమని యడుగుకొనెను.

గజాసురుడు పరవశుడయ్యెను. గంగిరెద్దుదాసులతో "మీబసవనిముద్దుచేష్టలకు నేను మెచ్చితిని. మీకేమికావలెనో సందేహింపక కోరుకొనుడు. తప్పక మీకిచ్చితీరెదను" అనెను. అప్పుడు శ్రీహరి యిట్లనియెను. "దానవేంద్రా! నీపలుకులకు మేము బ్రహ్మానందమునొందినాము. మేమెవ్వరమో, ఎందుకు

వచ్చితిమో నీకిప్పుడు స్పష్టముగా విప్పిచెప్పెదము వినుము. వీరణమువాయించిన ఈతఁడు బ్రహ్మదేవుడు. డోలుకట్టినవాడు దేవేంద్రుడు. సానాయిపాటకాడు నారదుడు. ఈవృషభము మహేశ్వరునివాహనము నంది. నేనాదినారాయణుడను. మేము నీప్రాణము గోరివచ్చితిమి. ఇంతవఱకు నీవు మహేశ్వరుని నీ హృదయపీఠమున నిలుపుకొనియుంటివి. ఇపుడీనందీశ్వరుడు నీవక్షస్థలము భేదించి పశుపతిని బైటికి తెచ్చును. అట్లుకానిమ్ము. ఇదే మాకోరిక. మాకుకావలసిన వరము." ఆడినమాటతప్పజాలక గజాసురు డీవరము నిచ్చి తాను ఇహలోకమునువీడెను .

ఈశ్వరుడు బయలుపడెను. త్రిమూర్తులు నింద్రుడును తమతమవాహనముల నారోహించిరి. సంపూర్ణ మనోరథులై వారందఱు గజునినగరమునుండి ఆకాశ మార్గమునకదలిరి. మిథిలాపురప్రాంతమును గడచి పోవుచుండిరి. ఆ పురము వెలుపల దిక్కుమాలినవాడొకడు దీనముగా నేడ్చుచుండెను. వానినిజూచి జాలి పడి యాదేవతలు నేలకుదిగి మాయామానుషవేషములతో నిట్లనిరి. "ఓరీ! నీవెవడవు? ఊరిబైట నొక్కడవు వెక్కివెక్కియేడ్చెదవేల? నీకేమికష్టమువచ్చినది?" ఈప్రశ్నములకు మాఱుపలుకక కడుపుపొంగి పోవునట్లు వాడు మఱియు నేడ్వజొచ్చెను. ఆదుఃఖహేతువు వానినోట నేవినవలెనని కుతూహలముతో దేవతలు వానిని గ్రుచ్చిగ్రుచ్చిప్రశ్నించిరి. వారలతో ప్రసంగించుటకిష్టములేక వాడెట్టకేలకు నిట్లనియె: "మీరార్చువారా? తీర్చువారా? అయ్యలారా! నా యేడుపు నన్నేడువనిచ్చి మీరు మీదారిపొండు" అని యింకను వెక్కివెక్కియేడ్చుచుండెను. "ఓరి! పిచ్చివాడా! నీదురవస్థయేమో మాకు రవంత తెలుపుము. నిన్నిపుడె పక్కననవ్వింతుమో లేదో నీవేచూతువు గాక!" అని దేవతలాశగొల్పిరి. "అట్లయిన యన్యలారా! వినుడు. నాది మిథిలాపట్టణము. మాయూరి కధిపతి జనకమహారాజు. చండశాసనుడు ఎవరికుల వృత్తి వారు చేసికోవలెనని శాసించినాడు. నాది సంకరకులమగుటచేత కులవృత్తిలేదని నన్ను పురివెడల ద్రోయించినాడు. నేనేలాగుబ్రతుకవలెనో తెలియక దేవుడా! యని యేడ్చుచున్నాను" అని వాడు తన దుఃఖకారణము తెలిపెను. "ఓరీ! దీనికింతవిచారమేల? పుట్టించిన దేవుడు పూరిమేపునా? భయములేదు. ఇవిగో పుచ్చుకో"మ్మని బ్రహ్మాదులు తాము గజాసురునెదుటనాడునపుడు ధరించిన దుస్తులు, డోలు, వీరణము, సనాయి మొదలగువాద్యములును వానికిచ్చి గంగిరెద్దనాడించువిద్య వానికి నేర్పి యిటుపై నీవిద్యవలనజీవింపమని బ్రతుకుతెరువుచూపి వానిని పక్కన నవ్వించి యంతర్హితులైరి. వాడీవృత్తాంతమంతయు జనకమహారాజునకువిన్నవించి యాతని తృప్తుంగావించి యాతనియనుమతివడసి మిథిలాపురముననే నివసించుచు గంగిరెద్దువిద్య నీలోకమున వ్యాపింపజేసెను.

—గొబ్బూరు వేంకటానందరాఘవరావు.

కడువింతయగు స్థూలకాయంబుగల్గుట
    చిత్రభూషాంబర స్థితినిగనుట
తూర్యరావంబులతోఁ జనుదెంచుట
    వాలవీజన సమవాప్తిగనుట
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట
    చూపఱు పదుగురు చుట్టుకొనుట
స్వనియంతవాక్యంబువిని తలయూఁచుట
    మౌనముద్రవహించి మతముగనుట
గంగిరెద్దుకు........................

—అడిదము సూరకవి.



గృహలక్ష్మి

## అసెంబ్లీసభ : స్త్రీ సమస్యలు

గతమాసమున భారతశాసనసభలో స్త్రీసమస్యలకు చెందినవి రెండుబిల్లులుచర్చకు వచ్చినవి. ఒకటి హిందూవితంతువుల వారసత్వపుబిల్లు, రెండవది హిందూవివాహవిచ్ఛేదముల బిల్లు. రెండుబిల్లులును నిరాకరింపబడినవి. స్త్రీసమస్యలపట్ల భారతశాసనసభ సభ్యులు ఎంతటి ఉదారహృదయమును చూపగలిగినవారో లోకమునాకి వెల్లడియైనది.

హిందూవితంతువులకు భర్తకుటుంబపు ఆస్తిలో రావలసినభాగమును గూర్చినదగు మొదటిబిల్లును రావుబహదూరు హరవిలాసశారదాగారు ప్రతిపాదించిరి. నాడు భారత శాసనసభకు భారతనారీమణులు తండోపతండములుగ వచ్చియుండిరి. ఆస్తివిషయమున వితంతువు లనుభవించుచున్న వివరింపరానికష్టములు తొలగుటకు దీనిమూలమున అనుకూల్యమేర్పడునని రమణులు తలంచిరి. శారదాగారు బిల్లుప్రతిపాదించిరి. డబ్బుకై మగవారిమీద నాధారపడవలసియుండుటచే వితంతువులు చాలా కష్టపడుచున్నారనియు. వంట పనికితప్ప మరేదేనికిని వారు పనికిరాకుండనట్లు చేయబడుచున్నారనియు జాదవ్ గారు చెప్పుచు బిల్లును సమర్థించిరి. కాని పలుపురుసభ్యులు దీనికి ప్రతికూలముగానిలిచిరి. స్త్రీల రక్షణకై హిందూసాంఘికవిధానమున మంచియేర్పాటులు గలవనియు, వితంతువులు ఆస్తికి వారసులైనచో డబ్బు దుబారాచేసెదరనియు, ఈబిల్లు అవిభక్తకుటుంబములను విచ్ఛిన్నము చేయుననియు సేనుగారు ప్రతిఘటించిరి. బిల్లు పడమటిగాలిలో కొట్టుకొనివచ్చినదనియు, ప్రతి హిందూకుటుంబమునందు స్త్రీలు హాయిగా బ్రతుకుచున్నారనియును, ప్రతిపాదకులు కీర్తికొరకు ఈబిల్లు గొనివచ్చిరనియు మిశ్రాగారు పలికి తమ తుచ్ఛహృదయమును సభలో చాటుకొన్న కీర్తిని పొందిరి. లామెంబరగు బ్రజేంద్రమిత్రగారు బిల్లు నిస్సారమైనదని నిర్వచించిరి. ప్రతికూలురు యేబదియెనుగురైరి. అనుకూలురు ఇరువది యెనుగురు మాత్రమే తేలిరి.

ఈబిల్లుతరువాత ప్రతిపాదింపబడిన హిందూవివాహవిచ్ఛేదపు బిల్లునకుకూడ ఈ గతియేపట్టెను. హిందూమతమునవలంబించువారికి వివాహవిచ్ఛేదములందు హిందూధర్మశాస్త్రములు అనుమతించు హక్కులను ప్రసాదించుటకు ఒకబిల్లును సెలక్టు కమిటీకి పంపవలెనని సర్ హారిసింగుగౌరుగారు ప్రతిపాదించిరి. ఈప్రతిపాదనను హరవిలాసశారదాగారు బలపఱచుచు ప్రాక్తనధర్మశాస్త్రములను వ్రాసిన మునిపుంగవులు నారద, వసిష్ఠాదులు చాల ఉదారములగు సూత్రముల నేర్పఱిచిరనియు వారిఉదారభావములను అనుసరించి శాసనసభ సభ్యులు ఈబిల్లును ఆమోదింపవలసినదనియు కోరిరి. రాజ్యాంగనిర్మాణము మార్పునొందబోవుచున్నదనియు, ఇట్టి సంధికాలమున ఇట్టి సాంఘికశాసనము చేయరాదనియు, నిర్మింపబడబోవు శాసనసభయందు—స్త్రీలకు ఓటింగుహక్కు, ఎన్నికహక్కు ఉండగలవుగావున—చాలమంది స్త్రీసభ్యులుండగలరు కాబట్టి అప్పుడు దీనిని విచారించుట మంచిదనియు బి. దాసుగారు నుడివిరి. వివాహము విచ్ఛేదింపరాని పవిత్రసంస్కారమని వేదములనుండియు, శాస్త్రములనుండియు ప్రమాణశ్లోకములను చదవి పండితసేనుగారు బిల్లును ప్రతిఘటించిరి. కొంత చర్చరేగినది. ఎవరికితోచినట్లు వారు మాట్లాడిరి. ఒక ఆంధ్రసభ్యుడు బిల్లునుమరల ప్రజాభిప్రాయము కనుగొనుటకు పంపవలయునని సవరణ తెచ్చెను. కాని సభలో నిర్ణీతసంఖ్యసభ్యులు లేకపోవుటచే సభ రెండుసారులు సమాప్తము చేయవలసివచ్చినది. ఓటింగు స్థితికైనరాక ఈ విడాకులబిల్లు ఇట్లు రెండుసారులు విడనాడబడినది. సభ రెండుసారులు వాయిదాపడినది.

దేశమున కొంతవిద్యాభివృద్ధి జరిగినది. నవీననాగరికతకు పేరుమోసిన పాశ్చాత్యదేశములతో సంపర్కలబ్ధివలన కొంతసంస్కారావబోధమును గలిగినది. అయినను-స్త్రీలకు హక్కులు ప్రసాదించుటకు రాష్ట్రీయసభలును, స్వదేశసంస్థానములును చూపు ఉత్సాహము పాటిఉత్సాహమునైనను భారతశాసనసభ చూపుటలేదు. పుట్టినఇన్నిదినములకు పురుషుడు యజ్ఞముచేసినాడనినట్లు ఎట్లో శారదాచట్టమును మాత్రమును చేసినది. చేసియేమి ప్రయోజనము? గ్రుడ్డికన్ను తెఱచిన ఎంత ప్రయోజనమో ఈచట్టముచేసి అంతప్రయోజనమైనది. బాల్యవివాహములు బాహాటముగ జరుగుచునేయున్నవి. ఇప్పటిఈబిల్లులు శాసనముల సంపుటమున కెక్కుపాటి భాగ్యమునకైన నోచుకొనలేదు. దేశమునందలి మహిళాసంఘములవారి అభిప్రాయములను కనుగొనుటకైన హిందూవితంతువుల వారసత్వపు హక్కుబిల్లు పంపకుండుట శోచనీయము. విడాకులబిల్లు ఇంతకన్న ఎక్కువ శోచనీయ పరిస్థితులలో పడిపోయినది. దానిని చర్చించుటకైన పూనుకొనక అదిచర్చకువచ్చిన సమయమున సభకురాక విడాకుబిల్లుతో విడాకుపుచ్చుకొనుటచే భారతశాసనసభ సభ్యులది బాధ్యతయెఱుగని సభ్యత్వమైనది. అవునో, కాదో తేల్చుటకు వారికి హక్కుగలదు. ఆహక్కును ఉపయోగించుటలో వారు పట్టిఉత్సాహమును చూపలేదు. ప్రజాప్రతినిధులదియైన ఇట్టితీరు మిక్కలి గర్హింపదగినది.

# ఈజీవితంబులో నింతదుఃఖముండెనా?

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

౧

నీమాయలోఁజిక్కి
నీలీలలోమునిగి
యీగాలితిత్తిలో ఆడు
చుంటినిగాని
ఈజీవితంబులో నింతదుఃఖంబుండెనా?
దేవ! నే నిసుమంతఁ దెలియనైతి.

౨

చెట్టులోపుట్టనై
పుట్టలోపామునై
మట్టిలోతేమనై
మరచిఆడితిగాని
ఈజీవితంబులో నింతదుఃఖంబుండెనా?
దేవ! నే నిసుమంతఁ దెలియనైతి.

౩

పూవులోతావినై
పండులోతీపినై
కాయలోవగరునై
కన్నుగానకనుంటి
ఈజీవితంబులో నింతదుఃఖంబుండెనా?
దేవ! నా కింతైనఁ దెలుపవైతి.

౪

జలములోబుడగనై
మెరుపులోతళుకునై
కనులలోకాంతినై
కలగనుంటినికాని
ఈజీవితంబులో నింతదుఃఖంబుండెనా?
దేవ! నాకింతైనఁ దెలుపవైతి.

౫

మనసులోమాటనై
తేనెలోతేటనై
వానలోచినుకునై
కాననుంటిగాని
ఈజీవితంబులో నింతదుఃఖంబుండెనా?
దేవ! నేనిసుమంతఁ దెలియనైతి.

౬

పక్షిలోపాటనై
కుక్షిలోసాక్షినై
ఇక్షులోరసమునై
మోక్షాన మరచితిని
ఈజీవితంబులో నింతదుఃఖంబుండెనా?
దేవ! నే నిసుమంతఁ దెలియనైతి.

౭

మనసుమాయనుజిల్చి
కనులకాంతినిజూపి
దుఃఖజీవితముడిపి
నన్ను నీలోఁజేర్చుమా!
దేవ! నన్నొరునిగానెంచబోకు.

# గడ్డిపూలు

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

ఎప్పటినుంచో హృదయంలో కాంక్షాలత వేరుతన్నింది. ఎంతకాలమైందో ఎఱుక లేదు. జన్మజన్మాలనుంచీ వస్తున్న అనుస్యూతసంబంధం కాబోలు ఇది! హృదయ ప్రదేశమంతా అలుముకొంటున్నది ఈకాంక్షాలత. ఏదోయొకయస్పష్టస్వరూపాన్ని విస్పష్టంచేసికోవలెననికాబోలు దానిసంకల్పం! ఎట్లాచూడటం! మార్గంతెలీటంలేదు.

హృదయపాత్రిక నీరసమైంది. గాఢ సంతాపం కళవళించింది. ఉత్కంఠా తీవ్రత ముచ్చముడుగలేదు. శాంతికి చోటుచిక్కదు. ఏమిచేయాలిననో ఈతాపబాహుళ్యం!

* * * *

నిన్ను తెలియడంఅంటే ఎలాగ? మానసానికి నీమూర్తి స్ఫూర్తిలేదు. హృదయమైనా నీస్వరూపాన్ని అవ్యక్తంగానే మలుచుకొన్నది. కోర్కితీవలు నీసందర్శనవాతాలను నెమకొంటూ బయలునే ఆశ్లేషిస్తున్నయి. ఎట్లా నిన్ను తెలిసికొనేది?

ఈకోరిక ఊఱక తుడిచివేదామా అంటే నాసాధ్యంకాదు. హృదయానికి బరువైనా, వేదనే ఫలమైనా ఈకాంక్షనే నాచిత్తంలో గట్టిగా హత్తుకొంటాను. ఏమరుపాటు కలుగుతుందేమోనని, విస్మృతిసంభవిస్తుందేమోనని జాగ్రత్తగా దాన్ని పోషించుకొంటాను. అదే నాజీవితం. నాజీవితమేఅది అయిపోతూంది క్రమశః నాకు!

* * * *

మఱవడంఅంటే ఎలాగ? నీవిషయం స్మరించడంతోనే—దేహం పరవశమైపోతూంది. గగుర్పాటు కలుగుతూంది. హృదయసుమం ఆనందవేదనతో తొణికసలాడుతూంది. బాష్పప్రవాహం ఒలుకుతూంది. ఇంద్రియాలన్నీ అవాచ్యమైన మాంద్యాన్ని పొందుతయి.

ప్రయత్నిస్తాను! ప్రయత్నిస్తాను!! యుగయుగాలుగడచినా వెదుకుతాను. ఈఅగాధవిశ్వంలో కాలుపెట్టిందిమొదలూ నీఅన్వేషణమే నాఉచ్ఛ్వాసనిశ్శ్వాసాలూ! నీసందర్శనాపేక్షే నాజీవితం!! ఎట్లాచిక్కక తప్పించుకొంటావోచూస్తాను.

* * * *

ఆకాశంఅంతా విహరిస్తా. భూమంతా పరికిస్తా. అగాధజలాల్లో చూస్తాను. వాయుమధ్యంలో తిలకిస్తా. తేజస్స్వరూపంలో నెమకుతా. ప్రకృతంతా నీవేనట. సౌందర్యం, లాలిత్యం, మాధుర్యం, గాంభీర్యం, సౌభాగ్యం పరిపాలించే ప్రకృతిరాజ్యంఅంతాచూస్తాను. ఎట్లాకన్పడవో విచారిస్తాను.

* * * *

అయితే విధానంతెలియటంలేదు. మార్గం గోచరించటంలేదు. ఇదంతా నీవేనా? ఈ ప్రకృతంతా నీవుకాదా? చూచేకోర్కె ఎవరుకల్పించారో?—చూచేదెలాగో?

# ఆంగ్లకవులముచ్చటలు

ఆండ్ర శేషగిరిరావుగారు బి.ఏ.

బైరన్ (Byron) కవి విద్యార్థిదశలో మొద్దబ్బాయి అనిపించుకొనెను. లెక్కలు, పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics) అతనికి బొత్తిగావచ్చునవికావు. న్యూటన్ (Newton) మహాశయుడు రేగిపండురాలుటచూచి కనిపెట్టిన భూమికి ఆకర్షణశక్తి కలదనుసూత్రము (Law of Gravity) బైరన్‌కు తలక్రిందులుపడినను తెలియరాలేదు. అది తెలిసికొనలేక ప్రాణముసిగి ఆతడు 'న్యూటను రేగిచెట్టునుండి పండుపడుటచూచిన నిమిషమునుండియు మానవునికష్టములు ప్రారంభమైనవి' అన్నాడు.

... ... ...

స్విఫ్టు (Swift) నిందాగర్భితములగు హాస్యకావ్యములను వ్రాయుటలో దిట్ట. ఒకసారి ఆతడు తాను వ్రాసిన పద్యకావ్యమునకుచివర బెటిస్‌వర్తు (Bettes--worth) అనువానిని నిందించుచు కొన్నిచరణములు వ్రాసి ఆగ్రంథమును ఆతనికిపంపెను. బెటిస్‌వర్తు వినోదముగ బంధుహితవ్రాతముతోగూడియుండ ఆ పుస్తకము ఆతనికందెను. ఆతడు పుస్తకమునుబిగ్గరగా చదివి కూడియున్నవారికి వినిపింపదొరకొనెను. అనాలోచితముగ తన్నుగూర్చినవాక్యములనుగూడ చదివివైచెను. చదివివైచి వానిఅర్థమునుగ్రహించి కోపోద్దీపితుడై కంపించుకరములతో జేబునుండి మడతచాకు తీసి దానినివిప్పి స్పష్టవచనములతో 'నేనీచాకుతోడనే ఇదివ్రాసినవానిచెవులు కోసివేతును' అని శపథముచేసి స్విఫ్టుఇంటికి బోయెను. ఆతడు ఇంటివద్దలేడు. ఆతని మిత్రునిఇంటికిబోయి బెటిస్‌వర్తు ఆతనినిగూర్చి విచారించినాడు. ఇంతలో స్విఫ్టువచ్చి 'అయ్యా! ఏమిసమాచారము?' అని నెమ్మదిగనడిగెను. 'ఈపద్యములను--నన్నునిందించుఈచరణములను--వ్రాసినది నీవేనా?' అని ఆతడు కోపముతోప్రశ్నించెను. ఏమాత్రమును చలింపక స్విఫ్టు ఇట్లుచెప్పెను: "అయ్యా! నాచిన్నతనమున లార్డు సోమర్సు (Lord Somers) అను న్యాయవాదిప్రముఖునితో నాకు పరిచయముగలదు. దూషణకావ్యములువ్రాయుటయందు నాకుగల కుతూహలమునుగమనించి ఆన్యాయవాదిప్రముఖుడు 'నేను ఒకమూర్ఖునిగాని నీచునిగాని నిందించుచో దానిని నారచితముగా చెప్పకొనవలదని ఉపదేశించినాడు. ఆఉపదేశమననుసరించి ఈదూషణపద్యములనువ్రాసినది నేనుకాదని మీకు చెప్పుచున్నాను."

... ... ...

కవులు తమజీవితకాలమున తమకావ్యములనుగూర్చి అభిప్రాయములను మార్చుకొనుచుందురు. ఒకనిదర్శనము. బారన్‌హేలర్ (Baron Haller) ఒకకవి. ఆతడు యౌవనమున అప్పటి తనపద్యములనుగూర్చి మిక్కిలి మక్కువపడువాడు. ఒకసారి ఆతనియింటికి నిప్పుతగిలెను. తగులబడుచున్న ఆఇంటియందుండిన తనపద్యసంపుటిని సంరక్షించుటకు ఆతడు ప్రాణములకుతెగించెను. తాను ఏపద్యములసంపుటిని ప్రాణములకైనతెగించి మంటలోబడకుండకాపాడెనో ఆ పద్యములసంపుటినే మతి పదిసంవత్సరములకుపిమ్మట ఈకవి తనచేతులార మంటలోవైచెను.

... ... ...

మిల్టన్ (Milton) కవి అంధుడు. పద్యములను ఆశుధారలోచెప్పువాడు. అవి ఎవరువ్రాయుచుండిరి? ఆతనికూతుండ్రు. తండ్రిచెప్పినదివ్రాయుటతో వారిపని పూర్తిగాదు. గ్రీకు, లాటినుభాషలందలి సుప్రసిద్ధకవులకావ్యములను వారు మిల్టనుకు వినోదముకొఱకుగాని, విషయపరిగ్రహణముకొఱకుగాని, కాలక్షేపముకొఱకుగాని చదువవలసియుండునది. పాపము వారికాభాషలురావు. అయినను కష్టించి తండ్రికొఱకు ఆ బాలికలాకావ్యములనుచదువువారు. మిల్టన్ తన కావ్యమును (Paradise Lost) ఇట్టిపరిస్థితులలో రచియించెను.

... ... ...

కావెడుగ్రంథములనురచియించిన ఒకగ్రంథకర్త 'లేఖకునిసాయమున గ్రంథములురచియించుట మన

కష్టము నెంతో తగ్గించును' అని ఒకసారి ఉపన్యసించెను. 'అదియెట్లు?' అని గోల్డుస్మిత్తు (Gold smith) ఆతనిని అడిగెను. 'ఏమి! గదిలో పచారుచేయుచు చెప్పుచుందును. చెప్పినదానిని లేఖకుడు వ్రాయును. అంతయుఅయినతరువాత దానినొకసారి సరిచూచుటతో నాపనిముగియును.' గోల్డుస్మిత్తు ఇదివిని ప్రమోదితుడై మఱునాటియుదయమున ఆతనిలేఖకుని తనకడ కొకసారి పంపమనికోరెను. ఆకోరికననుసరించి మఱునాటియుదయమున లేఖకుడు గోల్డుస్మిత్తు ఇంటికివచ్చెను. కలము, కాగితము, సిరాబుడ్డి ముందర నిడుకొని ఆలేఖకుడు కవిగారుచెప్పునది వ్రాయుటకు సర్వసిద్ధుడయ్యెను. గోల్డుస్మిత్తు శాంతిమయచిత్తముతో గదిలో అటునిటు పచారుచేయదొడగెను. పలుసారులు పచారుచేసెను. పచారుచేయుటయేగాని పెదవివిడుట లేదు. అనేకవిధముల ప్రయత్నించెను. కాని పలుకు రాలేదు. తుదకు ఆతడు తనచేతిని జేబులోనికి పోనిచ్చి ఒకగినీ (Guinea: బంగారునాణెము) నాణెమునుతీసి లేఖకునికిఇచ్చి 'మిత్రుడా! ఈపద్ధతి నాకు సరిపడలేదు. నాచెయ్యిఆడినగాని మనస్సు ఆడనట్లున్నది. మనస్సు, చెయ్యి రెండునుకలసి పనిచేయవలసియున్నది' అనిచెప్పి ఆతని పంపివైచెను.

... ... ...

వోల్టేరు (Voltaire) ఒకఫ్రెంచికవి. ఆతడు కొంతకాలము లండనులోనుండెను. అప్పుడు ఆతనికి పోప్ (Pope) అను ఆంగ్లకవితో స్నేహమైనది. పోప్ఇంట ఆఫ్రెంచికవి పలుసారులు విందులుకుడుచువాడు. పోప్కుటుంబమునందలి వారందఱితోను వోల్టేరుకు మంచిపరిచయమేర్పడెను. వోల్టేరు కొంచముమర్యాద నతిక్రమించినడచువాడు. పోప్ ఇంటలేనిసమయమునుచూచి ఒకనాడు వోల్టేరు పోప్తల్లిదగ్గరకుపోయి 'అమ్మా! లండనుమహానగరమున ఖర్చుజాస్తి. కాబట్టి అమ్మివేసి డబ్బుపొందుటకు నేనొక కావ్యమువ్రాసితిని. అది యొకదూషణకావ్యము. నిన్నుగూర్చినది. నీవు కష్టముగూర్చుట నాతలపుగాదు. అయినను డబ్బుఅవసరముకొలది నేను దానిని ప్రచురింపక తప్పదు. కాని నీవే కొంతసొమ్మిత్తువేని నేను దానిని ప్రచురింపమానుదును' అని చెప్పినాడు. ఆతనిపాచిక పాఱినది. ఆమె ఆత డడిగినధనమిచ్చినది. ఇట్లిచ్చినట్లు ఎవరితోనైన చెప్పుచో ఆకావ్యమును వెంటనే ప్రచురింతునని వోల్టేరు ఆమెనుభయపెట్టెను. కావున ఈ విషయము ఆమె తనకొడుకుతోకూడ చెప్పలేదు. ఇట్లుండ మఱియొకసారి ధనముఅవసరమువచ్చి వోల్టేరు ఇదేపన్నాగము తిరిగిపన్నెను. కాని ఇది నడుమను తెగిపోయెను. కుపితయై తల్లి వోల్టేరుతోమాట్లాడుచుండ చుక్కతెగిపడ్డట్టువచ్చి పోప్ సంగతితెలిసికొనెను. వోల్టేరు చిక్కులోపడెను. పారిపోవుటకు అవకాశములేదు. మొక్కవోని మాతృభక్తుడగు పోప్ ఈలోగా వోల్టేరును కవిసి పిడికిటిపోటులు బహుమానమిచ్చెను. ఆపిడికిటిపోటులు తప్పించుకొని పారిపోవుప్రయత్నములో వోల్టేరు ప్రక్కనుఉన్నకుర్చీపైనుండి పిల్లిమంత్రముకొట్టెను. మొగముపై ఉసిరికకాయంత బొప్పికట్టెను.

# నెచ్చెలికి

జనమంచి కామేశ్వరరావుగారు

## ఉగాది

౧

ఒకక్రొత్తహాయులు నీనడలలోశోభిల్ల
ఒకక్రొత్తయాస నీజీవికన్చివురొత్త
ఒకక్రొత్తపాట నీయెదలోనరాగిల్ల
ఒకక్రొత్తవెలుగు నీమోవికళలనుదేర

౨

నీగృహద్వారముల్ తెరచి వేకువవేళ
దేహళీపార్శ్వాననిలచి భూపాలతో
పూలసాలకినెక్కి వాహ్యాళిసేవించు
దేవి వాసంతికను, లోనికిన్గొనితెమ్ము.

# మాతృప్రేమ

వేంకట కాళిదాస కవులు

ఆశ్వయుజమాసము. ఆకసమునడుమనున్న సూర్యబింబము మేఘావృతము.

వీధిగుమ్మముకడ నొకబండి యాగినది.

"బాబుగారి యిల్లు ఇదిగో వచ్చినదే!" అనుచు తటాలున క్రిందకుదిగినాఁడు పదియేండ్ల బాలుఁడు. అతనిముఖము హృదయావేగముతో వికసించినది.

"నాయనా! తాపీ!" అనుచు వృద్ధుఁ డొకఁడు బాలునివెంట బండిలో నుండి దిగినాఁడు. బండివాఁడు సామానులఁదీయుచుండ నతఁడు చూచుచున్నాఁడు.

అప్రయత్నము, అనాలోచితమునగు మనోవేగమో, సద్యోవిచ్ఛిన్నచిర వియోగజనితమగు హృదయసంభ్రమమో ఆబాలుని నటనుండి క్షణకాలమున లోనికిఁగొనిపోయినది.

పాషాణఘాతమునకు జలధితరంగమువలె నతనిగమనము నట్టింటిద్వారము కడ నాగిపోయినది.

నలుబదియేండ్లు దాటిన బ్రాహ్మణుఁడు, ముప్వురుకుమారులు పంక్తిఁ దీర్చి భోజనములుచేయఁ గూర్చుండిరి. మడిఁగట్టుకొని యిల్లాలు వడ్డించుచున్నది. పసుపుపూసిన నెమ్మొగము; చక్కని కుంకుమబొట్టు. ఆగృహలక్ష్మి పూజ్యురాలు!

ప్రథమవీక్షాపతితమగు నీదృశ్యము బాలునిగమనము నరికట్టినది. అతని వాఙ్మనఃప్రవృత్తులుగూడఁ గట్టువడినవి. ద్వారమునకుఁజేరఁబడి కాలుఁగదలించుచు తలుపుగొళ్లెము చేతఁబట్టుకొని శూన్యదృక్కులతో నిలువఁబడి పోయినాఁడు బాలుఁడు.

చాలదూరము రైలుప్రయాణముచేసివచ్చిన బాలుని యంగము లలసిపోయినవి. కేశములు రేగిపోయి వదనమునఁ దాండవించినవి. దుస్తులు మాసిపోయినవి. ఏమిచేయఁదోపక వెఱ్ఱివానివలె నిలువఁబడినాఁ డతఁడు.

ఆయిల్లాలు బాలునిఁగాంచి "ఎవరివాఁడవు? నాయనా!" అని పలుకరించినది.

అమాయికత్వము, అజ్ఞానము ఆక్రమించిన యతని అతికోమలమగు నంతరంగమునకు అనుకోని యాపలుకరింత అశనిఘాతము! సగమువాడిన

మోము పూర్తిగఁ గళాహీనమైనది. నింగిముట్టిన అతనియాశలు నేలమట్ట మునకువచ్చినవి. ఏడేండ్ల కఠినవియోగమువెనుక లభించిన ప్రథమమాతృ దర్శన మతని కర్థముకాని యంధకారమైనది. జన్మస్థలమునందలి దసరా పండుగలకు సరదామెండుకొనిన బాలుని లేయెడఁదలో భావము మెరుపువలె కళవళించినది. రుద్ధమైన కంఠములో నీరవించిన దుఃఖము నిలిచి యడ్డుపడి నది. అజ్ఞేయవేదనాభారమున నతనిశీర్ష మవనతమైనది. అప్రయత్నముగా నయనములనుండి యశ్రుబిందువులు బొటబొట కారిపోయినవి. ఆయశ్రువు లలో మూగవడిన విషాదమునకుఁ గలఁగి మేఘుఁడుకూడ బాష్పములు రాల్చినాఁడు.

కుమారునిబాష్పము లాయిల్లాలి యెదందఁదాకి మరపుపూతను దుడిచి మాయమొనర్చినవి. బాలునియాకృతిలో నేడేండ్లక్రిందట నెడఁబాసిన ముద్దు కుమారుని రూప మామెసద్యోవికసితమగు నంతర్దృష్టికి గోచరించినది. మడిఁగట్టుకొన్న మాట మరచిన మాతృలోకమతల్లి కుమారుని నొడిఁబెట్టు కొన్నది.

కట్టువడినకంఠముల మూగితనము; అన్యోన్యహృదయావేగనిస్వనముల మధురగానము. పరస్పరబాష్పధారాసమ్మేళనమునఁ బ్రేమలోకమే యిమిడి పోయినది. కొంఁది నిమిషములు నిశ్చలముగా నీరవముగాఁ గడచి పోయినవి.

* * *

వెనుక నాయిల్లాలు భర్తతోనన్నవాక్యము: "అన్నవస్త్రులోపమున సంతానము సంతప్తమెననగుఁగాక; పుత్త్రివంతులగు పగవారికయినఁ బుత్త్రి దానదారిద్ర్యముమాత్రముపలదు."

## ఆశీస్సు

శ్రీమతి సోమువేదము సీతారామమ్మగారు

శ్రీవినిర్మితనవ్యచిత్రసంచయకళా
  నికరమ్మునకు మేటినిధియటంచు
సాధ్వీమణులహృద్యసారస్వతవ్యాస
  రాజమ్ములకు స్థానరాజమనుచు
ఆంధ్రనారీసంచయారోగ్యభాగ్యంబు
  సుచిరమ్మొనర్చు కాణాచియనుచు
సీమంతినీజనాశేషసౌభాగ్యంబు
  విస్తరించెదు నవ్యవిదుషియనుచు
నతులకీర్తినిగాంచి, యీయాంధ్రభూమి
నుంటి విట్టులె చిరకాలముర్విమీద
నిత్యకల్యాణివగుచును నెగడుమమ్మ!
మహితగృహలక్ష్మి! స్త్రీజనమాన్యలక్ష్మి!

# ఇల్లాలు

మల్లాది రామకృష్ణశాస్త్రి గారు

౧

'ఎవరావచ్చేది...ఏమేయ్...చూడు, మనఅల్లుడిలాగున్నాడు...' అన్నాడు అప్పిరెడ్డి.

రత్తమ్మ గుమ్మందిగి ముందుకువచ్చి నిదానించి చూసి...'అవును మన రామయ్యే...దానిమీంచి లేండి...కూర్చుంటాడు...' అని మాట్లాడుతూనే లోపలికివెళ్లిపోయింది.

'ఏమయ్యోవ్...రా...ఇలా కూర్చో...' అని అప్పిరెడ్డి కొంచెంపక్కగాజరిగి అల్లుడికి చోటు చూపించాడు మంచంమీద. రామిరెడ్డిచేతికర్ర అరుగుకుఆనించి, మెట్లక్రిందుగా చెప్పులువిడిచాడు... రత్తమ్మ నిలువుచెంబుతో నీళ్లుపట్టుకునివచ్చి అరుగు చివరగాపెట్టి లోపలకువెళ్లి తలుపోరగానిలుచున్నది.

'ఇంటిదగ్గర అందరూ క్షేమమేనా?...చాలా పొద్దెక్కి బయదెల్లినట్టుందే...' అని అడిగింది రత్తమ్మ. 'ఆ...అందరూబాగానేఉన్నారు...ఈ మద్ధెను...ముసలమ్మకు జబ్బుచేసింది...నాలుగు రోజులు ధారకమేలేదు...కటికిలంకణం...ఇప్పుడు కాస్తనింపాదే' అని రామిరెడ్డి జవాబుచెప్పాడు.

'ఓపాయఇట్టాఅందుకో'...అనిఅప్పిరెడ్డి భార్యను కేకవేశాడు...రత్తమ్మ పొగాకూ, అగ్గిపెట్టె తెచ్చి యిచ్చింది. ఆతడు సావకాశంగా చుట్టచుట్టుకుని, ముట్టించి అక్కడనుంచిలేచాడు.

'చేనుకాడికి వెళుతుండావా? మామా!... నేను కూడారానా?' అన్నాడు రామిరెడ్డి.

'నీవెందుకులేవయ్యా...నడిచినడిచివచ్చావు... ఆయన్ని వెళ్లిరాని...ఇదుగో...అక్కడేకూర్చోకే... కుప్పపడవోయించి ఇంటికిరాండి. మళ్లా ఆనికె వెళుదురుగాని...' అన్నది రత్తమ్మ.

'సరేలే... నేనిట్టెతిరిగివస్తానుకాని...నీవు కాస్సేపు పండుకోవయ్యా...మరే...ఇదుగో నేవ్! పిల్లకాడ్నె పర్నయినాపంపి...పొట్టిబామ్మడిచేలో, వంగ పిందెలున్నాయి పట్రిమ్మను...అంజిగాడు జనపకట్టలు కడుతున్నాడుకామోలు...' అని అప్పిరెడ్డి వెళ్లిపోయినాడు.

* * * *

'ఏమోనమ్మ ఎక్కడకుపోతుందో...అస్తమానం ఆ ఇల్లు ఆ ఇల్లూ పట్టుకుతిరగడమేకద!... మొగుడు వచ్చినా ఇంట్లోఉండదాయెను...ఇదుగో సుబ్బమ్మా! అక్కడెక్కడన్నా మాపిల్లుంటేపంపమ్మ...ఏమేవ్! అమ్మాయీ!' అనిరత్తమ్మ కూతురినిపిలువడం మొదలుపెట్టింది...దొడ్డివేపు గుమ్మందగ్గరనుంచుని... 'అమ్మాయ్...ఓ...అమ్మాయ్...అబ్బ ఎక్కడకుపోతుందోనమ్మ ఇట్టేమాయమౌతుంది...అమ్మాయ్'.

'ఎందుకే అలాకేకలేస్తావు...వస్తూంటినిగా...' అన్నది కనకం.

'ఏంరావడం...ఎంతసేపటినుంచి పిలవడం... ఎక్కడికివెళ్లావే?'

'ఇప్పుడేకాదటే...వాళ్లలక్ష్మమ్మ వెళ్లిపోతూందని చూడటానికి డాబా కోటయ్యగారియింట్లోకి వెళ్ళాను...,ఇంతలో ఏంపనివచ్చిందమ్మ?'

'ఏంపనా?...నీవు నాకు పనీచేయక్కర్లేదు, పాటాచేయక్కర్లేదు...ఇంటోఉందూ చాలు...ఎవరొచ్చారో తెలుసునా?'

'ఎవరు?'

'ఎవరో...చూడు...పందిట్లో...'అని రత్తమ్మ నవ్వింది...కనకంగ్రహించి సిగ్గుపడి తలవంచుకుంది.

* * * *

'ఎక్కడకూర్చుంటే అక్కడేనాయెను...రెండు జాములుతిరిగింది. మీనాయన ఇంకా జాడాజవాబు లేదు. పోనీ ఆయనకుపెడతాను తింటాడేమో కనుక్కోవే, అమ్మాయ్'!

కనకం వినిపించుకోనట్లూరుకుంది.

'నిన్నేనే...అన్నంకంచంలోపెడుతున్నాను... కాస్తపిలవవే...' అనిరత్తమ్మ బిగ్గరగాకేకవేసింది.

'అబ్బ...ఏమిటే...నీవుపిలువరాదా?'

'ఎంతసిగ్గేఅమ్మ...మాటాడకుండానే మొగుడితో కాపురంచేస్తున్నావా?...రేపు మీ ఊరు వెళితే... అక్కడా నేనేవస్తానా...పిలవడానికి.'

'చాల్లేవే...నీమాటలు...మరీ నేర్చుకుంటున్నావు. నీవుపిలవరాదేం...మాఇంటికా బంధువులొచ్చింది... మాయింటికా?'

'అవును లే అమ్మ...నేనేపిలుస్తాను...మాయింటి కే వచ్చింది బంధువులు...మాఅమ్మాయిమొగుడొచ్చాడు...మాబంధువుణ్ణి పలుకరించావాఅంటే చూడు చెపుతా...' అని నవ్వుకుంటూ రత్తమ్మ వెళ్లిపోయింది.

౨

'ఏమంటావు మామా!'

'అబ్బ! ఉండవయ్యా...ఇప్పుడే తిరిగితిరిగొచ్చాను...తెల్లారి అడుగకూడదూ...లే...భోంచేతాము.'

'కాదుగాని...నేను చెప్పేమాటవిందూ...మళ్ళా తెల్లారాఅంటే, నీవు కోడికూయకముందే లేచి పొలమెళుతావు...మాఅత్తాఅంటే ఏంచెప్పినా వినిపించుకోదు...మరి నాసంగతికూడాఆలోచించు...ఒంటరికాడ్ని.'

'అయితే...పదిరోజులుపాటన్నా ఉండకుండా అప్పుడే ఏమంతతొందరవచ్చింది? పండగ ఇంకా ఎన్నాళ్ళుంది?...పౌర్ణమి ఎల్లుండికాదూ...రేపు వారంకాక, ఆపైమంగళవారమేకాదూ? ఇంతలో ముంచుకుపోయేదేముంది?...లే...పొద్దోతూంది.'

* * * *

'ఏమే అమ్మాయి!—మీఆయన ఏదిపడితే అదే పట్టూ! చెపితేవినడే...నిన్నుతీసుకువెళ్ళడానికి వచ్చాడుట...పోనీ నీవన్న చెప్పరాదుటే...అప్పుడే ఏం తొందరవచ్చింది...మరి నాలుగురోజులుపాటు ఉండనీయమని.'

'..............'

'ఏమాటకీ సమాధానంచెప్పకుండా ఊరుకుంటావు ఏలానే...నేనుచెపుదామా పోనీఅంటే, మీనాయన మాటే లక్ష్యపెట్టడాయెను...మీరిద్దరూ ఏమాలోచించుకున్నారు?'

'..............'

'ముద్దరాలుపుట్టిన మూడోనాడు పుట్టావాయెను. ఏమాటకీ అవుననవు...కాదనవు...ఏలాచెప్పమరి... ఏమోనమ్మ...నాకుమటుకు...మీరు ఇప్పుడువెళ్లడం సుతరాం ఇష్టములేదు.'

* * * *

'రేపు తెల్లారగట్టే వెళ్ళిపోతామంటున్నాడే... అల్లుడు...ఏమంటావు?'

'ఏమంటాను...మధ్య నా నోరు ఖాళీ అవటమే కాని...వద్దంటే మానుకుంటాడా.'

'వద్దనడమెందుకూ...ఇవాళకాకపోయినా మరి నాలుగునాళ్ళు తాళినా...వాళ్ళయింటికి వాళ్ళు వెళ్ళాలిసిందేకాదూ...నీవు అడ్డంచెప్పమాక.'

'మీతీర్పాఇదేనా...లక్షణంగా...పండగపూట పిల్ల నట్టింటఉండకుండా...ఇన్నాళ్ళూఉండీ తీరా ఇప్పుడు వెళ్ళడమేమిటీ?'

'ఏమోవాళ్ళయిష్టం...వెళ్లిరానీ...అయినా, ఇంతకూ అమ్మాయి ఏమంటుంది...దాన్ని కనుక్కున్నావా?'

'ఏంకనుక్కోను...ఏమాటకీ మెదలకుండా ఊరుకుంటుంది—ఎమో, ఇద్దరూ ఆలోచించకుండా ఉన్నారూ?..మనం ఎన్ని చేసినా...ఎంతపెట్టినా... మనమీదఎందుకుంటుంది దానికి అపేక్ష...ఎప్పుడు దూసుకుందామాఅని...ముండ్లమీదకూర్చున్నట్లుంది.'

'అవునే...లేకపోతే ఎల్లకాలం నిన్నుకనిపెట్టుకుని కూర్చోమన్నావాఏం...నాకుమాత్రం పిల్లఉండటంచేదా...మనం ఎన్నాళ్ళుపెంచితేనేం...పరాయివాళ్ళపిల్ల...ఆడపిల్లనగానే ఇంకోరిసొత్తు...వెళ్ళేది ఎక్కడికీ కానిపోనిచోటికా...దానియింటికి అది వెళుతుంది...మధ్యన మనమెవరం?'

'ఆ...దానియిల్లు...ఇల్లంటూ అక్కడుంది.అన్నగారితో పోట్లాడివచ్చాడట...నేను విన్నానులే... దీన్ని తీసుకువెళ్ళి వేరుకాపురంపెడతాడుకాబోలు

చిన్నతనం...దాని మోహం...ఇప్పటినుంచీవెళ్ళి ఒంటరికాపురం ఏంచేయగలదు? అందులో ఇదే తొలి సారాయెనువెళ్ళడం?'

'ఆడపిల్లయినతరువాత, పనీపాటా చేయకుండా తప్పుతుందీ...మనకంటే మహామహావాళ్ళు చేసుకుంటున్నారు...మనపంతులు బావమరది...సూరయ్యగారికూతురు...చిన్నపిల్లేకాదూ...ఒక్కత్తేఉండి చేసుకోడంలా?...వారికన్న మనమేం...ఎక్కువ?'

'సరే...మీయిష్టం...అయినా మీరు కనుక్కోరాదూ...మీరుచెపితే వింటుందేమో.'

'మళ్ళా మొదలా...ఇక మాటాడమాకనీవు.'

*　　*　　*　　*

తూర్పు తెల్లవారుతూంది.

'ఒరేయ్ అంజిగా! పొద్దెక్కిపోయె...పొద్దెక్కిపోయె. త్వరగాబండికట్టరా...అగెవద్దు...దాపట ఆ బక్కదాన్ని కట్టు...కానీరా, జాము న్నర చేస్తున్నావు...మళ్ళా ఎండెక్కుతుంది...' అని అప్పిరెడ్డి ప్రయాణానికి ప్రయత్నాలుచేస్తున్నాడు...రత్తమ్మ కూతురిసామానులన్నీసర్ది, ఒక్కొక్కటే నడవలోకి తీసుకునివచ్చి పెడుతూంది...అంజిగాడు అవన్నీ బండిలోకి ఎక్కిస్తున్నాడు...రామిరెడ్డి ఉత్తరీయం వేసుకుని చెప్పులుతొడుగుకుని యింటిముందు అటు ఇటు పచారుచేస్తూన్నాడు.

అందరితోనూ...వెళ్ళివస్తానని చెప్పి కనకం బండి ఎక్కింది...రత్తమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది... ఆమెనుచూసి చూడవచ్చినవాళ్ళందరూకూడా కళ్ళు తుడుచుకున్నారు.

'ఎందుకే అమ్మా...! నీవురాలేదుటే...ఆలాగే నేనూ వెళుతున్నామాయింటికి...' అన్నది కనకం బండిలోంచి...వచ్చేకన్నీరు ఆపుకుంటూ.

అప్పిరెడ్డి చలించిపోయినాడు...కాని బయటికి మాత్రం తొణకకుండా...'కానీ...ఇక బండిసాగనీయండ్రా.' అని కేకవేశాడు తన ఉద్వేగం ఎవరూ గ్రహించకుండాఉండాలని.

'కనుముసాటికి మళ్ళాపంపుసాయనా!...ఏమో.. ఇక మీపిల్లేఅయెను...ఎన్నడన్నా...నీదయవచ్చి పంపితే కళ్ళచూస్తూంటాము' అని వెనుకనుంచి కేక వేసింది గాద్గదికంతో రత్తమ్మ.

## 3

'వెల్లావుపాలుతీసావా?'

'లేదు'

'ఏం?'

'నిన్న తీ స్తేత న్నింది...అది యిచ్చేదే నాలుగు చుక్కలు...అకాసినీఒలికిపోతే చేసేదేముందీ?'

'అందుచేత ఇవాళమానేశావా?'

'పోనీ తీయమంటేతీస్తాను.'

'నేను చూస్తూనేఉన్నాలే...పనంటే బద్ధకించి ఇన్ని వేషాలు పోతున్నావు...నీవుచేయకపోతే నీబాబెవరు చేస్తారనుకున్నావు?'

'ఇంతలో నే అంత చిరాకెందుకూ...అలవాటయితే నేనే తీస్తానుగా...పాలు వృధాగాపోతాయని ఊరుకున్నాను.'

'చేసినపనికి ఇంకా మెదలకుండా ఊరుకోక నీలుగుత్తావేమంట!...తీయి...ఎలాతంతుందోచూస్తాను.'

'తన్నినతరువాత చేసేదేముంది?'

*　　*　　*　　*

'భూషమ్మగారింటికెందుకువెళ్లావు?'

'ఏమీ?'

'ఏంఏమిటి...ఎవర్నడిగివెళ్లావు?'

'..............'

'దాంతో నీకేంసావాసం: అదెల్లాటిదో నీకు తెలుసునా?'

'పోనీ వెళ్ళద్దంటే మానేస్తాను.'

'అసలు ఎందుకు వెళ్లావంట?'

'భూషమ్మకోడలిది మాఊరేకాదూ...ఆ సావాసాన వెళ్లాను.'

'అదా...అదోరంగులరాణి...దానికినీకు ఏం స్నేహం?'

'మీకెవ్వరూ పనికిరారు...ఆఅమ్మాయి నేనూ చిన్నప్పటినుంచీ ఆడుకునేవాళ్ళం...చాలామంచిది. దానికే వంకబెడుతున్నారేం?'

'ఆదెల్లాటిదో తెలుసునా?'

'ఆఁ... తెలుసును...మీరు అక్కర్లేనిమాటలాడమోకండి.'

'దానిమీదఅభిమానం నామీదలేదేనీకు...నీకూ దానిలాగానే ఉండాలనిఉందాయేం?...మీఅమ్మా..నాయనా...ఇదేనా...నీకు చిన్నప్పటినుంచీ నేర్పింది...ఇంకనుంచి ఇల్లుకదిలావా అంటే చూసుకో.'

* * * *

'ఇంత సేపేంజేస్తున్నావు...పనిఉండిపిలిస్తే కలికానికన్నా కానరాకుండాపోతావేం?'

'నేనేంఆడుకుంటున్నానా?...భావికాడికి నీళ్ళు తేబోయినా.'

'భావేం పట్టుకువదలనందా?'

'లేదు...మరే...మీరు కోప్పడనంటే చెపుతా...సూరమ్మగారి సోమమ్మ మొగుడిని...పండుగకు తీసుకువచ్చారుట...చిన్నబ్బాయి మరదలేఁ...నన్నుకూడా రమ్మంది...చూసివద్దామంటే వెళ్లాను.'

'ఏం చూశావు?...బాగున్నాడా?... నచ్చాడా?'

'ఏమిటి?'

'లేకపోతే పరాయిమొగవాడిని ఏమనిచూడబోయినావు?...నీవు సానిదానివా?...ఓహో...హో. నాసంగతితెలిసుడు నీకింకా...ఊఁ.'

* * * *

కనకం కాపురానికివచ్చి రెండు నెలలైనది. ఎప్పటి కబుర్లు అప్పుడు తెలుస్తున్నా...తండ్రయినా ఓమారు వచ్చి చూసిపోయినాడుకాదని చాలా అనుకుంటుండేది. పైగా ఎంతోదూరంకూడాలేదు...ఏలాగైనా తీరికచేసుకునిరావలంటే రానేవచ్చును...అయినా అప్పుడు పనిఉద్దడిరోజులుకావుకూడాను.

కనకానికి యింకా చాలాచిన్నతనం...అయిన యింటపుట్టినపిల్ల...పైగా తలిదండ్రులకు ఒక్కతే కూడానేమో...తగని గారాబాన...అటుచెంబిటు తీయ నవసరములేకుండా...పెరిగింది...పల్లెటిదిక్కున పుట్టినా...చిన్నప్పటినుంచీ పనిపాటులేమీ చేసి ఎరుగదు...ఎన్నడైనా...సరదాకు ఏపనిఅయినా చేయవచ్చినా...తల్లి అడ్డంవచ్చి చేయనిచ్చేదికాదు. చిన్నతనమంతా చాలాచక్కగాగడిచిపోయింది ఆటపాటలతో...తండ్రిపోలికెపిల్ల...మంచి అదృష్టమంతురాలవుతుందని అందరూఅనేవారు...చాలా అల్లరిపిల్ల...కనకం చిన్నప్పటినుంచీ...అయినా సౌమ్యశాలు...కులాసాకోసం...ఉబుసుపోక...సంతోషంగా అల్లరిచేయడమేకాని ఎన్నడూ ఎవరినీ నొప్పించిఎరుగదు...ఆఅల్లరయినా, అందరూచూసి హర్షించేటట్టుగానేఉండేది.

కనకానికి తండ్రిమీద చాలాప్రేమ—అప్పిరెడ్డికి కూడా కూతురంటే ప్రాణపదము—తల్లిదగ్గరకన్న అతనిదగ్గరే ఎక్కువచనువు...'అమ్మా! ఆడపిల్లయినది ఒకరిచేత వేలువంపించుకోకుండా...ఇటుపుట్టినయింటికీ అటుమెట్టినఇంటికీ పేరుతీసుకురావాలి...అందరిచేత అవుననిపించుకుని వన్నెవాసితో...చక్కగా కాపురంచేయాలి.'అని అప్పిరెడ్డి చిన్నప్పుడేఉపదేశం చేశాడు...తండ్రిమాటమీద లక్ష్యముంచి, ఒకరిచేత [illegible]డా-మీద ఈగవాలనిచ్చేదికాదు...ఎవరన్నానోరుజారి ఏమన్నాఅంటే పీకిపాకంపట్టేది—ఆలాగే ఎవరినీ ఏమీఅనకుండా...చాలా చక్కగా పెరిగింది...కాపురానికివెళ్ళినతరువాతకూడా...ఇక ఎన్నటికైనా సరే. అంతే!

కనకానికి మగనిమీద తగనిఆపేక్ష. మేనత్త మేనమామబిడ్డలుకాకపోయినా, అంతకన్నా ఎక్కువగా కలిసిమెలిసిఉండేవారు...రామిరెడ్డికూడా...పరాయిసంబంధమైనాఏమీ ఎబ్బెట్టులేకుండా, వస్తూపోతూ, అత్తవారితో చాలాచనువుగాఉండేవాడు. స్వతఃమంచివాడుకూడాను...విశేషసంపన్నుడుకాక



స్వీడను దేశపు యువతులు సముద్రతీరమున వ్యాయామము చేయుట



ప్యారిస్ హోటలులో స్త్రీలు నాట్యమునకు తయారగుట

పోయినా...అన్నవస్త్రాదులకు లోటులేకుండా జరిగి పోయేవసతిఉన్నది రామిరెడ్డికి...అయినా ఏది. వచ్చినా ఆదుకునేందుకు...పెద్దఅండ...మామగారున్నాడాయెను! చిన్నప్పటినుంచీ చాలామంచివాడే...పెద్దవాడై...తనవ్యవహారం తానుచూసుకోగల నేర్పువచ్చినతరువాతనూకూడా చాలామంచివాడే...కనకం కాపురానికివచ్చినతరువాతను కూడా ............కాని......

## ౪

రెండుఝాములవేళ.

కాలువగట్టువెంటనే మామిడితోపుదాకా వెళ్ళి పక్క 'సులోబీ'లోంచి అడ్డదోవను చింతలకోడుచ్చుకున్నది కనకం...రామిరెడ్డి పడమటచేలో గడ్డ విరిపిస్తున్నాడు...భోజనానికి యింటికిరానని కబురు పంపాడు...సమయానికి ఎవరూలేకపోవడంచేత కనకమే అన్నంపట్టుకు బయలుదేరింది.

దూరాన్నుంచేచూసి రామిరెడ్డి కాళ్లూచేతులూ కడుక్కుని, తుమ్మచెట్టునీడకు జేరుకున్నాడు. కనకం తానుతెచ్చినగిన్నెమూట అక్కడపెట్టి తానుకూడా కొంచెంఎడంగా కూర్చున్నది.

మంచి ఆకలిమీదున్నాడు. మూటవిప్పడం వ్యవధానంగా...పచ్చడిబద్దలుచూపెట్టుకుంటూ...గబగబ నాలుగుముద్దల్లో అన్నమంతా తినివేశాడు...కాలువలో చేయికడుక్కుని, రెండుదోసెళ్ళు మంచినీరు త్రావి...చుట్టచుట్టుకుంటూవచ్చికూర్చున్నాడు. కనకం...గిన్నె తొలిచి మూటకట్టుగుడ్డ ఝాడించి...మళ్ళా రామిరెడ్డిసమీపానికివచ్చింది.

'ఇక వెళ్ళనా?'

'కూచో కొంచెంఉండి వెళుదువుకాని...నేనూ ఇదికాల్చి మళ్ళాలేస్తాను.'

'కాదు వెళ్ళాలి...తోడు మా. లెయటం మరచిపోయినాను...ఆలస్యమయితే యీకాలం సరిగా తోడుకోవు...లేగంటివికూడానాయెను...ఇంకా ఏముంది...జొన్నలుదంపించాలి...మరి.'

'అయితేపో...మళ్ళాఇంతచుట్టేందుకూ...అయ్యవార్లంగారిచేలోంచి వెళ్ళరాదూ?'

'ఎంతమట్టూ?...అయినా...ఈలాగేవెళ్తా...మిరపకాయలు కోసుకోవాలి.'

పదిబారలదూరాన మిరపచేనుంది. కనకం గట్టునే నిలుచుని పండుకాయలు తుంచుకుంటూంది.

'ఆఁ...—ఆఁ...'

కనకం అదిరిపడి వెనుదిరిగిచూసింది...—ఎంతసేపట్లోజరిగిందో...రెప్పపాటంత అవకాశంకూడా **లేదే**మో.

—పెద్దగిత్త, తలత్రాడు తెంచుకుని బెదిరి ఎగురుతూ...కనకంవైపుకు దూకుతూవస్తూంది...ఇంతలో...—ఏంజరిగిందో...రామిరెడ్డి క్రిందపడిపోయినాడు...గిత్త తీవ్రంగావిసిరివేసింది.

చుట్టుపక్క పనిచేస్తూన్నవాళ్ళందరూ పరుగెత్తుకునివచ్చారు...ఇద్దరు...ఆగిత్తనుపట్టుకుని ఆపేసారు. మిగతావారందరూ రామిరెడ్డిచుట్టూమూగారు.

ఎంతోసేపులేదు—కాని ఇంతజరిగింది.

చేష్టలుడిగి నిలువబడిపోయిందికనకం... తెలివితెచ్చుకుని అక్కడకు పరుగెత్తుకునిపోయింది...అందరూ ఆమెనుచూసి ఓసరిల్లారు.

కొమ్ములతో కుమ్మేసిందేమో...వెన్నున ప్రమాదమైనగాయమైంది రామిరెడ్డికి...అంతా నెత్తురుమయము...ఆతడు స్పృహలేకుండా పడిపోయి ఉన్నాడు.

కనకం ముందరికివెళ్ళి...ఆతన్ని మెల్లిగా లేవనెత్తి...తలను...తొడమీద ఆన్చుకున్నది...ఇద్దరు ముగ్గురు...గాయం శుభ్రంగా...నెమ్మదిగా...కడిగి...లేతపసిరికనలిపి...అదంతా చక్కగాఅద్ది దానిమీద ఒండుమన్నుపూశారు...కొంతసేపటికి నెత్తురు కట్టుపడినది.

'దీన్ని తెగ్గొయ్యా...పనిలేక కొవ్వెక్కిఏడుస్తూంది రా...కాడికిందవిరగ్గొట్టాలి...మళ్ళాబుట్టేడుతపుడు తింటావు కదలవేం...అహోయ్...అహోయ్...నిన్ను

మాదిగాడుదిన!...' అని ఓ ఆసామి...కోలుతో గిత్తమక్కల్లోపొడిచాడు.

'ఎందుకురా అలాకొట్టుకుంటావు...నోరువాయా ఉందాదానికి?'

'అదికాదమ్మా... మేంచూస్తూనేఉన్నాం...నీవు మిరపచేనుకాడ ఆగావు చూడు. పైటేం జెండా లాగా గాలికి ఆడుతూంది...అప్పుడే నాగలివిప్పి వదిలాం...తొగరుచీరేమో...చూసిబెదిరింది...' అని జరిగినకథచెప్పాడు మరోఆతడు కనకానికి.

'...రామయ్యచూశాడు...మాకన్న దగ్గరున్నాడేమో...నీమీదకువస్తూందని ముందుకు ఉరికాడు... ఇంతకూఈవాళ ఎవరిమొగంచూసి లేచాడోకాని.'

కనకం ఏమీమాటాడలేదు...కాని కళ్ళవెంట జొటజొట నీళ్ళుకారుతున్నాయి...—గుండె పగిలేటట్టు దుఃఖిస్తూంది...లోపలనే.

'ఊరుకో అమ్మా!...వాడికేం భయంలేదులే... పడుచువాడు.ఈమాత్రం భరాయించుకోలేడాఏం... నెత్తురుకట్టిందాచూడు...ఇక నాలుగురోజుల్లో గాయం మానదుతుంది...నీవుతప్పుకో అమ్మ... ఒరేయ్...అల్లాగ్గా పడుకోపెట్టండిరా...నీవుకూడా ఎక్కి...కదలకుండాఉంటుంది...జాగ్రత్తగాపట్టుకు కూర్చో అమ్మ.'

*　　*　　*　　*

రాత్రి ఓప్రొద్దువేళకు రామిరెడ్డికి బాగా తెలివి వచ్చింది...ఎదుట కనకం కళ్ళనీరుకారుస్తూ కూర్చుని ఉంది...అతడు లేవబోయినాడు...కనకం ఆతురతతో వారించింది...ఆమెమొగంచూసేసరికి...ఆమె పడుతున్నవేదన అర్థమయింది ఆతనికి. కళ్ళనీళ్ళ తిరిగినవి.

'ఎందుకు అడ్డంవెళ్ళారూ...' అని కన్నీరు బల వంతానఆపుకుంటూ ఏడుపువెక్కిళ్ళతోనే అడిగింది కనకం.

రామిరెడ్డి చాలానీరసంగా...మాటాడలేక... ఆమెవంక అదోమాదిరిచూసి నవ్వి ఊరుకున్నాడు.

'మీప్రాణంకన్న నేనుఎక్కువా?'

ఆతను తలఊగించాడు.

'నాకోసం...ఎందుకూ...మీరు...నామీద మోకు.'

కనకం ఇక శోకమాపలేక ఎలుగెత్తి ఆక్రోశించింది...రామిరెడ్డి తనరెండుచేతులలోకీ, ఆమెచేతిని తీసుకుని...కళ్ళు మూసుకున్నాడు...ఆతని కొలుకుల వెంబడే నీళ్ళుకారుతూనేఉన్నవి.

✂

'ఏంచేస్తున్నావ్ ...అమ్మాయి!...కనకమ్మా!... ఎక్కడున్నావమ్మా?'

'వచ్చే...ఇదుగో వస్తున్నా...కూర్చో నాగమ్మత్తా!'

*　　*　　*　　*

'ఇంతసేపేం జేస్తున్నావే...మారామయ్యఏడీ... లోపలఉన్నాడా?'

'లేరు...ఇంతకుముందే తాశీలుకట్టిరావాలని వెళ్ళారు.'

'లేదుగద!...సరే'

'ఏం అత్తా!'

'ఏముందిలే...—ఆహాఁ...ఏంవిచిత్రం!...కాల మెల్లా మారుతూంది?'

'ఏమి టావిశేషం?'

'చూసినకొద్దీ వింతవేస్తూంది...ఇవాళ చూసిన వాళ్ళు రేపు తారుమారవుతున్నారు...ఏం చోద్య మొచ్చిందమ్మా!'

'చెపుదూఅత్తా!'

'ఏమోలేఅమ్మ...అయినా నాకెందుకుమధ్య... మీరూమీరూబాగుంటే అంతేచాలు.'

'అంటే?'

'అయితేమరి...నీవు రేపుపండుగకు మీవాళ్ళ యింటికివెళుతువా?'

'ఆఁ...'

'పోనీ మానేయరాదూ?'

'ఏం...ఆలాగంటావేం...అత్తా!'

'ఎందుకుచెప్పానో ఆలోచించుకో...నీవుఒక్క తవేవెళుతావా...మావాడుకూడా వస్తాడా?'

'రారు...ఇక్కడ పనితీరడంలేదు'

'అవును...ఓసి వెర్రిదానా?'

'ఏమి?'

'నీవు ఇంకాగ్రహించలా...పని...ఏంపనిచేస్తున్నాడు...ఇంకా తెలియలా?'

'తెలియలేదులే...పోనిద్దూ.'

'అయితే నీకూయిష్టమేనా...ఇది మరీవిచిత్రంగా ఉంది.'

'అబ్బ! విసిగించక...చెపితేచెప్పుదూ...చూడు మరి...మాఆయనమీద నేరమైతే...అక్కర్లేదు.'

'నేరమేమిటి...నలుగురికీ తెలిసినసంగతి...కావాలంటే నీకు బుజువుఇప్పించనా?'

'నీవు చెపుదూ చాలు.'

'ఏముంది?...నీకాపురం గంగపాలౌతూంది.'

'ఊఁ...'

'ఇంత అమాయకత్వమేమే పిచ్చిదానా!...అనూరమ్మ...ఆ...నీకాపురం నట్టేట్లోకలిపింది...ఇంకా తెలియలా...ఏమన్నా మందుపెట్టిందేమోకూడాను...వాళ్ళవంగసమంతా అలాంటిదే...పొద్దస్తమానం వాళ్ళ ఇంటిదగ్గర నేపడిఉంటాడు...మరి నీవు ఏంచూస్తున్నావు?'

'పోనీ...ఆయనసంగతి నాకెందుకు?...ఆయన యిష్టం'

'అంతేనా...అయితే నిన్ను తిన్నగా చూస్తున్నాడా?'

కనకం నవ్వింది.

'ఆయనసంగతి నీకేం తెలుసుఅత్తా?'

'పోనీలే...ఊరుకో...మీఆయనవస్తున్నాడు...నేనుచెప్పినముక్కలుకూడా మనసులో ఓపక్కను ఉంచుకో...కాస్తకనిపెట్టిచూస్తూండు...ఇప్పుడు వెనుకటి రామయ్యకాదు...నీమీదప్రేమ...నీవే కావాలెననుకుంటూన్నావేమో...పట్టిది...నీవెందుకు ఆరంభముందర...నీవేమైతేనేం?'

నాగమ్మ వెళ్ళిపోయింది...రామిరెడ్డి యింటికి వచ్చాడు...తిన్నగా లోపలికిరాక దొడ్లో పశువులను చూసుకుంటున్నాడు...కనకానికి వెనుదిరిగి ఉన్నాడు...వీపుమీద పెద్దమచ్చ కనబడుతూన్నది. ఆమె దానిని చాలాసేపుచూసి...'నేనేమైతే నేం...కాదూ?'...అని తనలోతాను నవ్వుకున్నది.

*　　*　　*　　*

సాయంకాలము.

'ఏంఅమ్మాయ్...ప్రొద్దునే బయలుదేరుదాము...సిద్ధముగాఉండు' అని కనకాన్ని హెచ్చరించి...అప్పిరెడ్డి ఊళ్ళోకివెళ్ళాడు.

—రామిరెడ్డి పైన పంచవేసుకుని ఎక్కడికో వెళ్ళబోతున్నాడుఅప్పుడే...ఇంతలో వాకిట బండీ వచ్చినిలిచింది...అప్పిరెడ్డి దిగాడు...మామగారు అడిగిందేతరువాయిగా రామిరెడ్డి కనకాన్ని పంపిస్తానన్నాడు—తానుమాత్రం రానన్నాడు...ఏవో పనులుండటంచేత...త్వరగా తిరిగివస్తానని బయటికి వెళ్ళిపోయినాడు.

బంతిపూవులు కోసుకుతెచ్చుకుందామని బయలుదేరింది కనకం...ఇంటికి దక్షిణంగా...సమీపంలోనే పంటకాలువ, పాయఉన్నది...దాని అవల గట్టున వాములదొడ్డి...అక్కడే కొంతఖాళీజాగాను బంతిమొక్కలున్నాయి.

తడికెనెట్టింది...కాని లోపలనుంచి కట్టేసిఉంది. బలంకొద్దిత్రోసేటప్పటికి తెగి తలుపువచ్చింది...తీసుకుని లోపలప్రవేశించి.

ముందుకువెళుతున్నదల్లా అక్కడే ఆగిపోయింది. బంతిచెట్లదగ్గర...రామిరెడ్డి...సూరమ్మ.

సూరమ్మఒడినిండా బంతిపూలున్నాయి...కనకాన్నిచూసి చూడనట్లుగానే...రామిరెడ్డితో...'ఇక చాలులేండి పూలు...'అని కనకంతో మాటాడకుండానే...సావకాశంగా వెళ్ళిపోయింది.

రామిరెడ్డి అంతవరకూ మెదలకుండా నిలుచుని ఉన్నాడు...సూరమ్మ వెళ్ళిపోగానే...ఉగ్రుడై...

'ఎందుకువచ్చావు?' అని ఉరిమినట్లు ప్రశ్నించాడు.

'ఏంలేదు...పూలుకావాలని.'

'అలాగేం?...నీవేషాలు నాకుతెలుసునులే.'

'ఏంవేషాలు?'

'ఇక్కడనుంచి వెళ్ళిపో.'

'కోసుకునివెళ్ళనీయండి.'

'నీబాబుసొమ్మిక్కడ దాచబెట్టావు...ఎవరితాత సొమ్ము?...నీవు ఎందుకువచ్చావు?'

ఎన్నడూజరుగనిపని జరిగింది.

రామిరెడ్డి కనకాన్ని చెంపమీదకొట్టాడు...దెబ్బ కళ్లా క్రిందపడిపోయింది ఆపిల్ల...ఆతడు అక్కడ నిలువలేదు...వెనుదిరిగిచూడకుండా యింటికి వచ్చేశాడు.

మరికొంతసేపటికి కనకంవచ్చింది...రామిరెడ్డి చాలా కలవరపడుతున్నాడు...కనకం అప్పిరెడ్డితో ఏంచెపుతుందోనని...ఆమెరాకడకనిపెట్టి పనిఉన్న వాడిలాగా లోపలికిపోయి...చాటుగా నిలుచుని ఉన్నాడు తండ్రితో ఏమిచెపుతుందో వినవలెనని.

అప్పిరెడ్డి...వాకిట్లోతిరుగుతూ చుట్టకాల్చుకుంటున్నాడు...కనకంరావడంచూసి...'ఏమేఅమ్మ... ఇంతసేపుచేశావ్...మనఊళ్ళో లేవూ కావాలిసినన్ని బంతిపూలు?...బంగారమా? వాటికోసరమై ఇప్పుడు వెళ్ళావు...'అని పలుకరించి...'అదేమమ్మ!...ఆచెంప అలా కందిపోయింది...ఏదీ ఇలారా...అబ్బో ఎంత వాచిందో...ఇదేమిటమ్మా!'

'దొడ్లో పడ్డాను నాన్నా!...ఈబుగ్గ కొంచెం కందింది...నొప్పిగాఉంది...తెల్లవారికి తగ్గుతుంది లే...'అని లోపలికివెళ్ళింది.

*    *    *    *

ప్రయాణానికి వేళఅయినది.

రామిరెడ్డి నెమ్మదిగా మామగారిదగ్గరకువచ్చి... చాలావినయంగా...'మామా!...నీవు ఏమిఅనుకో వద్దు...కాని మీ అమ్మాయిని ఇప్పుడుపంపను...' అన్నాడు.

అప్పిరెడ్డి ఆశ్చర్యపడి...'ఏం...ఇంతలో మళ్ళా ఏమివచ్చింది?...రాత్రి పంపుతానంటివే...గడియలో మాటా?' అని కోపగించుకున్నాడు.

'నిజంగాచెప్పనా?... నేను...దాన్నివిడిచి ఉండ లేను...ఎల్లాగోఉంటుంది. ఉంచిపోదూ.'

కనకం లోపలనుంచివచ్చింది...'నేనూ ఇప్పుడు రాను నాన్నా!...ఇవిగో ఈపూలు పట్టికెళ్ళి... లక్ష్మికికొమ్మలొస్తున్నాయన్నావుకాదూ-దండకట్టి చుట్టించు...అమ్మతో చెప్పేం ఏం అనుకోవద్దని... ఆయన్ని ఒక్కడ్నివిడిచి రాలేక ఉండిపోయిందని చెప్పేం!.'

## ౬

శరత్కాలము...పండువెన్నెల.

ప్రొద్దుపోతూన్నది...అప్పటికప్పుడే ఊరంతా మాటుమణిగింది ఇంకా రామిరెడ్డి యింటికిరాలేదు... కనకం ఆతనికోసం ఎదురుచూస్తూ కూర్చునిఉన్నది..

దబదబ తలుపుచప్పుడయినది...వచ్చాడనిగ్రహించి లేచివెళ్ళి తలుపుతీసింది...రామిరెడ్డి తూలుతూ లోపల ప్రవేశించాడు. కళ్ళు బాగా ఎర్రబారి ఉన్నాయి...ఒకచోట నిలువబడలేకుండాఉన్నాడు. ఇరాగంధబంధురమైన ఆతనిఊర్పులు.

—ఆమె కది పరిపాటిఅయిపోయినది...ఆతడు యీమాదిరిగానే రోజూ...ఒళ్ళుమరచి యింటికి వస్తూంటాడు...ఒళ్ళుమరచే.

ఆతడుతూలి ప్రక్కకుపడబోయినాడు...ఆ అమ్మాయి పట్టుకోబోయింది...కాని ఆమెను త్రోసి వేసి...నెర్రిచూపులు చూస్తూ...'ఎవరొస్తారో రమ్మను..వీళ్ళబాబులంటివాళ్ళనుచూశాను..రమ్మను. దెబ్బకుసఫా...' అని పరవళ్ళుకొట్టడం మొదలు పెట్టాడు.

కనకం అంతాచూస్తూ ఊరుకునిఉన్నది. కొంత సేపటికి ఉద్రేకంతగ్గింది. ఏలాగో నాలుగుమెతు కులుతినిపించి తాను తినకుండా ఆతన్ని కనిపెట్టుకుని ఉన్నది.

రామిరెడ్డికి ఓప్రొద్దువేళకు మత్తుతగ్గింది...అప్పుడు తెలివి తెచ్చుకుని చూడగా...కనకం ఎదురుగా కూర్చుని ఉన్నది...'ఏం ఇంకా కూర్చున్నావేం?' అని అడిగాడు తాను మంచంమీద లేచికూర్చుని.

'ఏమీ లేదు...ఇంకా నిద్రరాలేదు.'

'ఇప్పుడు ఎంతప్రొద్దోయింది?'

'ఏమో బాగాప్రొద్దోయింది అనుకుంటాను.'

'ఇక పడుకో రాదూ. అయితే నీవు అన్నం తిన్నావా?'

'...........'

'ఎందు చేతమానేశావు—'

'............ ...'

'తిందూ!'

'నాకు ఆకలిలేదు'

'వల్లకాదు...ఆకలిలేకపోవడమేమిటి'?

ఆతనిబలవంతాన ఆమె భుజించింది...తిరిగివచ్చి ఆతనిసరసను కూర్చున్నది.

'నేనేమయినా కేకలువేశానా...వేశానుకాదు.'

కనకం నవ్వింది.

'ఏంజరిగిందనుకున్నావు...కామయ్యఉన్నాడే...సూరమ్మబావ...నన్ను దోవలోనిలవేశాడు...వాడికా నేనుజడిసేది?...వాడితాతలలాంటివాళ్ళను చూశాను...చేయిపట్టుకునేటప్పటికి కెక్కురుమన్నాడు...అక్కడే తందామనుకున్నాను...తప్పించుకుని పారిపోయినాడు.. ఎవరినితీసుకువస్తాడో తెమ్మను...విరిచేస్తాను.'

'ఎందుకు నిలవేశాడు?'

'ఇంట్లో ఆజ్ఞచెప్పలేదుకాని...నాకు బుద్ధిచెబుతాడూ?...వీడిసత్తా నేనెరుగనూ?'

'పోనీండి...వాడితో మీకెందుకు?.'

ఇద్దరూ మాట్లాడకుండాఊరుకున్నారు...కొంతసేపటికిరామిరెడ్డి కనకంవంక చూస్తూ...'నామీద...కోపమా నీకు?' అని అడిగాడు.

కనకం నవ్వి ఆతని మెడను చేతులు పెనవేసింది...రామిరెడ్డి ఆమెను కౌగిలించుకున్నాడు.

విరిగిపోయేటట్టు తలుపుమీద తాపులుతగిలినవి. ఇద్దరూ ఉలిక్కిపడ్డారు...రామిరెడ్డి ఓనిమిషం నిదానించి...వెంటనేలేచి కర్రతీసుకుని 'వాళ్ళే—' అన్నాడు. కనకం ఆతనివేపేచూస్తూంది.

'నీవు లోపలికివెళ్ళి తలుపువేసుకో...నేనున్నానుగా...అందరినీ భాగవతమాడిస్తాను...ఊహూ...ఈకర్రకాదు...గాదెప్రక్కను...' అని ఆతడు లోపలికి వెళ్ళిపోయినాడు.

...కనకానికి అంతా తెలుసును...చాలారోజులనుంచీ చూచాయగావింటూన్నది...సూరమ్మకీ ఆతనికీ స్నేహమని, ఆతన్ని చంపివేయాలనిచూస్తున్నారని, అందుకోసరమే వచ్చారనీవాళ్ళు. ఎంతపరాక్రమమున్నా ఇంతమందినిఏలా ఒక్కడు ఎదిరించగలడు?

రామిరెడ్డి కర్రతీసుకునివస్తూన్నాడు...రెండడుగులు వేసేటప్పటికల్లా హడలిపోయేటట్టు పెద్దకేక...ఎవరోపడినట్టు చప్పుడూవినిపించిందిలోపలికి.

ముందుకుదూకాడు. తలుపు తెరిచిఉన్నది. గుమ్మం ముందర కనకం. రామిరెడ్డికి కళ్ళుతిరిగిపోయినవి.

అంతా నెత్తురుమయం...కనకంపడిపోయిఉన్నది. చుట్టుపక్కల ఎవరూలేరు. తల పగిలిపోయింది.

రామిరెడ్డి నెమ్మదిగా ఆమెను లేవనెత్తి తన కానించుకున్నాడు...ఊపిరిఉన్నదో, లేదో. కనకం కళ్ళు తెరిచింది. చేత్తో ఆతనివీపుమీదిమచ్చను నిమురుతూ 'అవాళ...' అని కన్నులుమూసుకున్నది.

ఆశరీరాన్ని లోపలికితీసుకువెళ్ళి పండుకోబెట్టినాడు...కంటివెంట నీటిచుక్కయినా రాలలేదు.

కఱ్ఱతీసుకునిబయలుదేరి...పేరుపేరువరుసనూపిలిచి కొట్టేశాడు...అందరూ కనకానికి తోడుగాపోయినారు...ఒక్కడూలేవలేదు...శత్రువులందరూ నిర్మూలమయినారు. ...మరిరెండురోజులకి రామిరెడ్డి కాలువకుఎగువను లాకులదగ్గర తేలాడు.

* * * *

ఏముసలమ్మయినా, ఆతోవను వెళుతూ...వాళ్ళ ఇంటివేపుచూసి...'అయ్యో!నాతల్లీ!'...అని తనలో తాననుకుని నిట్టూర్పువిడిచేది.

# గృహిణి

ఓలేటి సీతారామమూర్తిగారు

౧

నీకనుఁదోయిలో విరియు నిర్మలహర్షము పూఁపమొగ్గయై
వీఁకను దివ్యపుష్పమయి వెన్నెలవన్నెలజల్లుతో గృహ
స్థాకులమానసప్రకృతి యందపువీథులలో విలాసశో
భాకలితామృతమ్ము పొలపంబుగఁజల్లును గేహలక్ష్మిరో!

౨

ఈకలుషావనీభయదవీక్షణసూర్యకరాగ్నిఁ జిక్కి ని
త్యాకకృశాప్రఘూర్ణహృదయంబున నీఁదెస కన్నువిచ్చి దీ
నాకృతినున్న ప్రాణపతి నాదట మవ్వపునవ్వుచాలుతో
నీకనుచూపుచల్లనగు నీడలనిల్పెదు పుణ్యగేహినీ!

౩

నీకమనీయరూప మెదనిల్వనియంతటిసేపు పూరుషుం
డాకులవృత్తిఁబూని నడయాడును పాపపుధ్వాంతవీథిఁ బ్రే
మైకమనోజ్ఞమూర్తివగు నీవు వెల్చారిననవ్వులోసతీ!
నాకపుమెట్టులై యతని నందనపుణ్యపథంబుఁ జేర్చెదున్.

౪

కోకిలగీతినైక్యమునుగొన్నకవీంద్రునిడెందమట్లు సం
ధ్యాకమనీయకాంతిని చయానఁగరంబితమైన నీరదా
నీకమువోలె తావకవినిర్మలవాఙ్మధుధార లీనమై
పైకొని గేహిమానసము భాసిలు నిత్యశుభప్రదాయినీ!

౫

పురుషునిక్రమహృత్పథము పోడిమినించెడు పూలసెజ్జ; యం
బరసికతాతలంబునను మవ్వపుగువ్వవిధాన దానిపై
నిరతము గేస్తురాల! హవణిల్లెదు, ప్రేమసుధార్ద్రగానమా
ధురి నవనీస్థలిన్ బ్రణయతోరణపంక్తులు సంతరింపుచున్.

# ప్రేమ

శ్రీమతి టి. వి. సుబ్బాయమ్మగారు

దేవదేవుడు చిదానందస్వరూపి. ప్రకృతియే తద్దేవసృష్టి. ప్రకృతి, అందలిజీవకోటి సృష్టికర్తయగు పరమాత్ముని యానందాంశచిహ్నితము. వివేకతేజోవికసనమే "జీవికి"ని "జీవము"కునుగల తారతమ్యము. కావుననే మానవుడు ప్రకృతిసౌందర్యమునుజూచి ఆనందితుడగుచున్నాడు. ఆనందగీతికల ప్రకృతిసోపానముల ప్రతిధ్వనితమగునట్లు పాడుకొనును. సౌందర్యము ఆనందింపదగినదిగదా! ఏవస్తువు మానవహృదానందమును జూరకొనునో తద్వస్తువుపై ననురాగముకల్గును. చిత్తాకర్షణకరమగు నా వస్తువు కట్టెదుటనున్నదనుక మానవుడు తన కావస్తువుపైగలయనురాగము నంతగా గుర్తెరుగజాలడు. వియోగతమోవినశనమున యనురాగలతచిగిర్చి మోహాసుమములపుష్పించును. అనురాగముగలవస్తువుపై కరుణ, మోహము అనివార్యమును, అనిర్వచనీయమును, అంచిత్యమును, అనంతమును, అనుభవైకవేద్యమునుఅయియుండును. మోహముపోగా తుదిదశ ప్రేమ ప్రస్తుతము మన వ్యాసవస్తువు ప్రేమయే.

అన్యమగుప్రేమ అలభ్యము. ప్రేమ యొకదీవన. సామాన్యులకు నిశ్చలప్రేమ లభింపదు. అనురాగవివశతయో, మోహవివశతయో యుండునుగాని ప్రేమవివశతయరుదు. ఒక మనోహరమగువస్తువునుజూచిన అప్రయత్నపూర్వకముగాకల్గుసంతోషమే యనురాగము. అట్టిమనోసంక్షోభము ఎందువల్లకల్గినది? దేనికిగాను కల్గినది? మంచికా! చెడునకా! యని పౌర్వాపర్యములయోచింపక ననురాగకారియగు వస్తులాభమును గూర్చి తపించునది మోహము. మోహము చేయలేనిపనినిపరిశీలించి అభినందించి ఆనందించునది ప్రేమ.

మానవుడు అనురాగము, మోహము, ప్రేమయను నీగుణత్రయమునం దేదేనియొకటి నధికముగాగల్గియుండును. అనురాగము ఆనందస్వరూపము. మోహపారవశ్యత విషాదానందద్వయోపరిపీడిత. ప్రేమ స్వీయభావనారూఢ. మానవుడు తన్ను తాను ప్రేమించుకొనుననుకొనుడు. కష్టమనుభవింపజాలక ఆత్మగౌరవము స్వాభిమానమేగాక స్వకీయమున ఔత్కృష్ట్యము ఆపాదించుకొనును. ఇతరమును ప్రేమించిన దానిపైననే తనసర్వస్వము కేంద్రీకరించును.

కావుననే పరస్పరానురాగుల మనోవృత్తములందు పరచింతనకు తావులేకుండును. ఇతరమానవులకు, ప్రపంచముకేగాక ప్రకృతికిగూడ తన్మయత్వమున దూరుడగుచున్నాడు. అన్యోన్యానురాగసమాధియగు ప్రియుల చిత్తాకర్షణశక్తి మందగించి స్వస్వప్రవర్తనావృత్తములయందుండుటచే నితరమును ప్రేమింపజాలదు. ప్రేమింపజాలదనిన గర్హించుననిగాదు. అభినందించి ఆనందింపలేకపోదు. కాని యేతత్క్రమము ప్రియుల యేకీభవ్యాభిప్రాయముల

ననుసరించియుండును. కాకున్న నిరంతరపరస్పరప్రేమోపేతులగు భార్యాభర్తలు తమ శిశువులనెట్లు ప్రేమింపగలరు?

విశ్వకర్త ప్రేమతేజోవిరాజియన్న యేతత్ప్రేమమాధురీపరిషేచనమగు ప్రకృతి యాప్రకృతియం దౌన్నత్యమువహించుమానవుడునూ విశ్వకారుని ప్రేమతేజోకరస్పర్శనాప్రకర్ష గలవారగుచున్నారని చెప్పుట చర్విత చర్వణము. కావున నొకొళ్ళొకళ్ళను ప్రేమించుకొనుటకు మూలకందమగు విశ్వేశ్వరునివిలాసము అవాఙ్మనసగోచరముకదా!

ప్రేమ అనంతరూపిణి. యోచనాతీతమునూ, స్వరూపరహితమునూ నగుప్రేమ యిదమిద్ధమని రసాయన, పదార్థవిజ్ఞానశాస్త్రప్రదర్శనాగారపరిశీలనలు నిర్ణీతముచేయగలవా? వెఱ్ఱి...! ఎంతయో పావిత్ర్యము నేచుకొని మోహమువలె సంయోగవియోగద్వంద్వపీడిత కానేరనిదే ప్రేమ. ఏదెట్లువర్తిల్లిననూ ప్రేమఝరి నిరభ్యంతరమాధురీప్లుతిగలదై, ఆనంద తరంగడోలికాసమన్వితయై స్రవించుచునేపోవును. ఏతత్ప్రేమరసస్రవంతిని, తరుకాండోపమానములగు మానవపిశాచముల కనువేదురను తరులు ఆటంకపరుపఁగలవా? ఎట్టి మూర్ఖత! ప్రేమరసార్ద్రమగునంతస్సు జీవనది. చండకిరణాతపసంతప్తమగునని భయమున్ననుగదా ఘనఘనారావధ్వన్యమగు ప్రావృడభ్రమునకై తపించునది?

అట్టి పవిత్రాంశసంజనితమగుప్రేమ యితరముపై నాధారపడియుండునా? ఇతరుల ఆదరణానాదరణములకువెరచునా? ప్రేమ అంతరాయవిభీతచేతస్కయగుట కల్ల. ప్రేమప్రవాహిని నడ్డగించుట కెవరితరము? కాని అసంభవమనికాదు. అటులనినచో ప్రేమపథఃప్రవర్తకులకు ప్రథమమున అభిమతాంతరాయములుండునని సిద్ధాంతీకరించిన సత్కవులవాక్యములు రిత్తపుచ్చుటయేకదా! నేనునూ యదార్థీకరింతునుగాక, కాని నిర్మలప్రేమమార్గాభిమతనిరోధము అస్థిరమునూ, నిష్ఫలమునూనగుటయేగాక ఒకొక్కవ్యక్తియొక్క అవినీతి, అజ్ఞానము, అవిద్యయూ విస్పష్టమగునని నామనవి. ప్రేమసస్యఫలములే స్థిరములనినమ్మినవారు అనివార్యములగు నాకష్టములకు విముఖులుగాజాలరు. ఒకానొక సుఖమునువాంఛించి మేరుసదృశమయిన క్లిష్టపరిస్థితులకు కుంచితులుగాక మనోభీష్టమునుసిద్ధించుకొనుట మానవులకు స్వతస్సిద్ధము. మోక్షగాములౌటనేగదా తాపసులు యిహమునందు తపోక్లేశములకు నోర్చుట! మానవుడు సుఖమునకై కష్టించుటకు వెనుదీయడు.

ఎన్ని దురవస్థలకులోగిపోయిననూ మనోవాంఛార్థసంసిద్ధికై ప్రాణములొగ్గుటకు ప్రేమయే కారణభూతము.

నాసోదరీవిదుషులు పవిత్రప్రేమచిహ్నితమగు తమహృదీప్సితములు సిద్ధించుటకు మనోకాయక్లేశములకోర్చి ప్రేమవిద్యుత్కాంతులను జీవితాకాశపథమున చిరస్థాయిగా వెలార్చికొని బాలభారతభావిజీవితాదర్శకురాండ్రై దివ్యతేజోభాస్వచ్ఛటల వెదజిమ్ముదురుగాకయని యాశయము. —"మహిళాదర్శిక"నుండి.

# తాచెడ్డకోతి

శాంత కృష్ణమూర్తిగారు బి.ఏ;యల్.టి.

మొండివాదనైనా లక్ష్మిది సూక్ష్మబుద్ధి! నావిద్యాధిక్యత, నా తెలివితేటలు గుడ్డిగవ్వకు పనిచెయ్యకుండా ఉన్నాయి దానివాదనముందు. నాఊహాపోహలసందర్భాలనీ, నేనాడేమాటల కర్థంలేదనీ, నాఇంగ్లీషుచదువే నాకళ్ళుకప్పేస్తూవుందనీ, చదువుకున్నవాడినన్న అహంభావంకొద్దీ నిజంకనిపెట్టడానికి యత్నించననీ నిర్భయంగా 'ఛాలెంజి' చేసి చెప్తుంది నా మొహంయెదుట-భర్తనని మొగమాటమైనా లేక.

"స్త్రీలు, స్త్రీఉద్యమాలు అంటే నాకభిమానం లేదంటావా అయితే?" అన్నాను చిరునవ్వుతో.

"అయ్యో, లేకేమి? ఆడవాళ్ళంటే యిష్టంలేని మొగవాడుంటాడూ? అందులో మీప్రజ్ఞ చెప్పేదేమిటి? అందంగల ఆడది కనిపిస్తే అసలు మతేపోతుంది మీకు!" అని కళ్ళతో నవ్వింది తల తమాషాగా ఊపుతూ.

లక్ష్మికది పరిపాటే. నన్నెగతాళిచేసి నాతో హాస్యాలాడడం దానికి ముచ్చట.

"తెలుసు మీ మొగవాళ్ళనైజం! అంతాకపటమే. అభిమానం, స్నేహంచూపి సహాయంచేస్తున్నట్లునటించి గోతిలోతోస్తారు. తక్కినమొగవాళ్ళకంటె మీరు మరోఆకు ఎక్కువే చదువుకున్నారు. ఆడవాళ్ళహైన్యతకు జాలిచూపుతూ, వాళ్ళకుమేలుచేదామనే సంకల్పించుకొని తుదకు హానిచేస్తారు." అన్నదొకమాటు స్త్రీలనుగూర్చి నేనువ్రాసిన కథలపుస్తకం చదివి.

"అన్యాయంమాటలాడకు లక్ష్మీ! స్త్రీలంటే నాకెంతో గౌరవం. ఆడవాళ్ళ నన్యాయంచేసి పురుషుడధికారబలంచేత మత్తెక్కి విర్రవీగుతున్నాడని ప్రతీ మనిషికీ తెలుసు. అందుకనేకదా స్త్రీసంఘానికి నే నిట్టిఉపదేశాలిస్తున్నాను? నే చెప్పేమాటలలో కపటమేముందో చూపించు. 'స్త్రీలకి స్వాతంత్ర్యం కావాలి. విద్య కావాలి. ఆరోగ్యం కావాలి. సంఘంలో వాళ్ళుగౌరవంపొందగలగాలి. లోకంలో తలెత్తి తిరగడానికి సామర్థ్యం పొందాలి. వాళ్ళమట్టుకు వాళ్ళు పోషించుకోగలశక్తి సంపాదించాలి. పురుషుడి అధికారానికి లొంగిపోకూడదు.' అని కదా నాబోధన? నాకథలలో, వ్యాసాలలో, ఉపన్యాసాలలో, సంభాషణలో నేను సూచించే అభిప్రాయమే ఇది. 'ఆడచెల్లెళ్లారా! ఎన్నాళ్ళీదాస్యంలో పడి కొట్టుకుంటారు? ఇప్పటికైనా కళ్ళు తెరచి సంకెళ్ళు తెంపుకోండి.' అని కదా నా మొర?" అని సమాధానం యిచ్చాను.

లక్ష్మి నావేపుఅట్టేచూస్తూ తలపంకించి చిత్రంగా విరిచింది మూతి. ఆలేడికళ్ళలో కోపం, జాలి, కొంటెతనం అన్నీ ఒక్కమాటే కనిపించాయి.

"మీతో వాదించి లాభంలేదు. మీధోరణే మీది. ఎదటివారిని అర్థంచేసుకుందామన్న మర్యాదేలేదు మీలో. ఒకరిమాట ఒకరికి పొందకుండా ఉంది మనకి" అంది నిట్టూర్పుతో.

పౌరుషంకలిగింది నాకు. ఒకరితో మాట్లాడేటప్పుడుగాని, తగవులాడినప్పుడుగాని బహుశాంతంగా తొందరపడకుండా అన్నీ అర్థంచేసుకొని మరీ నడుచుకుంటానే అని నాఅహంభావం. ఈమె అభిప్రాయమే తెలియలేదట నాకు! అంత మట్టిమెదడుతో మాట్లాడుతున్నానా? విచక్షణజ్ఞానమే లేదా నాకు? లాజిక్కు, లెక్కలు చదువుకున్న నాకే రీజనింగ్ శక్తి లేదంటుందే! బడిలో డిబేటింగుసొసైటీలంటే ఎరుగునా? మీటింగులలో డిస్కషన్ అంటే ఎన్నడైనాచూసిందా? కచేరీలలో న్యాయవాదులు చెప్పే ఆర్గ్యుమెంట్లు ఎన్నడైనా విన్నదా?— ఏఎక్స్పీరియన్సు లేదు లక్ష్మికి. బాగా స్కూల్ విద్య ఉన్నదైతే యిట్లా మాట్లాడుతుందా? ఇంచుమించు పాతికేళ్ళు ఉన్నాయన్నమాటేకాని లోకానుభవమేదీ లక్ష్మికి? ఇల్లు, పిల్లలు, పుస్తకాలు యింతే ఆమె లోకం! విద్యాజ్ఞానం తక్కువ, స్వతంత్రాలోచన లెక్కువ. పోనీ నన్ను గురువుగాభావించుకొని

నావిద్యలో కొంతసంపాదించుకొని, నాఉపదేశాలను మన్నిస్తూ, నాఅభిప్రాయాలతో ఏకీభవిస్తుందేమో అంటే అదీలేదు. మీదుమిక్కిలి నాకేబోధించి తన మతంలోకి తర్ఫీదుచేస్తానంటుంది. స్వతంత్రాలోచన లేని దాస్యబుద్ధిఅట నాది—సూచావాచా తేల్చిం దొకమాటు. అడ్డమైన పుస్తకాలుచదివి, అందరి అభిప్రాయాలతోను ఏకీభవించి, ఈమహానుభావు డిట్లా అన్నాడనీ, ఆకవిశ్రేష్టు డట్లా వ్రాశాడనీ తప్పుడు కూతలు మనసుకెక్కించుకొని నామట్టుకు నేను ఆలోచించుకోవడమే మానుకున్నానట!

ఒళ్ళుమండుతుంది నాకు ఒకొక్కప్పుడు లక్ష్మి అనేమాటలకు. దాని పోటుకుమాటలు, దాని పెంకెతనం - హద్దులేకుండా ఉంది దాని నిగ్గుష్యానికి! ఏమన్నా ఓర్చుకుంటానని తెలుసు. నాకెంతకోపం వస్తేనేం? అవలీలగా నన్ను మరపించి, బుజ్జగించి, మంత్రించి వశపరచుకోగల నేర్పుంది ఆమెలో.

"కథచెప్తారులెండి మనవాళ్ళు. తూతికపిట్ట అన్నదట గర్వంగా 'నేనుగాని కాళ్ళుచాచి ఆకాశాన్ని తన్నిపెట్టి ఆపకపోతే యీలోకం గతి ఏమౌను?' అని. అట్లాఉంది మీసంగతి. స్త్రీలోకమంతా మిమ్మల్ని బ్రతిమాలుకుండా 'మాతరఫునపనిచెయ్యండి' అని? మాఊసెందుకూ మీకు?" అని పోట్లాడింది నిర్భయంగా.

"ఉపకారానికిపోతే అపకారం వెంటనే వచ్చిందంటారు యిందుకే—" అన్నాను నిట్టూర్పుతో.

"ఆడవాళ్ళ అభివృద్ధినిగూర్చి ఫలానా మహానుభావుడు పాటుబడుతున్నాడని పేరుసంపాదించుకుందుకా? ఎందుకీనటన? ఇంతకూ స్త్రీజనానికి మీరుచెయ్యగల సహాయమేముంది? వెనకటి కోవెధవావిడెకెవరో నమస్కారంచేస్తే 'నావలె చిరంజీవివై బ్రతుకు!' అని ఆశీర్వదించినదట. ఆమోస్తరుగానే ఉంటుంది మీమొగవాళ్ళుచేసే ఉపకారం!" అని విరసంగా నవ్వింది.

"ఏమిటీ? మామొగవాళ్ళంతా వెధవాయలా? మీఆడవాళ్ళనందర్నీ వెధవల్నిచేస్తున్నారా? నోటిదుడుకుతనం కూడదు. ఎందు కన్యాయంగా నిందిస్తావు?"

"నేనేమీ నిందారోపణచేయలేదు. ఉన్న నిజం మనవి చేస్తున్నాను. అంతే."

తృళ్ళిపడ్డాను నేను. విపరీతంగా వినిపించాయి లక్ష్మిమాటలు.

"నీఅభిప్రాయం తెలియలేదు నాకు" అన్నాను బొమలు ముడిచి.

"తెలియదు. నేనన్నదీ అదేకదూ? ఏదీఅర్థంచేసుకోలేనివాళ్ళు తగుదునమ్మా అని ప్రతీదానికీ ఎందుకు సిద్ధపడాలి? మీకేంతెలుసునని ఆడవాళ్ళసంగతి? వాళ్ళ ప్రకృతి, వాళ్ళ ఊహలు, వాళ్ళ ఆశయాలు ఏవీ మీమొగవాళ్ళకు తెలియవుకదా! సృష్టి ప్రారంభించినదిమొదలు ఈఅన్యాయం యిట్లానే వొస్తూవుంది. ఆడదాన్నిగూర్చి ప్రతీవిషయంలోను పురుషుడు కలగజేసుకొని, సర్వం తెలిసినవాడివలె నటించి తుదకు దాన్ని అధోగతికి తెచ్చాడు. భూమిమీద పడ్డది లగాయతు ఆడది ఎట్లా నడుచుకోవాలో పాపం దయతలచి అంతా నిర్ణయించాడు! అది చెయ్యవలసిన కర్మ విధించాడు. శాస్త్రాలు వ్రాశాడు. ఆచారపద్ధతులు నేర్పాడు. అన్నీ దానిమేలు తలపెట్టేచేసినట్లు నమ్మించాడు. తుదకు సంఘంలో దానికి ప్రత్యేకస్థానం లేకుండా చెయ్యగలిగాడు. ఆమెలోఉన్న ఇండివిడ్యుయాలిటీని చంపి తన బానిసను చేసుకున్నాడు స్త్రీని! ఈబానిసత్వమే ఆమెకు మోక్షం ప్రసాదిస్తుందంటాడు పైపెచ్చు. అమాయకంగా అతని బొల్లిమాటలకు అనేకశతాబ్దాలనుండి లొంగిపోయి ఇప్పు డీస్థితికివచ్చింది ఆడది!" అంటూ ఉద్రేకంతో ముక్కుపుటము లెగరవేస్తూ గంభీరంగా ఉపన్యసించడం ప్రారంభించింది.

మెల్లగానవ్వి "నిజమే అనుకుందాం మాటవరసకి. చేసినతప్పు దిద్దుకుందుకు పురుషుడు యత్నిస్తూవున్నప్పుడు మళ్ళీ అభ్యంతరపరచనేల? మంచి చెయ్యబోయేవాళ్ళ నెందుకూ ఆటంకపరుస్తావు?" అని అడిగాను.

"మీవశంకాదు ఏంచెయ్యడానికీ యిప్పుడు. తోడేలు గొఱ్ఱెపిల్ల కేంసహాయంచేస్తుందో మీరూ ఆడదాని కట్టిసహాయమే చెయ్యగలరు. స్త్రీలకు స్వాతంత్ర్యం పురుషుడుసంపాదించడమేమిటి? అసంబద్ధం! ఇంతకూ అతగాడికిమాత్రం మహాయేడిసిందా యేమిటి నిజమైన స్వాతంత్ర్యం? ... దౌర్జన్యంచేసి ఆడదానిజన్మహక్కులన్నిటినీ లాక్కున్నదిచాలదూ? సాగినన్నాళ్ళు అధికారం చెలాయించాలనేఉంటుంది కాబోలు!...కాని"

"అదికాదు లక్ష్మి! నీఅపనమ్మకంకొద్దీ నువ్విట్లా మాట్లాడుతున్నావు. కాని దాస్యవిముక్తిపొంది ఆడది సంపూర్ణస్వాతంత్ర్యం అనుభవించాలని నాఅభిలాష. నేను పాటుపడుతున్న దందుకే" అనిచెప్పాను.

"మీఉద్దేశం మంచిదేకావచ్చును. కాని క్రియ మాత్రం సున్న. ఒకవేళ మీరు మేలుచెయ్యడానికే తలపెట్టినా పర్యవసానం కీడుగా పరిణమించక మానదు" అని కొంతసేపాలోచిస్తూ ఊరుకుంది.

"స్త్రీసంఘంలో ఇప్పుడుద్భవించినకల్లోలం మహాచిత్రమైనది" అని మళ్ళీచెప్పడం ప్రారంభించింది. "లేనిహక్కులు సంపాదించుకుందామనీ, పురుషులతో సమానంగా అన్నివిషయాలలోను ప్రవర్తింమదామని ఏవో అర్థంకాని కోర్కెలతో కొట్టుకొంటున్నారు స్త్రీలు. మండుతూవున్న జ్వాలలో మీవంటి బుద్ధిమంతులు ఒక్కొక్క సమిధ వేస్తున్నారు. కొంపలంటుకొని సర్వనాశనం కావడానికి వచ్చినట్లుంది యిదంతా! పోగొట్టుకున్న స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవడానికి స్త్రీ యత్నించడం సహజమే. అవసరమనికూడా ఒప్పుకుంటాను. కాని పురుషసహాయానికి ఆశించడం బుద్ధితక్కువ. ద్వేషరహితమైన శాంతియుద్ధంచేసి మొగవాడినిగెలిచి తనరాజ్యం తా స్వాధీనపరచుకోవాలి స్త్రీ. స్వాతంత్ర్యమనేది ఒకరు ప్రసాదించవలసినదికాదు. ఎవరిమట్టుకు వారే సంపాదించుకోవాలి. ఒకరిసహాయంపైని ఆధారం పెట్టుకుంటే మీదుమిక్కిలివాళ్ళకు కృతజ్ఞత చూపవలసిన అవసరంవస్తుంది. కృతజ్ఞత భక్తిగా మారుతుంది. భక్తి సేవలోకి దిగుతుంది. సేవ దాస్యంగా పరిణమిస్తుంది. ఈవిషమచక్రంలో తగులుకుంటే చుట్టూతిరిగి మళ్ళీ మొదటికేరావడం తటస్థిస్తుంది. ఏం లాభం?"

ఈఆర్గ్యుమెంటు చిత్రంగాతోచిందినాకు. "అందుకనే స్త్రీలు పురుషుల నెదిరించి, ధిక్కరించి స్వాతంత్ర్యం గణించుకోవాలంటున్నాను నేను"అన్నాను.

"జాతివైరం(Sex War) కూడదు!...స్త్రీపురుషులొకరితోఒకరు ఎన్నివైరాలు పెట్టుకున్నా ఒకరిపట్ల ఒకరికిగల సహజమైన ఆకర్షణ ఎన్నటికీ నశించదు. అట్టి ఆకర్షణే ఉభయులకూ కొంత శాంతినిస్తూవుంది. మీవంటి మహానుభావుల ప్రబోధాలవలన ఆకాస్త శాంతికూడా చస్తుందేమో!...స్త్రీలు తమ ఆధిక్యతను నిరూపించుకోవాలంటే సెక్సువైరంచూపి పురుషులతో పోటీచేసి వాళ్ళను జయించాలని కదా మీ ఉపదేశం? మాలోకూడా అనేకమంది ఈతప్పు అభిప్రాయంతోనే ఉన్నారు. అన్నివిషయాలలోను పురుషుడినే ఆదర్శంగా తీసుకొంటూవుంది ఈకాలపు నారీమణి. తనలోఉన్న ప్రత్యేకవ్యక్తిత్వం మరచిపోయింది. సృష్టికి మూలమైన ఆడ, మొగ అన్న లింగభేదంకూడా పాటించకుండా ఉంది. మొగవాడితో పోట్లాడి తనుకూడా మొగవాడవుదామని వెర్రిపడుతూవుంది. తుదకు ఉభయభ్రష్టత్వం అవుతుందేమో ఆమెగతి! నాగరికులమనీ, స్వాతంత్ర్యం గలవాళ్ళమనీ విర్రవీగే పాశ్చాత్యదేశయువతులకుకూడ యిదే వెర్రి. వాళ్ళు తమలోఉండే ఆడతనాన్ని చంపుకుంటున్నారు. మగచేష్టలు నేర్చుకుంటున్నారు. మాతృత్వం వహించడానికి అసహ్యించుకుంటున్నారు. దేవుడిచ్చిన అంగసౌష్టవాన్ని సహితం వికృతపరుచుకుంటున్నారు. మాటలలో, రూపంలో, చేష్టలలో అన్నిటిలోను పురుషత్వం వహిస్తున్నారు. దొరసాని జుట్టుకత్తిరించుకొని గుండుచేసుకొంటూవుంది. షరాయితొడిగి పులివేటకు సిద్ధపడుతూవుంది. ఈతలో, గుఱ్ఱపుస్వారిలో, కసరత్తులో పోటీకి నిలబడి మొగవాడిని ఓడిస్తూవుంది. ఫ్రాన్సులోను, అమె

రికాలోను ఈకాలపుబాలికలు కొందరు వక్షోజాలను పెరగనివ్వకుండా శస్త్రం చేయించుకుంటున్నారట. రూపంలోకూడా ఆడతనం విశదపడకూడదనీ అభిప్రాయం కాబోలు! చాతనయితే సృష్టికర్తతో దెబ్బలాడి మీసాలు గెడ్డాలు మొలిపించుకుంటారేమో! వివాహాన్ని వెక్కిరిస్తున్నారు. దాంపత్యాన్ని అగౌరవిస్తున్నారు. సంతానం అక్కరలేదంటున్నారు. పాతివ్రత్యాన్ని పరిహసిస్తున్నారు. సంఘాన్ని, దేవుణ్ణి ధిక్కరించి కళ్లెములులేని గుఱ్ఱాలవలె చెలరేగుతున్నారు. వినరానిమాటఏదైనా చెవినిసోకితేచాలు పూర్వకాలం స్త్రీలు మూర్ఛపోయేవారట! ఇప్పుడో ఆడవాళ్ళకు సహజంగా ఉండవలసిన బిడియం, భీతి, సిగ్గు, నాజూకు, సుకుమారత్వం అన్నీ అడుగంటి నశించాయి. శరీరలావణ్యం చెడిపోయింది. మాటలలో మార్దవంపోయి మోటుదనంవచ్చింది. శీలం, ముగ్ధత్వం, సరళత మొదలయిన విప్పుడు 'ఫాషన్సు' కావు! నేటి స్త్రీని 'అబల' అంటే మూతిమీద తంతుంది. మొగవాడికీ తనకీ యేమీ భేదం లేదనిన్నీ ఇరువురికీ సమానహక్కులే ఉండాలనిన్నీ ఈకాలపు స్త్రీ పోట్లాడుతూవుంది. ప్రపంచంలోఅన్ని దేశాలలోను యిదే కలకలము. ఒక్క ఇటలీలోమాత్రం స్త్రీలు స్త్రీలుగానేఉండడానికి ఇష్టపడుతున్నారు. ఇటీవల హిందూదేశపు స్త్రీలలోకూడా యిట్టి సంచలమే ఉద్భవించింది. మగరుచులకు అలవాటు చేసుకుంటున్నారు మన స్త్రీలు. మగవాళ్ళ ఆటలు, మగవాళ్ళ చదువులు, మగవాళ్ళ పనులు, మగవాళ్ళ మాటలు -- అన్నీ మగవాళ్ళవే అభ్యసిస్తున్నారు. ఈనవీననాగరికత స్త్రీలను అభివృద్ధికితేక క్రిందికి దిగలాగతూవుంది. ఆడది మొగవాడివలె ప్రవర్తించబోయినా, మగవాడు ఆడదానివలె నడుచుకున్నా పరమఅసహ్యంగా ఉంటుంది. మీ మొగవాళ్ళలో ఆడంగివెధవలని ఉంటారు ఎరగరూ? ఆడమొగలంటారు వాళ్ళని. వాళ్ళ పేడిమొహాలు, ఆడచేష్టలు చూస్తే రోతపుడుతుంది. వాళ్ళలో కొందరు బట్టకట్టులోకూడా ఆడతనం వెల్లడిపరచుకుంటారు. చీరకడతారు. జుట్టుపెంచి పువ్వులు ముడుచుకుంటారు. కాటుకపెడతారు. ఒయ్యారంగా పైట సర్దుకోవడం అభినయిస్తారు. తిప్పుకుంటూనడుస్తారు క్రేగంటిచూపులతో. సిగ్గునటిస్తూ మొగవాళ్ళతో నంగిరినంగిరిగా మాట్లాడుతారు. ఎన్నెన్ని వెధవచేష్టలు చెయ్యాలో అన్నీ చేస్తారు. అట్టిఅధముల్ని చూసి ఆడవాళ్ళు నవ్వుకుంటారు జాలిపడి. మొగవాళ్ళు రోతపడి కోపగించుకుంటారు. వీళ్ళమోస్తరే మాఆడవాళ్ళలో కూడా మగలక్షణాలుగలవారున్నారు. గట్టిశరీరం, మోటుమొహం, బల్లపరుపువక్షం, బొంగురుగొంతుక, మూతిమీద చిన్నమీసకట్టు మొదలయిన అవలక్షణాలుగల వయ్యారులెందరో ఉన్నారు. ప్రకృతివిరుద్ధమైన చేతగాని పనులుకూడా చెయ్యడానికి పాపం ముచ్చటపడతారట వీళ్ళు! మొగవాళ్ళను చూస్తే భయపడి ,దూరదూరంగా జరగడం, ఆడవాళ్ళని చూసి మోజుపడడం-ఏమనిచెప్పను వాళ్ళచర్యలు! ఎవరిలోఉండే సహజశక్తులను వాళ్ళు దోహదం చేసి పెంచుకుంటే అవి రాణిస్తాయి. లేనిశక్తులు నటించడానికి యత్నిస్తే అవి బెడిసికొడతాయి. ఆడదాని 'గ్లోరీ' ఆడతనంలోను, మగవాడిఘనత మొగతనంలోను స్పష్టపడాలి. అంతేకాని వీళ్ళలో ఉండే ఔన్నత్యం వాళ్ళుసంపాదించడానికి యత్నించడం అసహజమేకాక బుద్ధిహీనం!"

నిర్ఘాంతపడి వింటూకూచున్నాను లక్ష్మిఉపన్యాసం. ఏంచెప్పడానికీ తోచలేదు కొంతసేపటివరకూ. స్త్రీల మూవ్మెంటులో నడుంకట్టి పని చేదామన్న అభిలాషేకాని ఈసంగతులన్నీ తట్టలేదు నాకెన్నడూ. నేనుచేసేకృషి యావత్తూ స్త్రీలోకానికి మేలుచెయ్యడానికిబదులు కీడుచేస్తుందని ఘంటాపథంగా చెపుతూవుంది లక్ష్మి. అయితే నేనేపని తలపెట్టినా పరిహాసంచేసి ఆక్షేపించడం దానికి మామూలే. ఒక్కొక్కప్పుడు కేవలం పెంకెతనానికే తీవ్రంగా వాదిస్తుంది నాతో. మనసులో నాయభిప్రాయాలను మన్నించినా పైకిమాత్రం అడ్డువాదన చేస్తుంది. కళ్ళలో నవ్వుపొంగుకొచ్చినా మూతి

బిగించి గంభీరంగా పెడుతుంది మొహం! లక్ష్మిలో ఉన్న హాస్యం, అలక, పెంకెతనం అన్నిలక్షణాలు నాకు అనుభవవేద్యములే కాని ఇప్పుడున్నంత 'సీరియస్‌నెస్' ఆ మొముఖంలో నాకెన్నడూ పొడగట్టలేదు. దాని నవ్వుమొహంలో కపటం దాగదు.

"సరేకాని లక్ష్మీ! స్త్రీల పురోభివృద్ధికి పాటుపడాలనుకున్న బుద్ధిమంతు లిప్పుడు ఏంచెయ్యాలని నీఅభిప్రాయం? నీగోరణిచూస్తే తప్పంతా మామొగవాళ్లదేనని సారాంశం తేలేటట్లుంది. ఆడవాళ్లకి మేం మొగతనం నేర్పి, ఆవుదూడల్ని గేదెదూడలుగా చెయ్యబోయి అర్ధాన్నపుదూడల్ని చేస్తూఉన్నట్టు చెపుతున్నావు! న్యాయమేనా?" అని నవ్వుతూ అడిగాను.

"సాంతం చెప్పేదాకా వినండి. ఆనక దెబ్బలాడుదురుగాని. మీ మొగవాళ్లేమో మహాఘనులైనట్లు తమప్రతాపాలన్నీ నేర్పుతామంటారు స్త్రీకి. అన్నీ అవకతవక సలహాలే యిస్తారుకదా! వాటి పర్యవసానం మన స్త్రీలలో కొంతవరకు ప్రత్యక్షమౌతూనే ఉంది కదా? అంతకంతకూ మీరు సెక్సువైరం పెంచుతున్నారుకాని మరేమీలేదు. మీదుమిక్కిలి 'ఇమాన్సిపేషన్' అనీ, 'ఇండిపెండెన్స్' అనీ, 'ఇండివిడ్యుయాలిటీ' అనీ, 'స్వరాజ్' అనీ పెద్దపెద్దపేర్లు చెప్పి భ్రమింపజేస్తున్నారు స్త్రీని. ఔనా?" అన్నది ఉద్రేకస్వరంతో.

"అదికాదు. ఆడదానిలో అనేక అద్భుతశక్తులు ఉన్నాయనీ, వాటిని బయటికి రానివ్వకుండా మగవాడు అణచిపెడుతున్నాడనీ, సంఘం కొంతవరకు వాడికి తోడ్పడుతూ ఉందనీ కాబట్టి స్త్రీ యిప్పుడు స్వాతంత్ర్యాలవుదామంటే పురుషుడి నెదిరించి ప్రతీ విషయంలోను తనుకూడా శక్తిసామర్థ్యాలుగలమనిషే అని రుజువుచెయ్యాలనీ, సంఘనిబంధనలను ధిక్కరించాలనీ, అవసరమైతే యిప్పుడున్న సంఘాన్ని శిథిలంచెయ్యాలనీ, ముఖ్యంగా తన ఇండివిడ్యుయాలిటీని ప్రకటించుకోవాలనీ నాఉపదేశం" అని సమాధానంయిచ్చాను.

"పొరబడుతున్నారు మీరు. స్వేచ్ఛంటే సంఘతిరస్కారమని అర్థంకాదు. సంఘంలో లోటుబాట్లుంటే సవరించడం మెప్పు-చాతనయితే. అంతేకాని సంఘాన్ని భగ్నంచేసి దేవునై గురువునై అనినడుచుకుందామంటే వీలులేదు. ఈ సంసారసాగరంలో మానవజీవితమొక పడవవంటిది. సంఘము దానికొక చుక్కానీ. ప్రత్యేకవ్యక్తిత్వమంటే ఏకాకితనమనుకోకూడదు" అంటూ యోచిస్తూ ఒకక్షణం ఊరుకుంది.

"—అదిగాక" అని ప్రారంభించింది మళ్ళీ. "ప్రత్యేకవ్యక్తుల యిష్టాయిష్టాలను లోకం మన్నించదలచుకున్నప్పుడు సంఘానికిగలబలం సహజంగా క్షీణిస్తుంది. ఒకయింట్లో ఉన్న ప్రతిమనిషీ యెవరియిష్టం వొప్పున వారు నడుచుకుంటామన్నా, లేక అందరూ కూడా అన్ని పనులు చెయ్యడానికి సిద్ధపడినా ఆఇల్లు నిమిషంలో కూలవలసిందేకద? మానవసంఘం కూడా ఒకగృహం వంటిదే. జనుల అన్యోన్యసహాయం వల్లనే సంఘానికి కొంత ఐకమత్యం, గౌరవం, బలం కలుగుతూ ఉన్నవి. సంఘసౌఖ్యం, సంఘ[illegible]లు పొందాలంటే నరుడు సంఘాన్ని ధిక్కరించరాదు— ధిక్కరించకూడదు. ఈఇరవయ్యోశతాబ్దంలో అందరికీ ఒకటేపిచ్చిపట్టుకుంది. ప్రతీమనిషీ తనజీవితాన్ని ప్రత్యేకంగా తనే నడుపుకుందుకు యత్నం - సంఘసహాయంకాని యితరసహాయంకాని కోరకుండా. కాని యిందులో ఉన్నప్రమాదం ఎవరూ గుర్తించకుండా ఉన్నారు. సంఘాన్ని వదులుకో జూచిన వ్యక్తికి నిజంగా ఆలోచిస్తే ప్రత్యేకస్థానం ఈభూమిమీద ఎక్కడా లేదు. రాజ్యాంగవేత్తల కీరహస్యం తెలుసును. ఏదేశం ఇష్టంవచ్చినట్లు ఆదేశం నడుచుకోవడంలో లోకానికి గొప్ప ముప్పు అనే సంగతి మొన్నటి జర్మనీయుద్ధంతో అందరికీ విశదమైంది.

కనుకనే 'లీగ్ ఆఫ్ నేషన్స్' అనే నానాదేశసంఘమొకటి నిర్మింపబడ్డది. ప్రత్యేకజీవితమనేది ఒక వ్యక్తికిగాని ఒకదేశానికిగాని పొసగని సంగతి! అదిగాక ప్రత్యేకజీవితానికి స్వాతంత్ర్యజీవితానికి యెంతో వ్యత్యాసం ఉంది. అది గ్రహించక స్వాతంత్ర్యంలోగల మహత్యం ప్రత్యేకవ్యక్తిత్వంలో ఉన్నదని మగవాడు బోధిస్తున్నాడు స్త్రీకి. స్వేచ్ఛ అనుభవించడమంటే యిష్టంవచ్చినట్లు చెలరేగడం కాదు. ఇండిపెండెన్స్ అంటే ఐసొలేషన్ కాదు! నాగరికతంటే అన్యదేశలోపాలను అలవరుచుకోవడం కాదు. కాని పురుషు డుష్ట్రపక్షివంటివాడు. అహంభావమనే యిసకలో తలదూర్చి, నిజాన్ని చూడడానికి యిష్టపడడు. నాగరికతన్న పేరున ఎన్నెన్ని అరాచకాలైనా చేస్తున్నాడు. తన జీవితాన్ని అసౌఖ్యమయంగా చేసుకుంటున్నాడు. తా చెడ్డ కోతి వనమంతా చెరచిందన్నట్లు ఆడదాన్నికూడా ఈడుస్తున్నాడీతప్పుతోవలోకి! తనలో తననడవడికలో ఉండే వక్రత గుర్తించడు. వేమన్న చెప్పినదే వేదమన్నట్లు తా సూచించిన మార్గాన్నే ఆడది నడుచుకొని బాగుపడాలంటాడు. తనవిద్యలు, తనఆశయాలు, తన పరిశ్రమలుఅన్నీ తనవే స్త్రీలకుకూడా ముక్తిదాయకములనుకుంటాడు. నవీననాగరికతకు తానెట్లా వశమూతున్నాడో ఆడదాన్నికూడా అట్లే వశపరచాలని కోరుతున్నాడు. పులినిచూసి నక్క వాతపెట్టుకున్నట్లు స్వాతంత్ర్యం, రాజ్యైశ్వర్యం గల పాశ్చాద్దేశస్థులను మార్గదర్శకులుగాతీసికొని హిందువుడు తనలో ఉన్నగొప్పతనాన్ని రూపుమాపుకున్నాడు. ఆడదాని పూర్వాచారపద్ధతుల నెగతాళిచేసి దాని నొకదొరసానివలె తర్ఫీదుచెయ్యబోతున్నాడు. 'అయితే ఆడదానికి స్వతంత్రబుద్ధిలేదా? మగవాడిబోధన లెందుకు వినాలి? దానిదారి నది నడుచుకోరాదా?' అని అడుగుతారేమో! ఆడదానిప్రకృతిలో ఒకచిత్రమైన లక్షణమున్నది. స్వార్థత్యాగం ఆమెకు సహజభూషణం! ఒకరికొరకు, ఒకరిని సంతోషపరచుటకొరకు ఆమె చేయగల త్యాగాలకు మితిలేదు. తనసౌఖ్యం చూసుకోదు. తన బ్రతుకుతెరవు ఆలోచించదు. తనమేలు కాశించదు. పరోపకారానికిపోయి పడరాని పాట్లు పడుతుంది. దేనికీ విసుగులేదు; కించలేదు; పగలేదు; ఫలాపేక్షలేదు. క్షమాదేవివలె పురుషుడి లోపాలను మన్నిస్తూ, అతని అత్యాచారాలను సహిస్తూ అతని సేవకై తనజీవితాన్ని వినియోగపరుస్తుంది! చెడ్డపని అయినాసరే పురుషుడికి హితవుగూర్చేదని తలచినప్పుడు గప్పుకచేస్తుంది. మగజాతియెడల అనాదినుండి ఆమెకట్టి అభిమానంకలదు. అయితే మొగవాడు తనప్రతాపంకొద్దీ ఆడదాన్ని తన చిటికెనవేలుమీద తిప్పుకోగలుగుతున్నట్లు భావిస్తాడు! పురుషుడి ఉపదేశాలలోగల వక్రత గుర్తెరిగికూడా అతను చెప్పినచొప్పున ఆచరించినందుకు సంబరపడుతుంది స్త్రీ. అతని అసందర్భపుఆజ్ఞలను పాలిస్తుంది. పిచ్చిసలహాలను వింటుంది. నూతిలోపడుఅంటే పడుతుంది. అగ్నిలో దుమకమంటే సిద్ధపడింది సీత. సంతలో పశువునమ్మినట్లు నడిబజారులో పెళ్లాన్ని విక్రయిస్తానంటే ఒప్పుకుంది చంద్రమతి. కొడుకును విషంపెట్టి చంపుతానని హిరణ్యకశిపుడంటే నోరెత్తలేదు అతని భార్య. మనసు కర్ణుడిమీదఉన్నా పాండవుల్ని ఐదుగురినీ మెడకుకట్టుకొని భరించమంటే ఎదురుచెప్పలేదు ద్రౌపది. మొగుడుచస్తే వాడి చితిమీద సహగమనం చెయ్యడం ధర్మమని బోధిస్తే సరేనన్నది హిందూనారి. ఎన్నిశతాబ్దాలుగడచినా దేశకాలపరిస్థితులలో ఎన్నిమార్పులు వచ్చినా, ఆడదాని ప్రకృతిలో మాత్రం ఈ నైజం మారలేదు. మొగవాడంటే పడిచస్తుంది. వాడిమాటంటే వేదవాక్యంగా భావిస్తుంది.' నాగరికత అభివృద్ధిపొందిన ఈరోజులలో కూడా మనహిందూస్త్రీ ఎప్పటివలెనే ఉన్నది. 'మన పురాణాలు పుక్కిటికథలు చదువకు; ఇంగ్లీషు నేర్చుకో; పసుపు కాటుక విడిచిపెట్టు; ఫేస్ పౌడరు పిన్నులు వాడు; ఆచారమనీ, పూర్వసాంప్రదాయమనీ అనాగరీకంగా ఉండకు; ఓటింగుహక్కులకు పోట్లాడు; విడాకుచట్టంకావాలని మొర పెట్టు; మొగవాడిఉద్యోగాలకు పోటీచెయ్యి; కొత్తఫాషన్లు

నేర్చుకో; దొరసానివైపోవాలి నువ్వు.' అని కాని భర్త ఉపదేశిస్తే 'అలాగే' అంటుంది. లేక 'మన దేశచరిత్ర చదువు; హిందీ నేర్చుకో; రాట్నం వడికి ఖద్దరు-చీర కట్టుకో; కల్లుదుకాణాలు పిక్కెట్ చేసి దేశంకోసం పాటుపడు; నాతోపాటు జైలుకు పద' అనిచెప్తే 'సరే' అంటుంది. ఆడదానికెట్టి స్వాతంత్ర్యం కావాలో అది సంపాదించుకుందుకు ఆమె ఏవిధంగా పాటుపడాలో, ఆమెకెట్టి నాగరికత అవసరమో, ఆమెజీవితాని కేది సౌఖ్యప్రదమో అన్నీ తనే నిర్ణయిస్తానంటాడు పురుషుడు. దేనికీ అభ్యంతరం చెప్పదామె! "ఆడదానికి మెదడు, హృదయం, అనేవి లేవనుకుంటాడుకాబోలు పురుషుడు! మెత్తని వాళ్ళనుచూస్తే మొత్తబుద్ధి అంటారు ఇందుకేనేమో. మామంచిదనమే మాకు శత్రువౌతూవుంది. మగవాడి ఉపదేశాలను లక్ష్యపెట్టక తనకు దేవుడిచ్చిన గౌరవాన్ని తను నిలబెట్టుకుందుకు పాటుపడితే ఆడది స్వాతంత్ర్యరాలవుతుంది."

లక్ష్మిమాటలు విన్నపిమ్మట దీర్ఘంగా ఆలోచించవలసివచ్చింది. అనేకసమస్యలతో మెదడు వేడెక్కి ఏదీ సరియైనసమాధానం అప్పటిమట్టుకు తోచలేదు.

"నన్ను నువ్వేమన్నా సరిపోతుంది కాని పురుషలోకాన్నంతా దూషించకు. నీ పుణ్యముంటుంది. ఇంతకూ అసలు నీమనసులోఉన్న అభిప్రాయమేదో స్పష్టంగా అర్థంకాలేదు నాకు" అన్నాను.

"ఆడవాళ్ళనెట్లా అర్థంచేసుకోగలరు మీరు?" అంటూ పక్కున నవ్వింది.

# అమృతవార్త

శ్రీమతి చేబ్రోలు సూరమ్మగారు

అది వసంతాగమావసరము.

నాఁటిసాయంకాలము సూర్యాస్తమయమున కొకఘడియపూర్వ మెటనుండియో తియ్యని కోకిలారావము వినవచ్చుచుండెను.

ఆపికస్వర మాలకించుచు నాచిక్కనితరుచ్ఛాయ నట్లే నిలువఁబడిపోతిని.

గానమాధుర్యమునకు మూర్ఛఁ జెందితిని.

కొంతసేపటికిఁ దెలివివచ్చి నలుగడలఁ బరికించితిని.

సంధ్యారుణకాంతులు జారిపోయినట్లు జాడలుపొడకట్టెను.

ఇఁక నామేను మఱపించిన ఆపాటకొఱకు వెతక నారంభించితిని.

కాని అంతయు నిశ్శబ్దమే.

నాకుఁ దెలివివచ్చుటకు పూర్వమే పికకుమారి యేవంకకో పలాయనమైపోయిన ట్లప్పుడప్పుడే వ్యాపించుచున్న నిశాకరునమృతకిరణములు సందేశమిచ్చినవి.

అంతనశనిపాతాఘాతమునఁగూలు నున్నతసౌధమువలె నాయెడఁద క్రుంగిపోయెను.

కొంతసేపేమియుఁ దోపమి నట్లే గూలియుంటిని. ఆసమయమున నాకుఁ దెలియకయే యేనల్లారుముద్దుగాఁ బెంచుకొనుచున్న మల్లెతీవ జ్ఞప్తికివచ్చెను.

తోడనే చల్లని మలయపవనుఁడు కదలిరా నారంభించెను.

ఆమందమలయానిలులయమొంది నాపెంచుకున్న మల్లెనుండి నవవికసితసుమవల్లరుల యమృతమయసౌరభశుభవార్త నాకవగాహమయ్యెను.

అంత నాయానందమునకు మేరయే లేకపోయెను.

# ఉద్బోధన

సామవేదం జానకీరామశర్మగారు

అపుడే తండ్రిచే నవమానితయై సంయుక్త భర్తకడకరుదెంచినది. ఘోరీనికూడితండ్రి యుద్ధప్రసక్తుఁడనివిన్నవించి, క్షత్రియోచితకృత్యమునకు మగనిఁ బ్రేరేచుచున్నది.

"క్రూరుడై తండ్రి తురకలఁగూడి తుదకు
కఠినహృదయుండు పరుషవాక్యములఁబలికె
కన్నసంతానమున కెగ్గు కల్పనమ్ము
సేయఁగాఁబూనె నెంతటిసిగ్గుచేటు!

దేశద్రోహము పాతకంబనుచు నాదేశింపఁగాపెద్దల
త్యాశావిష్టుఁడు మ్లేచ్ఛుఁజేరి తనకత్యంతాప్తుఁడం చెంచ కా
వేశమ్మూని పరమ్మునై హికముఁ దావీక్షింపఁగాలేక స
ర్వాశాభాగములందు తండ్రియిటు దుర్వ్యాప్తిన్ గడించెన్ గటా.
సంగరమందు యుష్మదనుశాసితవీరభటప్రహారలూ
నాంగపలాయమానవికృతాకృతిలబ్ధనిరీహుఁడైన "ఘో
రిం"గని పారిపోకుమని రేపుచుశౌర్యము తానుసాయమై
సంగరమేర్పరించె. కనఁజాలఁడు మంగళ మెంతనీచుఁడో.

తండ్రియును ఘోరియునుజేరి తమబలంబు
లొక్కపరిపంపిననుగాని యుష్మదీయ
బాహుశౌర్యవినిర్గత ప్రథితఖడ్గ
ధార కెరయయి భువిఁ ద్రెళ్లిపోరె వారు?

కదనక్షోణిని శత్రువీరుల వధల్ గావించి, క్రొన్నెత్తుటే
రుదితార్కప్రతిమానమై కృతకసంధ్యోపాస్తిఁ గల్పించు నా
డది జన్మోన్నతదివ్యభూతియని యాత్మానందముంజెందు యు
ష్మదనూనాన్వయ మెంత శౌర్యయుతమో! క్ష్మామండలవ్యాప్తమై.

కుపితసుక్షత్రియశరసంక్షుభితవైరి
వీరసంఘాతలు ప్రవిహారకదన
రంగభూమీదిదృక్షాతిరాగసురలు
విస్మయన్యస్తలోచనాన్వితులుకారె?

దుర్వారోన్నతబాహుశౌర్యవిభవస్తోమాభిరాముల్, స్ఫుర
ద్గర్వాంధద్విషనాశనాతివిశదఖ్యాతుల్, నృశంసాచర

ద్గర్వోన్మత్తక్రియావిభంజనులు, సత్యప్రాభవోపేతులున్
ఉర్వీనాథులు క్షత్త్రియోత్తములటంచుద్ఘోషణల్ సల్పరే?
ఆమహనీయపౌరుషకులాంచితబాహుబలాతిశౌర్యధై
ర్యామితతేజముల్ కలసియాడుట నాహవమందుమీకు జో
డీమహి లేదు. సేన లతిహీనములంచుఁ దలంపనేల? సం
గ్రామమునందు మీనసుపఁగాఁగలశక్తియ చాలునెంతకున్.
అనుట యమంగళంబుగద, యంతకుమీఱె రణంబునందు నీ
ల్గిన బహుధర్మకర్మములలీలలెఱింగి చరించువారిత్రో
వన యపవర్గసౌఖ్యములఁ బాయకఁగొందురు. లేదయేని జీ
వనముగలంతకాలము శబాసన పాలనఁజేతు రీభువిన్.

నేనును మీవిధమ్మున ఘనీభవమైన పరాభవానలం
బానిముసమ్ములోన రణమందు కృపాణముఁబూని శత్రుసే
నానివహమ్ము చెండుటను నాశనముంబొనరింతు లేనిచో
మానితనాకసౌఖ్యమెసుమా! జతనంబొనరింపు డాజికిన్."

## వేకువ

శ్రీమతి పరుచూరి భువనేశ్వరీదేవిగారు

౧

శైవలసరోజములచిక్కు చక్కదిద్ది
తేటికాటుకరేకను దీర్చి బాగ
మిసిమిపుప్పొడిపసుపు నెమ్మేనసలది
ప్రియునిరాకకు పద్మిని వేచియుండె.

౨

తరతరంబుల తామరతంపరైన
తామరసవృద్ధిగాంచినం దాళలేక
పొరుగుతొగకన్నెవగమూతి ముడిచికొనియె.
సహజమె కళంకినులకు దోషాదిగతులు.

౩

మంచుమేలిముసుంగు నొకించుకంత
తొలగదోసి ప్రాచీకాంత దొంగిచూచి
నగియె నితరదిశాంగనల్ నవ్వునట్లు
యామినీకామినీనాయకాభిసరణ.

౪

చిత్రభానుభానుజ్వాలచ్ఛిత్రవర్ణ
తృణగతహిమాంబుకణగణ మింపునింపె
భూమిదేవి పచ్చనిపట్టుపుట్టమందు
పొదిగిన విచిత్రనవరత్నపూగమనగ.

౫

కువలయంబేలురాజునే గోలుపోయి
గోడుగోడున విహగసంకులమిపాన
నేడ్చె యామినిప్రాక్చ్ఛితి యొజ్జటగ్గి
భస్మమయ్యెననం దెల్లవారె దూర్పు.

౬

మిత్రునాపత్తుచే దలవ్రేలవైచి
కలగిరాయున్నరాజు కాకలుదలంచి
కలువమండలంబు దుఃఖింపగాదొడంగె
అంతరితభృంగఝంకృతు లతిశయింప.

# అంటరానిబాలిక

కె సుకుర్తి రామకోటయ్యా చౌదరిగారు

రూప నిజముగా రూపవతి. బంగారమువంటిరంగు, సుందరమైనముఖము, పెద్దపెద్ద నేత్రములు. ఆమెకు సుందరీమణులలో నొకశ్రేష్ఠస్థాన మివ్వవచ్చు. కాని ఆమె అంటరానిబాలిక. ఇందువల్లనే ఆమె సౌందర్యము వృథా. కోకిలనుధిక్కరించు ఆమె మధురవాణి ఎవనికిప్రియముగా నుండదు? కాని ఎవరూ వినువారులేరు. ఆమె మనోహరమందగమనమును కాముకులును, లంపటులునూ తప్ప చూచువారెవ్వరూలేరు. ఆమె చంచల దృక్కులు చాలామందిహృదయములలో ప్రేమకు మారుగా నొప్పినిగలుగజేయును. ఎందువల్ల?...ఆమె అంటరానిబాలిక.

ఆమె అంటరానిది. ఇదే ఆమెదోషము. ఇందువల్లనే ఆమెను దగ్గిరకూర్చోనివ్వరు. ఎవరునూ ఆదరించరు, సహానుభూతిగా రెండుమాటలైననూ మాట్లాడరు. ఆమెనుజూచి పురుషులు "ఆహా! యీమె మంచికులములో జన్మించినట్లయితే" అనుకునేవారు స్త్రీలు. "ఈమె అంటరాని బాలికకానట్లయితే" అనుకునేవారు. కాని నేను ఎప్పుడూ యిట్లనుకోను. ఈమె ఏదైనామంచికులములో జన్మించియున్నట్లయితే ఎంతో అభిమానముతోఉండేది. ఇప్పుడందులో శతాంశమైననూలేదు. పెద్దకులమున జన్మించుచో ఆమె సహజ సౌందర్యము బాహ్యాభూషణములతో కప్పబడిపొయ్యేది. ఆమెయందు లజ్జ, పవిత్రత, సచ్చరిత్రత మూర్తీభవించియున్నవి. ఆమె ఎప్పుడూ ఎవరితోనూ పరిహాసమాడదు. ఎవరితోనూ మాటలాడదు. ఆమె యిటునటు బోవుచుండునప్పుడు, అనేకమంది ఆమెనుగురించి రకరకములుగా మాట్లాడుకొనెదరు. కాని ఆమె నిశ్శబ్దంగా వెళ్ళిపోతుంది. వంచినతల పైకెత్తదు.

ఆమె నాయింటికితప్ప మరెవ్వరింటికిపోదు. పోయిననూ పిలిచినప్పుడు మాత్రమే. ఆమె ఆత్మగౌరవము గలది. అయిననూ అంటరానిది. ఆమె నిత్యము మాయింటికివచ్చుచూఉండును. మాఅమ్మ, పినతల్లుల స్వభావమంత మంచిదిగాదు. అయిననూ మాయింట్లో తనఅభిమానమంతయూ మరచిపోతుంది. వస్తూపోతూనావంక ఒకసారిమాత్రము తప్పకుండా చూచిపోతుంది. మారెండుచూపులు కలవటంతోనే సిగ్గుతోపారిపోతుంది. నేను ముంగిలిలో కాన్పించినచో లోపలకువస్తుంది. ఆమె హృదయంలో ఏముందో ఈశ్వరునికి తెలియాలి. కాని నన్నుజూచి మాత్రము ప్రసన్నముఖియవుతుంది.

ఆమెనుగురించి నామనస్సు ఎల్లప్పుడూ పవిత్రతగాఉంటుంది. నేనామెనుజూచి ప్రసన్నుడనౌతాను. కాని ఏదో తప్పుఅభిప్రాయంతో మాత్రంగాదు. నేనామెను అంటరానిదని దూరముగాఉంచను. ఆమె దరిద్రత జూచినప్పుడు దుఃఖమును, ఆత్మాభిమానము జూచినప్పుడు గర్వమును గలుగుతూయుంటుంది. ఇతరులు ఆమెతో నీచముగా ప్రవర్తించునప్పుడు నాహృదయము క్రోధముచే నిండిపోతుంది. కాని రూప వారికువాసనలపై కుఠారాఘాతముచేయుటజూచి సంతోషముతో ఉబ్బిపోతాను. నాకు రూపమీద ఎంతోగర్వము.

అప్పుడప్పుడు రూపతో ఒకటిరెండుమాటలు మాట్లాడుతాను. ఆమె యింతమాత్రముచేతనే సంతుష్టిచెందుతుంది. నేనెప్పుడైనా ఆమెకు పనిజెప్పినచో సంతోషముతో తక్షణమేపరుగెత్తి నాపనిపూర్తిజేస్తుంది. అప్పుడప్పుడామెకు సహాయముచెయ్యాలనుకుంటాను, కాని ఆమె ఎప్పుడూ నావల్లనొక్కపైసాగూడా తీసుకోలే. ఇందువల్ల నాకప్పుడప్పుడు దుఃఖముగలుగుతూఉంటుంది. మాఅమ్మఏదైనా యిచ్చినచో ఎంతోసంతోషముతో తీసుకుంటుంది. ఇందువల్ల నాకు మరీదుఃఖము. నాతల్లిని, పినతల్లినిచూస్తే చాలాభయంగానేయుంటుంది. ఎప్పుడూ గడపలోపలకు అడుగుపెట్టదు. పెట్టిననూ ఏవస్తువయూ ముట్టుకోదు.

ఒకపర్యాయము ఆమె ఇల్లూడ్చునప్పుడు అకస్మాత్తుగా ఆమెవస్త్రము పాత్రలకుతగిలింది. పాత్రల కానుకునే నీటికడవలున్నవి. నాతల్లి చూడడంతోనే క్రోధముతో అరచుచూ ఒకకట్టెతీసుకుని విసరివేసింది. కట్టె ఆమెకోమలమయిన కాళ్ళకుతగిలింది. వెంటనే నెత్తురువచ్చింది. కాని రూపనోటినుండి ఒకశబ్దముగూడా వెలువడలే. నిశ్శబ్దంగానుంచుంది. ఆమెముఖము మలినమయింది. కళ్లనిండానీళ్ళు గిర్రునతిరిగినవి. నాతల్లి కోపము ఇంకాశాంతించలే. "నీకళ్ళుపోయినవా? చూడడంలే? కడవలు, పాత్రలు అన్నియు మైలబడి పోయినవే?"అంది.

మాపినతల్లి "అందగత్తెననే గర్వంతో తనెవరో మరచిపోయింది"అంది. నాతల్లి "యిటువంటి అందానికినిప్పొయ్య! ఫో, పాడుముఖముదానా! నాయింటినుంచి"అంది.

పాపము రూప గడగడలాడుతూ వెళ్ళిపోయింది. నేను బయటిగదిలోకూర్చుని చదువుకుంటూ యున్నాను. ఆమె కాలిరక్తముజూచి "రూపా! యిది ఏమిటి?"అన్నాను.

"బాబూ! అమ్మగారుకొట్టింది." రూప నాతో ఏమియూదాపెట్టదు. నాకు కోపమొచ్చింది. "ఎందుకు?" అన్నాను.

"నావల్ల నీళ్ళకడవలు మైలబడ్డవి"

నాహృదయము క్షుభించిపోయింది. ఈతప్పనకే యింతశిక్షా? ఈమె మనిషికాదా? బీదదనా? ఈమె తరపున ఎవరును మాట్లాడువారులేరనియా? హా! మానుషత్వము! నేను మరల "రూపా! నాయీతల్లి తప్పు క్షమించవలయును"అన్నాను.

రూప:—రామ! రామ! బాబూ! తమరట్లాఅనెదరేమి? వారు నాతల్లితో సమానము. తల్లితనబిడ్డను ఎప్పుడూ కొట్టుకొనదా?

నేను:—ఇతరు లేమందురు?

రూప:—ఇతరులకెట్లా తెలుస్తుంది?

ఈమాటచెప్పి ఆమె వెళ్ళిపోయింది. నాకళ్ళనుండి రెండు కన్నీటిబిందువులు పుస్తకంపైబడ్డవి. హృదయము వేదనతో "ఇదేనా అంటు?"అంది.

మాఅమ్మకడవలన్నియు పారవేశింది. పాత్రలన్నియు నిప్పులోవేసి పవిత్రంజేసింది. మాతల్లితో "అమ్మా! రూప అంటుకున్నందువల్ల పాత్రలుగూడా మైలపడ్డవా?"అన్నాను.

మాతల్లికోపంతో "పో! పో! నీకంటులేదు గాబోలు. నాకంటుంది"అంది. నేను బయటికు వెళ్ళిపోయ్యాను. నాహృదయంలోఉన్నఅగ్ని నాశరీరమంతటిని కాల్చివేయుచున్నది. నాఅశ్రుధారగూడా నాహృదయాగ్నిని చల్లార్పలేకపోయింది. రూప రెండవదినమున ఎప్పటివలె నాగదిముందుగాబోతుంది. ఆమెకాలికి కట్టుకట్టుకుంది. కొంచెంగాకుంటుతుంది కూడాను. కుంటటంనాకు కాన్పించకుండాజెయ్యాలని చాలాప్రయత్నించింది. కాని లాభంలేకపోయింది. ఆమె నావంకజూచి చిరునవ్వునవ్వింది. దెబ్బతినియూ, ఎక్కువదుఃఖము అనుభవించియుగూడా తనదుఃఖమును నాతో దాచిపెట్టవలయుననియే ప్రయత్నించింది. ఎటువంటి సహనశీలత?...ఎంతఓర్పు?...

ఈరోజులలో ఆమెతండ్రి జబ్బుతో మంచముపైబడియున్నాడు. చలిజ్వర మతనిని శల్యావశిష్టుణ్ని జేసింది. కఠినపరిశ్రమజేసి రోజుకూలి సంపాదించుకుని పొట్టగడుపుకొనువారలు నాల్గురోజులు మంచముపై బడియున్నచో వాళ్ళగతిఏమవుతుందో అనుభవించువారలకుతప్ప మనం గ్రహించడం కష్టమేయవుతుంది. నాల్గయిదురోజులవరకూ ఏదోవిధంగా గడచిపోయింది. కాని యిక ఉపవాసములు చేయవలసివచ్చింది.

హీంగూయొక్క జబ్బు, దరిద్రత, వానికష్టములు అందరికి తెలిసియేయుంది. అయిననూ ఎవరూ వానిఇంటికివెళ్ళి మాట్లాడించలే. నేనుతప్పకుండా రోజుకురెండుమార్లు వెళ్ళుతూయుంటాను. మందు యేర్పాటంతయూజేశాను. పాపము రూప ఎవరినన్నా అడిగి మందుతెచ్చుటకుగూడా సిగ్గుపడుతుంది.

నాయీవ్యవహారమువల్ల రూపపైననూ ఆమెతండ్రిపైనను చాలాప్రభావంపడ్డది. పాపము హీంగూ నాకు వందలకొలదీ దీవెనలిచ్చాడు. నాయీసహాయమును ఎంతోపొగడాడు. కాని రూపనోటినుండి ఒక మాటగూడా వెడలదు. ఆమె నిశ్శబ్దంగా నావంక జూచుచూఉంటుంది. అప్పుడప్పుడామెనేత్రములనుండి కృతజ్ఞతాశ్రువులు వెలుపలికివచ్చి ఆమెసుందరమైన చెక్కిళులను తడపివేయుచూఉండును. ఆమె ఈ మూకకృతజ్ఞతవల్లనే నెంతమర్మాహతుడనయ్యేదనో అంతయూజీవితంలో ఎప్పుడూగాను. జబ్బువచ్చిన ఏడవ దినమున ఎప్పటివలె రూప యింటికివెళ్ళాను. హీంగూ ఆరోజున అచేతనుడైపడియున్నాడు. రూప తండ్రి మంచమువద్ద కూర్చునిఏడుస్తూఉంది. నన్నుజూచుటతోనే కళ్ళుతుడుచుకుని "బాబుగారూ! ఈరోజున మాతండ్రిస్థితి చాలాకష్టంగాఉంది. ఉదయాన్నుంచి తెలివేలేదు"అంది.

"రూపా! నన్నెందుకుపిలవలేదు?"అన్నాను.

రూప నేత్రములనిండా నీరునిండింది. "బాబుగారూ! నేను తల్లిగారికి భయపడుతున్నాను. గ్రామస్థు లందరూ మిమ్ములనన్వెదరేమోయనిగూడా భయంగాఉంది. నాకేమి? నేను నీచురాలను. నాకుకీర్త్యప కీర్తులులేవుగా!"అని మరలనేడ్వ నారంభించింది.

నేను నామనస్సులో "రూపా! నీవు నీచకులజవైననూ అందరికంటె ఎక్కువైనదానవు. నీయుద్దేశ ములు ఎంతపవిత్రమయినవో యితరులవి అంతనీచమైనవి. నీవుదేవివి" అనుకున్నాను. మరల ప్రత్యక్షముగా "రూపా! నీకపకీర్తివచ్చునేమోయని చూచుచున్నాను. లేనిచో దినమంతయూ ఇక్కడనేయుందును. నేను నీకపకీర్తివచ్చుట కిష్టపడను"అన్నాను.

ఈమాటవిని రూపయింకాఎక్కువగా ఏడ్వసాగింది. నేనేదోవిధంగా శాంతపరిచి, మందుతెచ్చుటకొరకై లేచివెళ్ళుతున్నాను. రూపఎదురుగా వచ్చినన్నాపి, ఒకవెండివస్తువు నాచేతిలోఉంచి "బాబుగారూ! దీనిని ఏదోవిధముగాఅమ్మి నాకుడబ్బుతెచ్చియివ్వండి. ఈరోజున ఇంట్లో ఒకగింజగూడాలేదు"అన్నది.

నాకళ్ళనిండా నీరునిండింది. కంపితస్వరముతో "రూపా! ఇది నాఆజ్ఞఅనుకో లేక ప్రార్థనఅనుకో: నేను చెప్పువరకూ నీవస్తువేదియూ అమ్మవలదు. నాకుశక్తియున్నంతవరకూ నీకు సహాయముజేసెదను. ఆపై ఈశ్వరాజ్ఞ"అన్నాను. రూపఏదో చెప్పప్రయత్నించింది. కాని నేనుమరల "నావలన నీవు ఎప్పుడూ సహా యముపొందలేదు. ఈరోజున నీవు ఒప్పుకొననిచో నాకు దుఃఖముకలుగును."అన్నాను.

రూప ఏమియుమాట్లాడలే. కేవలం నావంక చూచుచూనుంచుంది. ఆమె యుద్దేశ్యములన్నియు ఆమె కళ్ళలో ప్రతిబింబించుచున్నవి. కళ్ళయందు కృతజ్ఞత, అధరములమీద క్షీణమైనట్టియూ దుఃఖముతో గూడు కునిన చిరునవ్వు ఉంది. నేను ఆమెవస్తువులను తిరిగియిచ్చివేసి జేబులోనుండి ఐదురూప్యముల నోటుతీసి ఆమెచేతిలోఉంచాను. ఆమె ఒకనిట్టూర్పువిడచి తండ్రివద్దకూర్చుంది.

రెండువారములు గడచిపోయింది. ఆమెతండ్రిజబ్బు ఇంకాతగ్గలే. నేను ఏదోయొకటి ఇతరులు చూడ కుండా రూపకు ఇస్తూనేయున్నాను. ఇతరులుచూచినచో దీనికిగూడా ఏదోయొకఅర్థం గలిపిస్తారని నాకెంతోభయంగాఉండేది. ఒకరోజున కొందరపెద్దలను పోగుజేశాను. వారితో "చూడండీ! హీంగూ చాలారోజులనుండీ జబ్బుగాఉన్నాడు. వానికి సహాయముచెయ్యాలె. పాపము! ఆకలివల్ల చచ్చిపోవు చున్నాడు."అన్నాను.

ఒక పెద్దమనిషి:-తమ రొక్కరికే ఇంతవిచార మెందుకు?

నే నుత్తేజితుడనై "మనుష్యత్వోద్దేశముతో" అన్నాను.

కొంతమంది మెల్లగానవ్వారు. ఆనవ్వులో అవిశ్వాసముంది. "నేను ఈనీచపిశాచముల సహాయము కోరి ఆపవిత్రాత్మను కళంకితముజేశా" ననుకున్నాను.

నేనేమియు మరలమాట్లాడలే. నిశ్శబ్దంగా లేచినుంచున్నాను. నేను లేవటంజూచి ఒకవృద్ధుడు "బాబూ! మనవాళ్ళన్నా అయితే సహాయముజేతుము. ఎవరో అంటరాని వాళ్ళ కెట్లా సహాయముచేయగలము?" అన్నాడు. నేను మనస్సులో "ఆహా! పశుత్వం" అనుకున్నాను.

ఇద్దరుముగ్గురుమాత్రం నావత్తిడిపల్ల కొంచం సహాయముజేశారు. మనుష్యజాతిని అవమానపరచు ఈ నరపిశాచముల జూచినప్పుడు నాహృదయంలో ఒకవిధమయిన ఘృణాభావముగలిగింది. వీరు స్వార్థాంధులని స్పష్టంగా తెలిసిపోయింది. వీరు నీచోద్దేశులయిననూ ఉచ్చకులజులే... రూప అంటరానిది.

మూడువారములు గడచిపోయింది. హింగూ ఇప్పటివరకూ మంచముమీద నేపడియున్నాడు. ఎవరూ పలుకరించువారులేరు. ఒక పైసగూడ సహాయముజేయువారులేరు. ఒకరోజున బయటవసారాలోగూర్చుని రూప ఏడుస్తూయుంది. నన్నుచూచుటతో నే మరీఎక్కువజేసింది. ఓదార్చుచూ "రూపా! ఏమిటి? ఇంత అధీరవై పోవుచున్నావు. ఎందుకు?" అన్నాను. ఎందుకేడున్నుందో చెప్పవలయునని చాలాబలవంతపెట్టాను. ఆఖరుకు చెప్పింది. ఆమె నొక పెద్దమనిషి అన్నానికిపిలిచాడు. ఏకాంతంగాజూచి అతినీచప్రసంగంజేశాడు. అనేక విధముల ఆశపెట్టాడు. ఆమె అతనిదురాశలన్నింటిని కాలదన్నింది....హా! దౌర్భాగ్యము!! ప్రపంచములో ఎటువంటినీచులు, కృతఘ్నులున్నారు? వారు ఇతరులదుఃఖముజూచి దుఃఖితులవుటకుమారుగా వారినే పీడించుచున్నారు. పైగా తమను ఉచ్చకులజులమని ప్రకటించుకొనుచున్నారు.

నేను దుఃఖితుడనౌటజూచి రూప "బాబుగారూ! తమరు దుఃఖించవలదు. ఇది నాపూర్వజన్మకర్మ ఫలము కానిచో ఈ అంటరానిజాతిలో నెందుకుపుట్టుదును? అంటరానివాళ్ళ కింతకంటె ఏమిసన్మానము జరుగును?" అంది.

నేను "రూపా! ఈఅవమానమునకు బదులుతీర్చకుండా యుండలేను" అన్నాను.

రూప గంభీరముతో "వలదు, బాబూ! వలదు. తమరుఎవరిని ఏమియూఅనవలదు. నాప్రార్థన అంగీకరించి ఊరుకోండి" అంది.

నేను "రూపా! నీవు దేవివి" అన్నాను.

రూప చిరునవ్వుతో "ఆహా! తమరెటువంటిమాట మాట్లాడుచున్నారు? నాయటువంటి అంటరానిది గూడా దేవియగునా? నేను దేవీపాదరేణువునుగూడా బోలను" అంది.

నేను రూపయింటికి రావటంపోవటం నెమ్మదినెమ్మదిగా అందరికితెలిసింది. అందరూ అనేకరకములుగా అనుకుంటున్నారు. ఒకడు "ఇందుకనే అయ్యగారు హింగూకుసహాయముచేయండని యింతగా గొట్టుకున్నాడు. నాకసలు మొదటనే సందేహంగలిగింది" అన్నాడు. రెండవవాడు "లేకపోతే ఏమనుకుంటున్నావు? ఆయనంతపరోపకారనుకున్నావా?" మూడవవాడు "రూప వలలోపడ్డాడు. అదిగూడా చాలాచక్కంగదే." రూపతో నీచప్రసంగముజేసినవాడు "చక్కనిదైనా అంటరానిది. ఆమెను పవిత్రమైన హిందువు డెవ్వ డంటుకుంటాడు? ఇది ఆంగ్లచదువులఫలితము. చక్కగాఉంటేసరి ఎవతైనాసరే. ఇది అంటరానిదౌనా కాదాయను విచారణయేలేదు." అన్నాడు. మరొకహిందూమతాచార్యుడు "ఇప్పుడే ఏమయింది?

కొద్దిరోజులలో అంటరానివారితో బహిరంగంగానే వివాహము చేసుకుంటారు. ఇటువంటి నవయువకులవల్లనూ, జాతివిరోధులవల్లనూ హిందూజాతి రసాతలమునకు బోతుంది"అన్నాడు.

ఇటువంటి అనేకమైనమాటలు నాకు చేరుచున్నవి. నేను నామనస్సులో "హా...! పాషండులారా? నోటితో రాం! రాం! హృదయంలో ఇటువంటికువాసనలు, ఇటువంటికుచ్ఛితోద్దేశములు. పైగా ధర్మావలంబులమని గర్వము''అనుకున్నాను.

నాతల్లికిగూడా ఈసంగతులు తెలియకుండాయుండలే. ఆమె ఒకరోజున క్రోధనుతో "ఏమిరా! జ్ఞానూ! నీవు యింతలజ్జాహీనుడవైతివా? పట్టణములో అందరూఉమియుచూఉన్నారే? ఇదేనా ఆంగ్లభాష నేర్చిన ఫలితము?"అంది.

నేను "అమ్మా! నేనీనీచులను ఘృణాదృష్టితో జూచుచూఉన్నాను. వారిచేతలు నీకు చెప్పుచో నీవాశ్చర్యపడుదువు. వారే నామీద దోషమువేయుచున్నారు. నన్నుగురించి ఎవరు ఏదిఅన్ననూసరే నాకర్తవ్యమును నేను నెరవేర్చెదను. అంటరానివారికి సేవజేసి నన్నుధన్యుణ్ణిగా భావించుకుంటాను" అన్నాను.

నామాటలవల్ల నాతల్లికి దుఃఖముగలిగింది. కాని యీవిషయంలో నేను ఎవరిమాటయు వినదలచుకోనలేదు. రూపయొక్క పవిత్రమూర్తి ఎల్లప్పుడూ నాకన్నులఎదుటనే ఆడుచూ, నామనస్సుఉత్సాహముచే నిండింపజేస్తుంది. చిరునవ్వునవ్వు ఆమనోహరప్రతిమ ఎల్లప్పుడూ నాహృదయంలో నేయుంటుంది.

నేనామెను అంటరానిదని యనుకోనసేయనుకోనను. ఆమెసాక్షాత్ దేవీమూర్తి...కొన్నిరోజులు విడువకుండా మందువాడినందున హింగూకు జబ్బునయమైంది. మరల వాడు తనపనిని చేసుకోనగలస్థితిలోకి వచ్చాడు. దినమంతయూకష్టపడి పొట్టనింపుకుంటున్నాడు. అయిననూ వాడు నాబుణమును తీర్చవలయుననియే పట్టుదలతోఉన్నాడు. కొన్నిదినములతర్వాత ఒకరోజున రూప రెండురూపాయీలు తెచ్చి నా చేతిలోపెట్టింది. "ఈరూపాయీ లెక్కడివి?"అన్నాను. "బాబుగారూ! తమరు నాతండ్రి జబ్బుకు చాలా డబ్బు కర్చుచేశారు. అవేయివి. నెమ్మదినెమ్మదిగా ఇంకా తీర్చుకుంటాను''అంది.

నేను రూప యొక్కచేతిని నాజీవితంలో మొదటిపర్యాయము ఇప్పుడేపట్టుకున్నాను. "రూపా! నీవునన్ను ఇతరునిగా భావించుచున్నావు. అందువల్లనే ఆరూపాయీల యుద్దేశ్యము ఇంకా నీమనస్సులో ఉంది. చూడు! ఇక ఎప్పుడూ రూపాయీలమాట ఎత్తవలదు. లేనిచో నాకు చాలాదుఃఖము గలుగుతుంది. పో! ఈరూపాయీలతో గుడ్డలుకొనుక్కో, చినిగినగుడ్డలు కట్టుకునియున్నావు''అన్నాను.

రూప నావంక ప్రేమ, కృతజ్ఞతాపూరితదృష్టులతో జూచింది. ముత్యమును ధిక్కరించు ఒకగుండ్రని కన్నీటిబిందువు ఆమె నునుచెక్కిలిపైబడి దొర్లిపోయింది. "ఈమె హృదయంలోగూడా ప్రేమసామ్రాజ్యమున్నదా?''

* * * *

నాలుగునెలల తర్వాతనే పట్నములో కలరాప్రవేశించింది. అది త్వరగా పట్నమంతటా వ్యాపిస్తూ ఉంది. ప్రజలు పట్నాన్నివదలి పోతూయున్నారు. చాలామంది వూరిబయట తోటల్లోఉంటున్నారు. కొంతమంది భార్యపిల్లలను యితరగ్రామములు పంపివేశి వారుస్వయంగా మరొకగ్రామమునకు వెళ్ళియుంటున్నారు. ఇంతవరకూ మాచుట్టుపట్లఇండ్లలోమాత్రము కలరాలేదు. అందువల్లమేము కొంతవరకు నిశ్చింతగానేయున్నాము. ఒకరోజుఉదయము మాప్రక్కయింట్లోనే కలరాప్రవేశించింది. ఇండ్లలో గోలెక్కువయింది. ఒకడు "ఇక ఇక్కడయుండటం బుద్ధిమంతుల లక్షణంగా"దన్నాడు. రెండవవాడు "రేపే నేను

రెండవహోటికి వెళ్ళిపోతా"నన్నాడు. ఇద్దరు వయోవృద్ధులు "పారిపోయినందువల్ల మృత్యువుదప్పునా? చావ వలశియుంటే ఎక్కడైనాతప్పదు"అన్నారు. నాతల్లి "జ్ఞానూ! మామూ ఒకటిరెండురోజులుజూచి కాశీవెళ్ళే ప్రయత్నంచెయ్యి. ఇక ఇక్కడుండుటను మంచిదికా"దన్నది.

నేను మంచిదని తల్లిని శాంతపరిచాను. ఆరోజునే రూప మాయింటికొచ్చింది. నేనామె నడిగాను "రూపా! నీవెక్కడకు వెళ్ళుదువు? అమ్మ కాశీవెళ్ళాలంటోంది."

రూప మలినవదనయై "బాబుగారూ! తమరువెళ్ళండి. నేబీదదానను. ఎక్కడకువెళ్ళగలను?"అంది.

నేను:—ఎవరితోనైనా వెళ్ళరాదా!

రూప:—బాబూ! అంటరానిదాని నెవరువెంటనుండ నిచ్చెదరు? నాకు బంధువులూలేరూ.

నేను క్రిందికి జూచుచూ "నావెంటవచ్చెదవా?"అన్నాను.

రూపయొక్క సుందరముఖము హర్షమువల్ల వికసించింది. కాని "నేను రాన"ంది. నేను చకితుడనై "ఎందువల్ల? "అన్నాను.రూప గద్గదకంఠముతో "తమకు యిప్పటి యీఅపకీర్తిచాలదా? మిమ్మలను ఇంకా ఎక్కువ అపకీర్తి పాలుజేసెదనా? చావాలసియుంటే ఇక్కడే మీపేరు జపముచేసుకుంటూ చచ్చిపోయెదను. కాని నేను రాజాల"అంది.

నేననేకకథముల చెప్పాను. కోప్పడ్డానుగూడాను. కాని ఆమెనోటినుండి రాననితప్ప మరేమియు జవాబులేదు. ఆఖరుకు కోపముతో నేను "అయితే నేనుగూడా పో"నన్నాను. ఈమాటవినుటతోనే రూప వ్యాకులహృదయంతో ప్రార్థింపసాగింది. ఆఖరుకు నేనామెమాట ఒప్పుకోవలసివచ్చింది. కాని నేనొకషరతుపెట్టాను. ఆమెకు ఏవిధమైన కష్టమొచ్చిననూసరే నాకు త్తరము వ్రాయాలని.

మాయింటిచుట్టూయున్న ఇండ్లన్నియూ ఖాళీఅవుతున్నవి. నేనుగూడా వెళ్ళడానికి ఏర్పాటంతా జేశాను. కాని నాఅదృష్టము మరొకవిధంగాఉంది. సాయంత్రంబండికి వెళ్ళుదామని నిశ్చయంజేసుకున్నాము. కాని మధ్యాహ్నంనుంచే దౌర్భాగ్యంవల్ల నాతల్లికి విరోచనాలు ప్రారంభించినవి. నాకు భయమేసి డాక్టరును పిలిచాను. ఏమియుపాలుపోక అటునిటు తిరుగసాగాను. నాకు సహాయులెవ్వరూలేరు. మిగిలియున్న ఇరుగు పొరుగువారుగూడా నాతల్లిస్థితిజూచి పారిపోయ్యారు. నాపినతల్లిగూడా వెళ్లిపోయింది. ప్రపంచములో నావాడెవ్వడూలేడని నాకు ఈరోజున తెలిసింది. దుఃఖసమయంలో ఎవనికిఎవడూగాడు. తనవారుగూడా పరాయివారయ్యెదరు. ఏసంబంధీకుడైనా పిలచినచో ఏదోయొకవంక జెప్పి దాటిపోతాడు. ఆఖరుకు హతాశుడనైకూర్చున్నాను. ప్రపంచమంతయూ అంధకారమయంగా గానుపించింది.

కాని ఈ బంధురాంధకారమును భేదించి యొక యుజ్వలకిరణము నానిరాశను ఆశగా పరిణమింప చేయసాగింది. ఆయుజ్వలకిరణమే రూపయొక్క సహానుభూతి. నేనునిస్సహాయస్థితిలోఉన్న సమయంలో ఆనిస్సహాయ అంటరానిబాలికవచ్చి నన్నురక్షించింది. ఆమెవచ్చి "బాబుగారూ! భయపడెదరెందుకు? నేను బ్రతికేయున్నాను. తల్లిగారిసేవ నేనుజేయుదును. అమ్మగారాజ్ఞ తీసుకోండి"అంది.

నేను తల్లినిఅడిగాను.,దుఃఖసమయంలో సహాయముచేయవచ్చినవారిని ఎవరైనావలదంటారా? "జ్ఞానూ! రూపనుపిలువు. మనవారంతా మనలను వదలినప్పుడు ఆమెయేమనమనిషి"అంది. నేను మనస్సులో "ఈశ్వరుడు సర్వశక్తివంతుడు. ఎంతవారలగర్వమునైననూ చూర్ణముచేయుచున్నాడు. రూపయొక్క పాపనుజూచినంతనే పారిపోవునాతల్లి నేడు ఆమెచేతినీరు త్రాగుటకు సిద్ధమయింది.

రూపవచ్చి అమ్మకుశక్తికొలదీ సేవజేయసాగింది. ఆమె విరోచనము శుభ్రముజేస్తుంది. ఆమె గుడ్డలు మార్చికడుతుంది. ఎల్లప్పుడూ, విసరుతూయుంటుంది. రాత్రంతయు మేల్కొని తల్లిమంచమువద్ద నేయుం

టుంది. ఒక్కక్షణంగూడా నిద్రపోదు. మాతల్లి ఆమెతో "బిడ్డా! నీవుదేవివి. నాతప్పుక్షమించు"అంది. రూప "అమ్మా! ఆమాట మరచిపొండి. తమ సేవజేయుటయే నాధర్మముగా భావించుకున్నాను"అంది.

మాఅమ్మస్థితి కొంచము బాగుపడ్డది. కాని అప్పుడే నాదుఃఖమునకంతమురాలేదు. మాఅమ్మకు కొంచెము నెమ్మదించడముతోనే కలరా నన్నాక్రమించింది. మాఅమ్మ యింకాయిటునటు తిరుగజాలకుండానే యుంది. అందువల్ల నాభారంగూడా రూపపైననేపడ్డది. ఆమె నన్ను తనప్రాణంగా జూచుకుంటుంది. డాక్టరు రోజుకు మూడుమార్లువచ్చి పోతూయుంటాడు. మందుతేవటం, ఇవ్వటం, ఏర్పాటంత హీంగూచూస్తూన్నాడు. పాపము వాడురోజంతయూ యింటిముంగిలిలోనే కూర్చుంటాడు. పిలుచుటయేతడవు, పరుగెత్తుకొస్తాడు. ఒకరోజు మాఅమ్మ ఏడ్వటంజూచి "అమ్మగారూ! తమరెందుకు ఏడ్చెదరు? బాబు మాకుజేసిన యుపకారము నకు మేము ప్రాణమిచ్చియైననూ తీర్చుకొనలేము"అన్నాడు.

మాతల్లి "సోదరా! నాకీప్రపంచములో మీకంటెదిక్కెవ్వరూలేరు"అంది. రాత్రికి నాస్థితి మరీకష్టంగా ఉంది. నేను రూపను తలనొప్పికూర్చోమన్నాను. ఆమె నాపరిస్థితినిజూచి నాఆజ్ఞను నెరవేర్చింది. నేను కన్నులు తెరచి ఆమెవంక యొకపర్యాయము జూచాను. నాకళ్ళనిండా నీరునిండింది. రూప నాకండ్లు తుడుచుచూ "బాబుగారూ! ఎందుకింత భయపడెదరు? జబ్బు తెల్లవారుసరికి బాగవుతుంది"అంది.

నేను:—రూపా! నీవుచేసిన యీసేవయొక్కఋణము తీర్చుకొనలేను. ఇందువల్లనే యింతదుఃఖము.

రూప "బాబుగారూ! ఆవిచారము మనస్సులో పెట్టుకొనవలదు. లేనిచో ఆరోగ్యము చెడిపోవును" అంది. నేను కన్నులుమూసుకున్నాను. రూపనాతలనువత్తుతోంది. నేను నిద్రపొయ్యాను. నేనెంతవరకు నిద్ర పొయ్యానో తెలియదు. కాని మేల్కొనినప్పుడు రూప మొదట నేను చూచినవిధముగానే కూర్చునియుంది. ఆమె ఒకచెయ్యి నాతలమీదనేయుంది. ఒకచేతితో విసరుతుంది. నాహృదయం చాలాశాంతంగాఉంది. డాక్టరుగారువచ్చిచూచి సంతోషించారు. రెండురోజులలో అటుఇటుతిరగసాగాను. మూడవరోజున మేమంతా వెళ్ళిపోదామనుకుంటున్నాము. ఇంతలో రూపకు వమనమయింది. నేను చాలాభయపడి పొయ్యాను. డాక్టరునుపిలిచి మందు లిప్పించాను. కాని వమనానికి, విరోచనానికి అంతములేదు.

డాక్టరుగారిముఖములోగూడా కళలేదు. రాత్రికి రూప తెలివిదప్పి పడిపోయింది. నేనామెతలను యొడిలోఉంచుకుని కూర్చున్నాను. నాకళ్ళనుండి మాటిమాటికి అశ్రువులుధారగా ప్రవహించుచున్నవి. మాతల్లిగూడా ఏడుస్తూయుంది. పాపము హీంగూనిశ్శబ్దంగాకూర్చున్నాడు. మాతల్లి ఏడ్వటంజూచి "అమ్మగారూ! ఏడ్చినందువల్లలాభమేముంది? రూప తనఋణము,నాఋణము తీర్చివేసింది. నాకు కొంచెముగూడా దుఃఖములేదు. నాశరీరముగూడా బాబుగారికి అక్కరకువస్తే అదేసంతోషము."అన్నాడు.

ఈమాటచెప్పి వాడు వెళ్లిపొయ్యాడు. అమ్మగూడా పైకివెళ్ళిఏడుస్తూయుంది. కొంచెముసేపటికి రూప కన్నులు తెరచి "బాబుగారూ! నేను వెళ్ళుచున్నాను. నన్ను మరువవద్దు."అంది.

నాకళ్ళనుండి ఏకధారగానీళ్ళు ప్రవహించుచున్నవి. నేను అతికష్టముమీద "నారూపా!"అన్నాను. ఇంతకంటే అధికంగా చెప్పలేకపొయ్యాను. నాకు దుఃఖముపొంగిపొరలివస్తుంది. నాముఖమును ఆమెముఖముపై ఆనించి "నారూపా!"అన్నాను. రూప క్షీణస్వరముతో "నాబాబూ!"అని కన్నుమూసింది.

* * * *

ప్రపంచమంతయూ అంధకారబంధురమైంది. అదేస్థితిలో రూపామృతశరీరముపై చెయివైచి జీవన పర్యంతమూ అవివాహితుడుగా ఉండుటకునూ, అస్పృశ్యతానివారణకై నాశరీరమును అర్పణచేయుటకును శపథంచేశాను.

—అనువాదము.



జపానుసైన్యములు చైనాదేశమునందు తమ రయిల్వేను కాపాడుకొనుట

# శక్తి

శ్రీమతి నాశిరెడ్డి వెంకాయమ్మగారు

జననీ! ప్రకృతీ! నినుగూర్చి ముచ్చటింపఁ అసమర్థురాలను. కాని నాశరీరమందలి ప్రతి రక్తబిందువునందున్న శక్తిని ఐక్యముజేసి ప్రయత్నించిజూచెద. మొదట ప్రపంచమంతయు నీవనచాలు. నిన్ను వేదాంతులు మాయవనియు, ధీరులు శక్తివనియు, రాజ్యాంగవేత్తలు స్వాతంత్ర్యదేవతవనియు, కవులు ప్రేమవనియు, విద్యార్థికులు సరస్వతివనియు అనేకమంది యనేకనామములతో నిను వ్యవహరించుచుందురు. ఈవిషయమందు సత్యమెంతవఱకుండెనని అరసిజూడ ఈజగత్తంతయు నీవే. నీమహిమ, శక్తిద్వారానే జగత్తునడుపబడుచున్నది. నిన్ను లోవరకుపరీక్షించిజూడ నీహృదయము మహాసౌందర్యమైనది. ప్రేమయనుపుప్పొడితో తెల్లని మనోహరమైనకాంతిగా నద్దబడియున్నది. కడ్లకింపును మనసుకానందమునుగూర్చు మేఘములబోలిన మేటిపర్వతములు, చెలియచెంగునుబోలిన వనంబులు; అందలి ఫలపుష్ప లతలు, తళతళమెరయు రత్నములకాంతినిబోలి సూర్యకాంతితోఐక్యమై దూరపుకండ్లకిట్లు గన్పించు ఇసుకతోగూడినయెడారులు, సౌందర్యమంతయు నాదేనంచు విర్రవీగుచు ఎంత దూరంబుననున్న పైకెగయుతరంగములను; చెలియలతోగూడిన రాజకన్యఅనబడునదులు మొదలైనవన్నియు నీసౌందర్యాతిశయంబులే. సూర్యచంద్రనక్షత్రాదులందలి కదలుశక్తివి నీవేగదా తల్లీ! ప్రతిజీవి ఇచ్ఛాశక్తిని క్రియారూపంబున తేల్చునది నీశక్తేగదా! నీవనంతశక్తివి. అట్టిశక్తి ప్రతిమానవునియందున నిండి నిబిడీకృతంబై యున్నది. అట్టి నీశక్తినికనుగొన నందరి శక్యముకాదు. శక్తికిమించిపోవుకార్య మిలలేదు అనుసూత్రమునుఋజువుపరచ శివాజి, ప్రతాపుడు, గాంధి మొదలైనవారలే తార్కాణము. పైన పేర్కొనబడినవారలు సామాన్యులయ్యు, ఒంటరులయ్యు వారియందున్నశక్తిని విజృంభింపజేసి జయంబులందసాగిరి. నాకు చేతగాదను తలంపుగలబుద్ధికు హస్తములుండియు లేనట్లె. హరిశ్చంద్ర, నకుల రాజ్య[illegible] తృటి కాలంబునపోయి—పోవుటేగాక భార్యాపుత్రులగోల్పోయి—కాటితోటకా[illegible] జేసిన దెవ్వరు? కాలము. కాలము తనయందెంతవిచిత్రము నిముడ్చుకొన్నదో[illegible]వానిని భాగ్యపురుషునిగను, భాగ్య-నభాగ్యుని, రోగిని-నిరోగిగను, నిరోగిని-రోగిగను మార్చగల శక్తిని ప్రకృతిగల్గియున్నది. చరిత్రలచదివిన రాజులపరిస్థితులు క్షణమునకొకవిధముగమార్చిన కాలవిచిత్రమును గాంచగల్గుదుము. హరిశ్చంద్రుడు సత్యమును, ప్రహ్లాదుడు భక్తిని, బుద్ధుడు అహింస మొదలైనధర్మసూత్రములను జగమునస్థాపించ ప్రథమమున మహాకష్టములబడియుండిరి. ఒకసూత్రము భువి క్షీణించుచున్నపుడు తిరిగి యద్దానినిస్థాపించ ఒకయాత్మ శరీరమునుదాల్చును. బుద్ధుడుస్థాపించిన సత్యాగ్రహము, అహింసయు క్షీణించుచు రాగా నద్దానిని తిరిగిబలపరుప గాంధిమహాత్ముడుదయించెను. మహాకష్టములమధ్య హిమవత్పర్వతమును బోలె సర్వయాపదల పూలచెండ్లగాతాకుచు సహించుచు పైసూత్రములందలి శక్తిని ప్రజల

హృదయకాలప్రవాహమునందుకల్పి ప్రజలపై గాదొర్లించుచున్నాడు. మితవాదు లతి వాదులు కాసాగిరి. ఈమార్పునంతయుకల్గించుచున్నది ఆశక్తియే.

శక్తిచేతనే ఇప్పుడు స్త్రీలయొక్క రాజ్యంబును, విద్య, బ్రహ్మచర్యము, శరీరబలము, వివాహములు మొదలైనసూత్రములను నిర్మించవలసియున్నది. రామలక్ష్మణులు వనవాస మందు కటికశయ్యపై పరుండ గుహుడు మెత్తనిశయ్యలపై బరుండ నిర్బంధించె; కాని— కాలానుగుణ్యముగ మానవుడు నడవవలెనని లక్ష్మణుడుబోధించ సమ్మతుడాయెను. ఫ్రాన్సు-అమెరికా-ఇంగ్లండు మొదలైనదేశములందలి స్త్రీలు సర్వస్వాతంత్ర్యములపొంది ఆర్థికముగ విద్యయందు అగ్రస్థానమునుదాల్చియుండ-మనహిందూదేశమిప్పుడాపూర్వచారములేగావలె నన్నచో-నవ్వని నవనాగరీకుండుండునే? పూర్వమున సతులు పతులతో అగ్నికాహుతులగు చుండిరి. ఇపు డది భరింతురా?

సర్వప్రపంచమును కదిలించి నడిపింపగలశక్తివి, మానవునికార్యముల నెంతలో నెర వేర్చగలవు? ఇంతయు లోకచిత్రము. అదియెద్దియన చేయుకార్యమందు న్యాయము, సత్యము, ధర్మము లేకున్న శక్తినిరుపయోగము. నెపోలియనుకు రాజ్యకాంక్షయుంటచే తనకుతానే నశించెను. అలెగ్జాండరు కీర్తికాముడౌటచే శక్తిఘాటికే బలియాయెను. చంద్రమతి, దమ యంతులందు పతివ్రతాబలంబుంటచేతనే వారిపతులు కష్టములనుఅనివార్యముగాదాటి తిరిగి రాజ్యములపొందగల్గిరి. సావిత్రి యుదాహరణమొకటి తీసికొందము. ఆమె పతివ్రతాబల మునుకొలువ ఎవరితరము? శక్తి కింకొకయర్థము ఈకార్యము నెరవేరగలదను మూఢనమ్మ కము. అట్టిమూఢనమ్మకమే మహాశక్తి. సావిత్రికోర్కె పవిత్రమైనది. మూఢమైనదికను కనే యమునివంటివాడునైతము లొంగవలసినవాడాయెను.

కష్టములెప్పుడే నొకచోటుండబోవు. సౌఖ్యము లొకచోటుండబోవు. రెండు మిశ్రమములై జీవులజీవితరాజ్యములందు సంచారముచేయుచుండును. మొదటిసౌఖ్యము చివరకు కష్టనష్టములపాలుజేయును. ప్రథమమున కష్టముజెందినతరువాత సౌఖ్యరాజధానికి రాజగును. ఏదేశమేని ప్రథమమున కష్టములజెందనిదే స్వాతంత్ర్యమునుబొందలేదు. కష్ట ములులేనిస్వాతంత్ర్యము క్షణభంగురము. జయదేవియొక్క వేడిని భరించునాలేదాయని పరీక్షించునిమిత్తంబు శక్తి మొదట ఆపదల కుప్పలుకుప్పలుగదొర్లించును. ఇట్టికష్టముల జీవిగాని దేశంబుగాని భరించినవెనుక జయదేవి వారిని కౌగలించును. మానవుని జీవ యాత్రకుగాను-యౌవనమందు మానవుడు బ్రహ్మచర్యముచే మన్నశరీరబలములవృద్ధి చేకొనుచు-విద్యయనుశక్తిని ఆగారమున పూరించుకొనుచు-శక్తిని పూర్తిగపూరించుకొన్న తరువాయి జీవితయాత్ర సులభముగ సౌఖ్యముగ స్వేచ్ఛగ సాగగలదు. ఇది పురుషుని ధర్మము. పురుషునకు స్త్రీ మంత్రియన నతిశయోక్తికాదు. రాజుకంటెను మంత్రికి విద్య ఎక్కువగానుండవలయును. విద్యగలచోట శక్తికి ప్రభావముగలదు.

# సానుభూతి

కందుకూరి రామభద్రరావుగారు

పాపము! బాల్యమందె యెడబాసితి భర్తసుఖంబు బాల! సం
తాపవిదగ్ధమానసవెతన్ (?) గృశియించు గ్రమక్రమంబుగా
నేపుదొలంగి దేహలత యేపగిదిన్ భరియింతు వింటికిన్
గాపరివై పరుల్ తృణముగానిరసించు మహోగ్రబాధలన్.

అంచెలుదాటె మోవిరుచి, ఆననమల్లదె తెల్లబాఱె, క్రొ
మ్మించుగ్రమించుచూడ్కి విరమించెను తొల్లిటిబెళ్కు, చెక్కులన్
దించుకపోయెసౌష్టవము, తీవ్రతరోగ్రనిడూర్పువేడిమిన్ (?)
గాంచనవర్ణదేహము వికాసము దప్పిచలించె బాలికా!

కనులస్రవించు నశ్రువులకాల్వకున్ దుదియున్నదే? నిశీ
థిని వెలిబుచ్చునూర్పు లవధిన్గనునే? ఒకలిప్తయైన నీ
యనుదినతప్తచిత్తహృదయంబులు గాంచునెశాంతి? రిక్తజీ
వనభరమున్వహించి శతవర్షము లెట్టులిటుల్ గ్రసింతువో!

పతిప్రేమామృతపాత్రబోరగిల సంప్రాప్తించె దుఃఖాగ్నిపూ
రితహాలాహలపాత్ర చేతి కకటా! రేలుంబవల్ ద్రావ జీ
వితసౌభాగ్యవిలాససంతతులు స్తంభీభూతమైజారె నీ
గతిజూడన్ హృదయంబునీరయి తొలంకంజొచ్చె నేత్రద్వయిన్.

బంగరువంటికాపురము పాడయిపోయికృశించి, శల్యమై
అంగసలాడిపోయగ గృహాంతరసీమ వసింపనీక నిన్
భృంగవినీలకుంతలవిహీనగజేయగ బోటుమాట లా
డంగ శిలామయాత్ము లకటా! యెటుప్రొద్దులు వెళ్లబుచ్చెదో!

దైన్యము రూపుగాంచినవిధంబున దోచుభవచ్చరిత్ర సా
మాన్యహృదంతరాళమును మంచుకపోవగ ధర్మమూర్తులే
మాన్యపథంబునైనగని మాన్పక నీవెత గూరచిత్తులై
హైన్యముగాగణించి యుపహాసమొనర్తురికేమి సెప్పుదున్.

చివికినధర్మశాస్త్రశిలజేరిచి శీలలుగొట్టి నిన్నుచి
త్రవధకుబాలొనర్చి పరితాపముజెందక ఛాందసాగ్రణుల్
ప్రవిమలమార్గమందురు లవంబును లేవొ త్రపాభిమానముల్!
ఎవరెటు లేమొనర్చిన సహింతు చలింపక బాలికామణీ!

సంతతదుఃఖభారకథ జాలివినంగ హృదబ్జమందు ర
వ్వంతకృపారసంబుగనునంతటిభాగ్యము, దేహమంత శా
కుంతము[బోవ కండలుగ గోసిన భారతభూతలాన నే
[ప్రాంతముబట్టిపోయెనో? పరాకునసైన దలంప రీవెతన్.

చ( [illegible] ఎ)

బోడ్డు బాపిరాజుగారు

మా[illegible]్యానవాటి చంపకమొకండు
పోష[illegible]క కషుకృశీభూతయగుచు
దారిజను[illegible]రి పాదపద్మములనంటి
దేవులాడెడు కృపజూపి గావుడనుచు.
ఎన్నియోసారు లాత్రోవనేగినాను
దానిమొర మున్ను వీనులం దరియలేదు
కాని నేడేమొ నామది కనికరంబు
పొడమె నాచిన్నమొలకకు [ప్రోదిసేయ.
స్వయముగా నేనె జలకలశంబుబూని
యంబువులదెచ్చి సంధ్యాద్వయంబునందు
[ప్రవాదమేపారపోసి గాపాడువాడ
కడుపునంగన్నబిడ్డని కంటెమిగుల.
కలుపువట్టినతీయుచు బలముగలుగ
నెరువులందెచ్చివేసి పోషించుచుంట
నంతయంతనబెద్దదై సంతసమ్ము
నింపెనామది; కడునిగారింపుగలిగి.
ఎంతపనిపాటులున్న సాయంతనముల
నచటికరుదెంచికూర్చుండు టనుదినంబు
తప్పదయ్యెను; నన్గాంచితలిరు[వేళ్ల
జేరజీరు నాచంపాకుమారికూడ.
అది విధివిధానమానేమొ యహరహంబు
దానియందుననే మది దగిలియుండు
అదియు నన్జూచినంత సమ్మదమునెందు
పగిదినూహించుచుండు నాభావమందు.
వసుధ మానవజాతి కవ్యక్తమైన
భాష నాచంపయుబుసుల పలుకుచుండు
గాలికెరటాలలోబడి గలసిపోవ
నట్టె విసువక నేను నూకొట్టుచుండు.
కనిన[పేమకంటె నిలపెంచినమమతయె
యెక్కుడనుపండితోక్తులు నిక్కువమ్ము
లటులకాదేని నాకేటికంత[పేమ
దగిలియుండును నాచిన్నితరువుపైన?
ఏమిసెప్పుదు? నోరాడదింకపైన
మొగ్గదొడుగగాదగు కాలమునను దాని
కెంతగతిసంభవించె! నింకెంతసేపు
వగచినను నేమిలాభంబు వడయగలను?
పనిగలిగినేను పొరుగూరుజనగనచట
పదిదినములుండనయ్యెను పాడుపురుగు
వేరునంజేరిపీడింప వారమునకె
ఎండివరుగయి [మోడుగానుండెనకట!
ఎలమినారామమున సంచరించునపుడు
చెరిగిపోయినగాధ నాస్మృతికిదోప
మనసు కరుణామయమ్ముగా గనులకొనల
దోచుచుండును బాష్పబిందువులునేడు.

# రష్యా: స్త్రీ

వడ్లమూడి వేంకటరత్నముగారు

స్త్రీలోకమున కున్నతి లేనిది తనకున్నతి లేదని లోక మిప్పుడు లెస్సగ గ్రహించినది. కనుకనే ప్రతిదేశమును యథాశక్తిని స్త్రీని సంస్కరింపఁ బ్రయత్నించుచున్నది. భారతకాంత లధోగతియందు మ్రగ్గుచున్నారని వాక్రుచ్చుచుండు పాశ్చాత్యకాంతలకును నిజమగు స్వాతంత్ర్యములేదు. వారికున్న స్వాతంత్ర్యము భోగమునందును, విలాసమునందునుమాత్రమే. సాంఘికములందును, ఆర్థికములందును, రాజనైతికములందును వారింకను వెనుకఁబడియేయున్నారు. వారికిఁ గావలసినదెల్ల బిగిసడలని సోయగపుజిగి. తమలావణ్యమునకుఁ బరులు మోఁకరించినఁ జాలును. తమ ధాళధళ్యమునకు నివాళులెత్తినఁ జాలును. కాని రాజ్యాంగసంస్కరణమునందు వలెనే రమణీయసంఘసంస్కరణమునందును రాఁచబాటవైచినది రష్యాదేశము.

ఇపుడచటికాంతలు పరులకులోఁగి తమహృదయములను జంపుకొనరు. తామితరులకు భారరూపముగాఁ బడియుండరు. తమకుఁ గావలసినవాని నితరులను దేవురింపక తామ యొనరించుకొందురు. తమబాగోగులను దామ చూచుకొందురు. తమయున్నతికిఁ దామ యత్నించుకొందురు. ఈపరివర్తనారంభమున 'రష్యాయందలి కాంతలు సర్వస్వతంత్రలు. వారు దేశపుసొత్తు' అనికొందరు హాహాహూళిచేసినారుకాని యిది సత్యదూరము. స్వాతంత్ర్యమునకుఁ బాటుపడుచున్న భారతరమణీమణులు వారిస్థితిగతులను దెలిసికొనుట యనావశ్యకముగాదు. రష్యారమణులప్రస్తుతస్థితులు వివరించుటకుముందుగ పూర్వపువిషయములనుకొంత తొలుత నుదాహరింతుము.

1916-వ సంవత్సరమునజరిగిన విప్లవమునకుఁబూర్వము పరిపాలనాబంధములు స్త్రీపురుషులకుఁ దుల్యములే. అందుఁ బక్షపాతములేదు గాని సాంఘికములగు నిక్కట్టులుమాత్రము స్త్రీలకుఁ బెక్కులుగలవు. స్త్రీలును పురుషులవలెనే మానవులేయని వారికిఁ దెలియదు. స్త్రీలు భోగవస్తువులు. దాస్యపరికరములు. పరిశ్రమల కుపకరించుకొలుముట్లు. స్త్రీలయుపయోగమింతియే. కాదుకాదు; మఱియొక్క లాభమున్నది. వారిని విక్రయించి ధనమును సంపాదించుకొనుచుండెడివారు. ముఖ్యముగ 'యాకుటస్కు' ప్రాంతములందీబేరములు మిక్కుటము.

వివాహములందుఁ గన్యలయిష్టమునకుఁ దావులేదు. ఎవరెక్కువధనమునొసఁగుదురో వారిసొత్తగును గన్య. కన్యాశుల్కము లపరిమితము. (మనదేశముననో?) ఇవియే వివాహమునకు మూలమంత్రములు. ఈవివాహములయందు నియంత యొకపాదిరీ. పెండ్లాడినవెన్క నామె యెట్లుసంచరింపవలయునో యాతఁడు నిర్ణయించును. ఆయాజ్ఞామాలికలనామె శిరసావహింపవలయును. భర్తవెంట నేగవలయును. ఏకాంతమైనఁ దన భర్తనువిడిచి తొలఁగియుండెనేని రక్షకభటులసాయముననైన నామెను లోఁబఱచుకొనును. కాదేని యామెను కారాగారముననైనఁ బడవేయించును. వివాహవిచ్ఛేదమున కవకాశములుగలవు కాని యవి చర్చిలయిష్టము. పాదిరీలొప్పుకొననిచో విచ్ఛేదమొప్పదలకాదు. న్యాయస్థానములకేగి యాసంబంధమును మానుకొనఁదలంచినచో ప్లీడరు లపరిమితముగ ఫీజునడుగుదురు. సామాన్యధనపతులు దానినిభరించుట యసంభవము. కాఁగా విచ్ఛేదము నామమాత్రము, గగనకుసుమము.

స్త్రీ యెచటనేని కూలినాలిజేసికొనఁదలఁచినను నామెయిష్టము ప్రధానముగాదు. ఆమెమగఁడందుల కొప్పికొన్నచో నామెకుఁ గూలిలభించును. మఱియొకప్రదేశమునకు వెళ్లిపోవలయుననుకొన్నను బ్రయోజనము సున్నయే. పతియనుమతిలేనిచో నామెకు ప్యాసుపోర్టుచిక్కదు. ప్రతివిషయమునందును మగని కెడముగనున్న స్త్రీకి గతిలేదు. పురుషులన్నఁ బక్షపాతము. ఇట్టివిషయములందవకాశము స్త్రీలకుఁగలిగించుట తమకు మానహానిగఁ బురుషులు భావించువారు.

కొమరితలకు జనకుని యాస్తిలో పదునాలుగవపాలిచ్చి మిగిలినదానినెల్లఁ గొమరులకే యిచ్చుచుందురు. (మనమో?) ఆభాగమయినను వివాహానంతరము మామెభర్తకుఁ జెందవలసినదే. స్త్రీకి సొంతయాస్తియుండ రాదు. కాని వంటచేయుటలోను, పశువులను మేపుచుండుటలోను, నీరుదెచ్చుటలోను, గుడ్డలుదుకుటలోను వారి కెక్కువయవకాశములొసఁగఁబడినవి. పొలపుపనులును నామె చేసికొనవచ్చును. కర్మకాండమంతయు నెంతయెక్కువగనైనఁ గాంత చేసికొననగును. కాని విశ్రాంతికిమాత్ర మవకాశముండరాదు. సుఖమునకుఁ దావులేదు. అదియొకయంత్రము. కనుకనే యారోగ్యము పూజ్యము. సామాన్యముగ రోగపీడితలుకానివారు లేరు. మరణములు పురుషులకంటె నినుమడి.

ఇఁక పట్టణములందలికాంతలు:—వారునివసించుటకు వసతిగల మంచియిండ్లులేవు. మగవారి దౌర్జన్యములు అమానుషములు. స్త్రీలు చాలతక్కువకూలికి బాలురతోఁబాటు పురుషులకంటె నెక్కువకాలము పని చేయవలసియుండును. చూలాలైయున్నను దాదాపుగా ప్రసవకాలమువఱకును, ప్రసవానంతరము అతిశీఘ్రముననుపనిలోని కేగవలసియుండును. ఇందువలన సహజసుకుమారకోమలలు-మధురమూర్తులు-సౌందర్యదేవతలు నగు రమణీమణులు-అకాలవార్ధకగ్రస్తలు-శిలాకర్కశలు-వికారరూపలుగా మాఱిపోవువారు.

పెక్కురకు పడుపుఁదనముగూడ నవలంబింపవలసివచ్చెడిది. అందుల కవకాశములు-ప్రోత్సాహములు నధికము. రహస్యజన్ములగు శిశుసముదాయముచే బావులు, చెఱువులు, అనాథాలయములు నిండిపోవుచుండెడివి. పట్టణములయందు నవయువకులకు (Little Candle Clubs) కొన్నిసంఘములుండెడివి. అవి నవయువతీరత్నముల యభిమానదీప్తికి ప్రబలవిరోధములు. ఈరహస్యక్రీడలవలన నష్టము: యువకులకు ధనము, స్త్రీలకు గృహపరిత్యాగము. అతఁ డెంతదుర్మార్గుఁడయినను ఆకన్య యతనికేయిచ్చి యంటఁగట్టఁబడుచుండును.

దీనికంతకుఁగారణము స్త్రీలవిద్యావిహీనతయనుటలో నాశ్చర్యములేదు. స్త్రీలకు విద్య శూన్యము. మొత్తముమీఁద స్త్రీలకుఁగొన్ని ప్రత్యేకపాఠశాలలుగలవుగాని యందలి చదువు వారిజీవనవ్యాపారములకు సంబంధించినదిగాదు. అదియొకవిలాసము. కేవలము పుస్తకకీటకముగ దయారగును. అదియు ధనవంతులు, జమీందారులకేగాని సామాన్యులకందనిపండు. స్త్రీ చదివి యేయుద్యోగమునకో ప్రయత్నించుట మహాసాహస కార్యము. కాని యాకాలముననుయథార్థజ్ఞానశోభితలయి యథోచితస్వాతంత్ర్యభాసాలంకృతలగు స్త్రీరత్నములుగలకుటుంబములు కొలఁదిగనైన లేకపోలేదు.

ఇంతదనుక రష్యాకాంతల పూర్వస్వరూపముకొలఁదిగ సూచింపఁబడినది. ఇఁక ప్రస్తుతమునకువత్తము.

1916 న విప్లవముజరిగినది. రాజ్యనియమములు తారుమారయినవి. ధర్మశాస్త్రములు గంగపాలయినవి. ఎల్లరును స్వతంత్రతామందిరమున నుపాసనాపరాణులయినారు. పంజరమునుండివిడివడిన విహంగములవోలె రాజకీయములు, సాంఘికములు మున్నగు నన్నివిషయములందును పురుషులతోఁబాటు పొలఁతుకలుగూడ కృషిచేయనారంభించిరి. విద్యాప్రచారమున కేర్పాటులుచేసిరి. గ్రంథాలయములు, పఠనాలయములు, పాఠశాలలు మున్నగువానిని కావలసినన్నియేర్పఱచిరి. అంతవఱకుఁ బయనముసేయుచున్న కామినీముఖము వేఱుదిక్కునకుఁదిరిగినది. వారియాదర్శము మాఱినది. ఈభావ మొక్కపట్టణకాంతలయందేగాదు; పల్లెటూరి పడఁతుకలును నూతనసందేశమునుగ్రహించి విజృంభింపనారంభించిరి. ఏతత్ప్రచారఫలితముగనే 1926 న జరిగిన యెన్నికలయందు పౌరనారీమణులు నూటిలో నేఁబదియొక్కరును, గ్రామకాంతలు ముప్పదుగురును శ్రద్ధవుచ్చుకొనిరి.

అచటిస్త్రీలు అంగడులయందును, ఆఫీసులయందును ముఖ్యులుగనుండి పనులునెఱవేర్చుచున్నారు. వారు శాసనసంబంధకార్యములయందు ప్రవేశింపవలయునని యెంత ప్రయత్నించుచున్నారో చూచిన నాశ్చర్య

మొదవుచుండును. విశ్రాంతిని, సుఖమును, శాంతిని ఒసగుచుండుననిభావింపఁబడు గృహనిర్వహణకార్యములకుఁ దిరునామమునెట్టి సాహసము, ధైర్యము మున్నగు గుణములసాయమున న్యాయాధికారప్రాప్తికై వారు చేయుప్రయత్నములు ముక్కుపై వ్రేలిడఁదగినవి. పైరివేటుసంస్థలును, ప్రభుత్వమువారును విద్యాప్రచారమున కాలోచింపనిపద్ధతిగానీ యాచరింపనిమార్గముగానీ లేదనిచెప్పవచ్చును. వారిప్పుడు శాసనసభలలోఁ బ్రవేశింపఁ బ్రయత్నించుచు నిప్పుడిప్పుడు సాఫల్యమునొందుచున్నారు.

విప్లవమువలన రష్యాదేశమునందలి స్త్రీలెల్లరును పరివర్తనమొందినారనిమాత్ర మెవ్వరును భావింపఁ గూడదు. పూర్వకాలపుటాలోచనల నేస్మరించుచు నిప్పటిస్వేచ్ఛ దురాచారమనిభావించు నించుబోడులును గొందఱుగలరు. కాని వారిసంఖ్యకొలఁది. కొంద ఱిట్లున్నను ధైర్యముతో-సాహసముతో-కష్టసహనముతో-పూనికతోఁ బ్రయత్నించువారు పెక్కురున్నారు. వారు కేవలము తమజీవికను సంపాదించుకొనుట-తమకుటుంబమును పోషించుకొనుటతోఁ దృప్తినొందక యన్నిశాఖలయందును పురుషులతో సమానముగనుండవలయుననియుఁ బురుషులకంటె నేవిషయమునందును వెనుకఁబడియుండరాదనియు వారియాశయము. తమ్ము లోఁబఱచుకొనుటకు ఎంతబలము తమకు వ్యతిరేకముగఁ బ్రయత్నించుచున్నను తాము దానికిలొంగక తమస్వాతంత్ర్యమును గాపాడుకొనుశక్తి వారికిఁగలదు. వారి సజీవతయు, జాగరూకతయు పరదేశస్త్రీలకు అసూయామూలము అయినది.

అచట స్త్రీలలో జ్ఞానప్రచారమునకు పత్రిక లొకముఖ్యసాధనము. అవి మనోహరముగ-చక్కని చిత్రములచే వన్నెమీఱి యింపుగను శుభ్రముగనుండును. స్త్రీలెల్లరును వానిని చదువదగునని వారితలంపు. బీదలు కొనిచదువలేరనుభావముతో భాగ్యవతులు వానినిగొని బీదవారికి చదువనిచ్చుచుందురు. ఇట్లా స్త్రీలు మంచి జ్ఞానమును, నాగరకతను, సదాచారములను అలవఱచుకొని తమసంఘమున కలంకారప్రాయములుగనున్నారు. ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మనీ మున్నగుదేశకాంతలకంటె పైగుణములలో నీదేశపుస్త్రీలు మిన్నలుగనున్నారని పెక్కురవిద్వాంసులయభిప్రాయము. ఆస్త్రీలు తమకిచ్చినస్వాతంత్ర్యమును దుర్వినియోగపఱతురేమోయని మొదట ననేకులు సంశయించినారుగాని యందుల కేమాత్ర మవకాశమునులభియింపలేదు. సామాన్యముగ పాశ్చాత్యకాంతలవలె వారియొద్దఁ గపటములేదు. రష్యాదేశపుసినీమాలయందు వివస్త్రలయు, నర్ధవస్త్రలయు చిత్రములులేకపోలేదు. అచటి నాటకరంగమున వివస్త్రలను, నర్ధవస్త్రలను జూడకపోము. అయినను కొన్ని పాశ్చాత్యదేశములలోకంటె గంభీరతయు, నాగరికతయు, శీలమును సామాన్యముగ నిచట నెక్కువగఁగల వనుట నిశ్చయము.

పల్లెటూరిస్త్రీలును ఇపుడు సార్వజనికజీవనమును నెఱపఁగలుగుచున్నారు. తాముసొంతముగ వ్యవసాయము నేయుచు, చేయించుచునున్న స్త్రీలు పదిలక్షలకంటె నధికముగనున్నారు. వారివిజ్ఞానముచేతను, కార్యకుశలతచేతను అన్నియధికారశాఖలయందును బ్రవేశించుచున్నారు. 1926-వ సంవత్సరముననే సోవియటు గ్రామసంఘములయందు లక్షకంటెనెక్కుడుగ స్త్రీప్రతినిధులున్నారు. ఈసంఖ్య క్రమముగ వృద్ధియగుచునే యున్నది. 1926 లోజరిగిన 'సోవియటుయూనియన్ కాంగ్రెసు'లో రెండుప్రజాతంత్రములనుండియు 169 గురు రైతుస్త్రీప్రతినిధులు సంబంధముగలిగించుకొనియుండఁగా 1927 లో ఒక్కసైబీరియాలోనే 8000 మంది స్త్రీలు గ్రామసోవియటుసంఘములలో సభ్యత్వమును సంపాదింపగల్గిరి. 47 గురుస్త్రీలు వానిలో నధ్యక్షపదవులనుగూడ నాక్రమించుకొనిరి. ఇట్లే యన్నిశాఖలును స్త్రీపరిచయముచే మనోహరములగుచున్నవి. ఒకసహకార సంఘములయందే యైదులక్షలకంటె నెక్కుడుస్త్రీలు సభ్యులుగానున్నారు. పల్లెటూరియబలలును విద్యావతులై క్రమక్రమముగా న్యాయాధికారపదవుల నొందుచున్నారు.

పౌరకాంతలస్థితిగతు లింతకంటె మేలుగనున్నవి. చదువుసంఘ్యలకును, ఆరోగ్యరక్షణమునకును, శిశుపాలనాదికమునకును చక్కనియవకాశముల నేర్పఱచినారు. కూలిపనిచేయుకోమలులును పురుషులతోఁబాటు జిల్లాసోవియటుసంఘములకును, రాష్ట్రసోవియటుసంఘములకును సభ్యులనెన్నికొందురు. వారు 'యూనియన్ కాంగ్రెసు ఆఫ్ సోవియట్' (ప్రధానశాసనసభ)కుఁగూడఁ బోవుదురు. రాజకీయవిషయములయందేకాక పారిశ్రామికములందుఁగూడ నుచితావకాశములుగలవు.

పూర్వము యంత్రాలయములలో పదునాలుగుగంటలకుఁదక్కువకానికాలము పనిచేయుచుండువారు స్త్రీలు. నేఁడో ఏడెనిమిదిగంటలుపనిచేసియే యంతవేతనము నొందుచుందురు. పూర్వము అమితపరిశ్రమచే-యజమానులయత్యాచారములచే జరుగనిపని నేఁటి స్వతంత్రతాపూర్వకమగు యల్పకాలపరిశ్రమచే జరుగుచున్నది. నేఁటిపనియం దుత్సాహముగలదు. తమకృషి యజమానులకును, తన్మూలమునఁ దమకును లాభదాయకమగునను విశ్వాసముగలదు. కనుక నే పని యెక్కుడుగనగుచుండును. కార్యకారి యుత్సాహముగాని బలవంతముగాదుగదా!

యంత్రాలయపుకూలీలు పరిశ్రమచేయుచు సుఖమును శాంతిని బొందుటకుఁదగు నేర్పాటులు, గ్రంథాలయములు, పఠనాలయములు, వ్యాయామశాలలు, శిశుశాలలు, వర్తకపాఠశాలలు, వైద్యాలయములు మున్నగున వెన్నియో యంత్రాలయమునఁగాని, చుట్టుప్రక్కలఁగాని యేర్పఱతురు. సరకారువారియంత్రాలయములందు స్త్రీలకుసంబంధించిన ప్రత్యేకశాసనములు గొన్నికలవు. వానిని మీఱకుండునట్లు జాగరూకతతో గమనించువారు కొందఱుందురు.

ఆనియమములనుగొన్నిటిని మచ్చునకిటఁజూపెదము. గర్భవతులచేత నియమితకాలము ఏడుగంటలకంటె నేమాత్రమును ఎక్కువగఁబనిచేయింపరాదు. కొన్నిప్రత్యేకపరిస్థితులలోఁ దక్కగనులలో పనియేదియు వారిచే చేయింపరాదు. ఆరోగ్యభంగకరములగు నేపనులను వారికొప్పింపరాదు. గర్భవతులకు-కాయకష్టము చేయువారయిన ప్రసవమునకుముందు రెండుమాసములును, వెనుక రెండుమాసములును; మనఃకష్టముచేయువారికి ముందాఱువారములును, వెనుక నాఱువారములును వేతనముసఁగుచు విశ్రాంతియీయవలయును. ఇంతియకాదు. శిశువునకు 9 మాసములువచ్చువఱకు నతనిపోషణమునకదనముగ ప్రతిమాసమునకుఁగొంత 9 (రూబిలులు) సొమ్మీయవలయును. ఆకాలమునఁ బనిచేయునపుడు మూఁడుగంటలకొకమాఱు తనబిడ్డనుజూచివచ్చుటకు-పాలిచ్చుటకు వారికిఁ గొంతయవకాశ మొసఁగవలయును. యంత్రాలయములకుజేరి విశ్రాంతిగృహములును ఉండును. సామాన్యముగ రోగగ్రస్తలగుస్త్రీలు పగలు పనిచేయుచున్నను రాత్రులయందందే నివసించుచు సంపూర్ణారోగ్యవతులైనవెనుక తమనిలయములకేగుదురు.

మఱియు వీనితోఁజేరి 'ట్రేడుస్కూలు' ఒకటియుండును. ఇందు అచట పనిచేయుబాలికలు 13, 14 ఏండ్లవయస్సుగలవారు చదువుచుందురు. అట్టిబాలికలనుగూడ ప్రతియంత్రాలయము చేర్చుకొనవలయును. వారచట ప్రతిదినము 4 గంటలకాలము వ్యాపారవ్యవసాయవిషయికసిద్ధాంతముల నేర్చుకొనుచు, నాలుగుగంటలుపనిచేయుచు ననుభవజ్ఞానమును వృద్ధిపఱచుకొందురు. ఈపాఠశాలలు ప్రాథమికశిక్షణమయినబాలికలకే యుపకరించును. ఇందు 2, 3, 4 ఏండ్లపరిమితులుగ విద్యావిధానములుండును. కన్యలు వారియిష్టము వచ్చిన విషయములనభ్యసించి యుత్తీర్ణలయి యాయంత్రాలయములయందే తమసమర్థతను వినియోగపఱచుచుందురు.

వీనితోఁబాటు మఱియొకగదియుండును. అందు పటములు మున్నగువానిసాయమున సామాన్యముగఁ గలుగు నంటువ్యాధులనుగూర్చియు వానికష్టములనుగూర్చియు విపులముగబోధించుచు వారు పెడత్రోవఁబడ

కుండ మేల్కొలుపుచుందురు. ఇట్లచ్చట కూలీలు నియమితసమయములయం దీయెల్లప్రయోజనములుపొందుట కవకాశములుండును.

స్త్రీలు వివిధశాఖలలో పనిచేయుచున్నటులనే వివిధసంఘములలో (Clubs) గూడ కృషిచేయుచున్నారు. 1927-వ నాటి పరిగణనమునుబట్టి నూటిలో నెందఱుస్త్రీలు ఏయేసంఘములలోఁగలరో యొకింత చూపుదుము. సాహిత్యకసంఘములలో 42 స్త్రీలు, నాట్యసంఘములలో 39 మంది, సామాన్యవిద్యాప్రచారసంఘములో 36 గురు, వ్యాయామసంఘములో 31 రు, 'మార్కు' నీతిప్రచారకసంఘమున 28 మంది, 'లెనిను' మతప్రచారకసంఘములో 28 మంది, ట్రేడుయూనియనులో 27 గురు, మతవ్యతిరేకసంఘమున 24 గురు స్త్రీలు గలరు. వీనియన్నింటియందును పురుషులుగూడ సభ్యులుగనుండవచ్చును. ఇట్లే మఱియితరసంఘములు పెక్కిటియందును స్త్రీలు స్వతంత్రముగ విచక్షణపూర్వకముగ సభ్యురాండ్రయి కృషిచేయుచుందురు. క్లబ్బుదగ్గరకు వెళ్ళని కామినులకొఱకు పుస్తకములునున్నగునవి వారిగృహమునకేపంపి ప్రోత్సహించుచుందురు. నూతనభావములను ప్రబోధమొనరింతురు. ఇందులకు యంత్రాలయపుకూలీలు ఎక్కువగనుపయోగింతురు. ఇట్లు యంత్రాలయములు కేవలయంత్రాలయములుగాక జ్ఞానప్రచారమునకును కేంద్రములగుచున్నవి. పూర్వమువలె వారు యంత్రాలయములందు నిరంతరపరిశ్రమచేయకయే జీవనమును నిర్వహింపఁగలరు. తమకృషివలనఁగలిగిన లాభమునందుఁ దమకుఁగూడపాలుండుటచే వారుత్సాహముగఁ బనిసేయుచుందురు. శిశువులనుగూర్చి స్త్రీలుగానీ, స్త్రీలనుగూర్చి పురుషులుగానీ యేమియు శ్రమపడనక్కఱయుండదు. వారికిసంబంధించిన ప్రతివిషయమునందును (Labour Code)శాసనములుగలవు.

పూర్వపురష్యాయందు 'పనికొలఁదిజీతము' (Equal Pay for Equal Labour) అను సిద్ధాంతముగలదుగాని యది యాచరణమునందుమాత్రము శూన్యము. పురుషులకంటె స్త్రీలకు కూలితక్కువ. పురుషులతో సమానముగ స్త్రీలు పనిచేయఁజాలరని వారివిశ్వాసము. అందువలన ఎక్కువకాలముపనిచేయుచున్నను ఫలము తక్కువగానుండెడిది. స్త్రీలతోసమానముగ కూలిపుచ్చుకొనుటకు పురుషు లంగీకరింపనందున వారికెక్కువకూలి యీయవలసివచ్చుచుండునది. కాని యిప్పుడు స్త్రీలు పురుషులకంటె పనిలో నేమాత్రమునుతగ్గమని కార్యరూపమునఁ జూపుచున్నారు. కనుక పురుషులతోసమానముగ స్త్రీలకును కూలినిచ్చునటుల నిప్పుడు స్త్రీలసంఘములును-రాజశాసనములును ప్రయత్నించుచుండుటచే నిది యిప్పుడు ఫలోన్ముఖముగనున్నది.

## శ్మశానము

శ్రీమతి పి. అప్పలనరసమ్మగారు

నాగృహంబు నాయిల్లాలు నాసుతుండు
నాధనంబను వెఱ్ఱు లేనాటికైన
సర్వమునుబాసి హా! ఈశ్మశానభూమి
లోన లీనమైపోవుట గాన రేమి?
పండితులమని ధీబలవంతులమని
పాలకులమని సర్వసంపన్నులమని
కన్నుగానకనున్న వెకలిజనంబు
లెందరిట మాయమైపోయి రెవ్వడెఱుగు?
విపులభోగంబులున్న భూవిభుడైన

భిక్షమెత్తిజీవించు నిర్వేదయైన
సకలశాస్త్రంబులెఱుగు దోషజ్ఞుడైన
అక్షరమెఱుంగనట్టి మూఢాత్ముడైన
ఇట సమానంబెపో నిక్క మీవిధంబు.
హర్మ్యములుకావు సంపద లసలెకావు
బందుగులుకారు ఘనప్రభుత్వమ్ముకాదు
యెద్దియుసుకాదు నెమ్మదినెంచిచూడ
జనుల కీశ్మశానంబెగా శాశ్వతంబు.

## స్త్రీల భీమా

శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు

భీమాఅనేపదమునకు ఇంగ్లీషుభాషలో ఇన్సూరెన్సు అనియందురు. ఆపదలో నున్న కుటుంబములకు ఆపత్తులేనివారందరుకలిసి సహాయముచేయుటయే భీమావ్యాపారముయొక్క ముఖ్యోద్దేశ్యమై యొప్పారుచున్నది. ఒక ఉదాహరణము: పల్లెటూరులలో ఎవరికైనా ఆపత్తుతటస్థించినపుడు యిరుగుపొరుగువారలు కొంతసహాయము చేయుదురు. అనగా ఒకకుటుంబములో ఎవరైనచనిపోయినపుడు వారిబంధువులను కొందరు ఓదార్చుచుందురు. కొందరు శవవాహనమునకై ఉచితముగ పూనుకొందురు. అట్టివిపత్తులో కావలసిన ముఖ్యసామగ్రినంతయు నెవరంతట వారేతెచ్చి సహాయముచేయుదురు. దీనినే అన్యోన్య సహకారమని మనమెంచవచ్చును. ఇట్టి సహకారసహాయమే పరోపకారమనతగును. ఒక రైతు కుప్పనూర్చుకొనుటకు తనతోడిరైతులను పదికాళ్ళఎడ్లను అడిగితెచ్చికొని తనపని పూర్తిచేసికున్నతర్వాత తనకు సహాయముచేసినవారికి వంతులువారీగా తానున్ను తన ఎడ్లున్ను కుప్పలునూర్చుచుండును. ఇటుల అన్యోన్యసహాయమువలన ఇబ్బందులను సులభముగదీర్చుకుని సుఖింపవచ్చును. అన్నివిషయములలోను సహకారపరపతిసంఘములు సౌఖ్యప్రదములని విద్యాధికులెల్లరును విశ్వసించియేయున్నారు. ఇట్టి ఉదాహరణములు వ్రాయబూనిన అనేకములు గనుపడుచుండును. ప్రస్తుతము ఈవ్యాసము సహకారవిషయమైనది కాకపోయినను భీమావ్యాపారమునకు పునాది సహకారసంస్థయేగాన దానినిగురించి వ్రాయవలసివచ్చినది.

ఆరోగ్యముగానున్న పట్టాదారులయొక్క సొమ్ము ఆపత్తులోబడినవారికిగాని మృతినొందివారి వారసులకుగాని సహాయముచేయుటయే భీమాకంపెనీవారియొక్క ముఖ్యతాత్పర్యము. ఇతరదేశములలో భీమాచేయించుకొనేవారియొక్కయు, భీమాకంపెనీలయొక్కయు సంఖ్యలుహెచ్చుగానే కనపడుచున్నవి. దానినిబట్టిచూడగా మనదేశములో భీమాతత్వము పురుషులకే అందులో విద్యావంతులమనుకొనువారికే తెలియనపుడు ఇక స్త్రీలకు బొత్తిగా తెలియదనుటలో ఆశ్చర్యమేమికలదు? ఎంతబోధపరచినను సుంతైన తెలియని స్త్రీజాతికి ఎప్పటికి భీమాతత్వముపూర్తిగా తెలియగలదో నిరూహ్యము. కాని పురుషవ్యక్తులకంటె స్త్రీజాతికి భీమా మిక్కిలిముఖ్యావసరమగునని ముమ్మాటికి మనవి చేయుచున్నాను. కారణమేమనగా ఆడదానిచేతి అర్థమున్ను మగవానిచేత బిడ్డయున్ను బ్రతుకదని మనతెలుగులో నొకసామెతకలదు. పురుషవ్యక్తి సంపాదించితెచ్చిన సొమ్ము స్త్రీలచేతులలో పోయుదురనుట చాలాచోట్ల యదార్థమనతగును. మనస్త్రీలలో పలువురు గృహనిర్వాహకత్వవిధానమెరుంగక ఆదాయమునకంటె అధికమగు వ్యయములుచేసి అప్పులపాలయి అమితబాధల బొందుచున్నారనియనుటలో అతిశయోక్తిలేదు. ఇందువిషయములో పురుషవ్యక్తులే పొరబాటుపడి ఆదాయమును గుర్తెరుగకుండ వ్యయములు

చేసుకొనుచున్నప్పుడు యిక స్త్రీలనునిందించుట అసభ్యమనతగును. రాజాధిరాజులు, చక్రవర్తులు, కిరీటాధిపతులకు ఈఅమితవ్యయపువ్యాధి అంటురోగమువలె పీడించుచున్న దనుటకు అనేకోదాహరణములు గలవు. వాటినన్నిటిని యిచటచర్చింప బూనుకొనుటకు తగిన సమయముకాదు. మన స్త్రీలలో ఉదయాదిప్రభృతి అనేకదుర్వ్యయముల చేయు చున్నారము. మనజాతికి పుష్పములనిన అతిప్రీతి. మనము నిత్యము దవనము, మరు వము, చేమంతి, రోజా, సంపంగి, మల్లెమొదలగు పుష్పములకు విరివిగా ఖర్చుపెట్టుచుం దుము. తర్వాత కాఫీగుండ, పంచదార, పాలుకొరకు కొంతపైకము వెచ్చించుచుందుము. ఇవిగాకుండా విదేశపుఫ్యాషణులకు మరగి ముద్దినుసు చీరెలు, పేసుపౌడర్లు, తలనూనెలు, సబ్బులు యిలాటివి తరుచుకొనుచుందుము. రిబ్బనులు, లేసులు, అల్లికదారములు, పూసలు, ఇవియవియననేల యేదోవిధముగా మనయింటిలోని ద్రవ్యమును విదేశములకు సాగనంపు చున్నారము. ఇవిఅన్నియు బొత్తిగామానివేయవలసినదిగా నేను కోరుటలేదు. వీటిని కొనునపుడు ఆదాయమునుజూచి దూబరగాకొనకూడదనియే విన్నవించుచున్నాను. ఇట్టి అమితవ్యయములలో దగులుకొని ఆదాయమును నశింపుచేసుకొనుచున్న మనస్త్రీజాతికి భీమాచేయించుకొనుట మంచిమార్గముకాదని యెవరనగలరు? మరియు మనస్త్రీలకు రెండు సంవత్సరముల కొకసారియైన గర్భధారణమగుచుండును. ప్రతిపురుడు తటస్థించినపుడును ఒక్కొకగండ మెదుర్కొనుచున్నది. మనస్త్రీలలో మూఢాచారములవల్లను తెలివితక్కువ జాతివారగు మంత్రసానుల ఉపచారములచేతను అకాలమరణములు సంప్రాప్తమగుచున్నవి. కాన మనస్త్రీలు తప్పక భీమాచేయించుకొన్నచో మన కుటుంబములు యిబ్బందులు పాలు కాకుండా సహాయసంపత్తులు కలిగియుండును. మనము భీమాచేయించుకొన్న సొమ్ము వాయిదా పూర్తియగువరకు మనము జీవించియున్నచో వృద్ధాప్యదశలో మనచేతికందును. మనకు అకాలమరణము ప్రాప్తించిన మనపుత్రికాపుత్రులకు సహాయముచేసినవారమగుదుము. అయితే పురుషులే నిరుద్యోగసమస్యలో అల్లాడుచున్న యీరోజులలో స్త్రీలు యిబ్బందిపడి భీమాచేయించుట కష్టసాధ్యమని నేను యెరుంగని విషయముకాదు. మనముచేయు ప్రతి ఖర్చులలోను కొద్దిగా మిగుల్చుకుని భీమాకుసొమ్ము నిలవచేసికొనవలసినదని కోరుచున్నాను. తరుచు మనకు కలరా, టైఫాయిడ్డు, మశూచికము మొదలగు అంటువ్యాధులు తటస్థమై తద్వారామరణములు ప్రబలుచున్నవి. మోటారుప్రమాదములు, నావికాప్రయాణములు, జట్కాబండ్లప్రయాణము వీనిలో ప్రమాదములు అధికమగుచున్నవి. మనముచిక్క వయస్సు నందే భీమాచేయించుకుంటే చెల్లించేసొమ్ములు చౌకగానుంటూవుండును. వయస్సుమించిన కొలదీ వాయిదారేట్లు అధికమగుచుండును. ఒకప్పుడు ఆరోగ్యమున్ను క్షీణించియుండును గనుక మనస్త్రీలు ఆలస్యముచేయక వెంటనే భీమాచేయించుకొనుట ఉత్తమమని యెంచ తగినది. మన హిందూదేశములో అరువది భీమాకంపెనీలుఉన్నట్లు మనకు అంచనాగా

తెలియుచున్నది. వీటిలో మన ఆంధ్రదేశమందు స్థాపించిన భీమాకంపెనీలోచేరుట ఉత్తమము. "ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు" అనే సామెతగా ఏకంపెనీ నమ్మకమైనదో యేకంపెనీ నమ్మకమైనది కాదో వాటివాటికార్యనిర్వాహకవర్గముయొక్క గౌరవమునుబట్టి మనము నిర్ణయించుకోవచ్చును. మచిలీపట్టణమందు స్థాపించియున్న ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీవారు స్త్రీలభీమావిషయమై కొన్నినిబంధనల నేర్పాటుచేసియున్నారు. వాటిలో స్త్రీలకు వెయ్యిరూపాయిలకు అయిదురూపాయిలు అధికముగా చెల్లించవలెనని యేర్పాటు చేసినారు. పైగా వెయ్యిరూపాయిలకు తక్కువధరఖాస్తులు స్త్రీలు భీమాచేసికొనుటలో అంగీకరించుటలేదనిన్ని తెలియుచున్నది. మరియు స్త్రీలకు వైద్యపరీక్ష L.M.S. పరీక్షలో నుత్తీర్ణురాలైన స్త్రీవైద్యురాలే చేయవలెననిన్ని, ఆమెకుతోడుగా L.M.P. పరీక్షలో జయమొందిన పురుషవైద్యుని సహాయముతో వైద్యపరీక్ష పూర్తికావలసియుంటుందనిన్ని విని ఉన్నాను. స్త్రీలనుపరీక్షించుటలో స్త్రీవైద్యురాలికిసహాయముగా పురుషవ్యక్తిని సహాయము చేయవలెనని విధించుట-అంతగాబాగులేదు. పురుషవైద్యసంపర్కములేకుండానే L. M. S. పరీక్షలో ప్యాసయినస్త్రీకి సహాయమవసరమగునేని L. M. P. పరీక్షలో ప్యాసయినస్త్రీ వైద్యురాలినే నియమించుట ప్రశస్తముగానుండియుండును. మరియు స్త్రీలను వైద్యపరీక్ష చేయించవలసియున్నప్పుడు రు. 20—0—0 ఫీజు ముందుగా కంపెనీకి పంపవలసియుండునని రూల్సునందుకలదని తెలియుచున్నది. ఇట్టి విషయములన్నియుచూడగా ఆంధ్రదేశమందు అరువదిలక్షలవరకు వ్యాపారముసాగించుచున్న ఆంధ్రఇన్సూరెన్సుకంపెనీవారు స్త్రీజాతికి ప్రత్యేకసౌకర్యములు యేర్పాటుచేసినబాగుండునని మనవిచేయుచున్నాను.

ఇదిగాకుండా బెజవాడయందు స్థాపించబడియున్న డెక్కన్ అస్యూరెన్సుకంపెనీవారు స్త్రీలవిషయమై ప్రత్యేకసదుపాయముల నేర్పాటుచేసియున్నారని వినియున్నాను. రు. 250—0—0 లగాయితు స్త్రీలధరఖాస్తులు స్వీకరింపుచున్నారనియు, వెయ్యింటికి అయిదురూపాయిలను అదనపురేటు పుచ్చుకొనుటలేదనియు, స్త్రీల మెడికల్ యగ్జామినేషన్ విషయములలో ప్రత్యేకసౌకర్యముల నేర్పాటుచేసియున్నారనిన్ని వినియున్నాను. అన్నిటికంటె ఈకంపెనీవారుచేసిన ఒకమహోపకారము వినుతింపతగినదై యున్నది. వీరు ఆర్గనైజరీబోర్డులో శ్రీమతులు 1. డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డిగారు, 2. ఆచంట రుక్మిణీలక్ష్మిపతిగారు, 3. అంబుస్వామినాధనుగార్లనంటి విద్యాధురీణురాండ్రను మెంబర్లుగా నేర్పాటుచేసియున్నారు. మరియు శ్రీమతులు పొణకా కనకమ్మ, మనపాకం కమలమ్మగార్లు మొదలగు విదుషీరత్నములగు దేశసేవకురాండ్రను ఆర్గనైజర్లగాను నియమించుటవల్ల మనస్త్రీజాతికంతకును గొప్పగౌరవమును, సౌకర్యమును సమకూర్చియున్నారని మనము సంతోషింపవలసియున్నది. వీరు ఉత్తరప్రత్యుత్తరములు ఆంధ్రభాషలోనే జరుపుచుండుచో ఆంగ్లేయ భాషాపరిచయములేని ఆంధ్రస్త్రీలు పలువురు ఏజంట్లుగానుండి పనిచేయుటకు వీలుకలుగును,

# బ్రాహ్మణకాలమునందలి స్త్రీగౌరవము

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు

మున్ముందుగా బ్రాహ్మణములనవేమియో అవి యేకాలమునాటివో కొంచెముగాఁ దెలుపవలసియున్నది. బ్రాహ్మణములనఁగా వేదములనియు, వానికి వ్యాఖ్యానములవంటివని కొందఱును, వేదభాగములని మఱికొందఱును జెప్పుదురు. ఆచర్చతో నిచ్చటఁబనిలేదు. ప్రతివేదమునకును బ్రాహ్మణములుగలవు. అందు ఋగ్వేదమున కైతరేయబ్రాహ్మణమును కౌశీతకిబ్రాహ్మణమును; శుక్లకృష్ణభేదములతోనొప్పెడి యజుర్వేదమునకు శతపథబ్రాహ్మణమును; తైత్తిరీయబ్రాహ్మణమును; సామవేదమునకుఁ దాండ్యషడ్వింశాదిబ్రాహ్మణములును; అథర్వవేదమునకు గోపథబ్రాహ్మణమునుగలవు. ఇవియన్నియుఁ బ్రవచించిన ఋషినామములనుబట్టి భారతకాలమునాఁటివని కొందఱువిమర్శకులు నిర్ణయింపఁగలిగిరి. అనఁగా రమారమి యిప్పటి కైదువేలయేండ్లనాఁటివని వారితలంపు. అప్పుడే భారతదేశమందలి ఋషివర్యులవైభవమెల్లను వెల్లడియైనది. ఆకాలమున స్త్రీలెట్లు గౌరవింపబడిరో యా బ్రాహ్మణోదాహరణములతోడనే చూపెదను. వానియందుఁగాన్పించెడి ప్రధానవిషయమాధిదైవికతత్త్వవర్ణనమయ్యును మనుజుఁడు గృహస్థుఁడై యజ్ఞములొనర్పుటయే శ్రేష్ఠతమమగు కర్మముగావర్ణింపబడియున్నది. ఇట్టిభాగము వానియందు విశేషముగలదు. గృహస్థాశ్రమము స్త్రీపురుషులిద్దఱమూలమునఁగదా నడచుచుండును? సాధారణభాషయందుఁ స్త్రీ పురుషునకర్ధాంగియని చెప్పఁబడినట్టుల పత్ని పతియొక్క యర్ధభాగమనియేకలదు:—

"అథో అర్ధోవాఽఏష ఆత్మనః । యత్పత్నీ" —తైత్తి. బ్రా. 3. 3. 3. ౫.

మఱియు నాకాలమునందు స్త్రీలకు విశేషగౌరవముకలదు. అట్లులేకున్న పత్నుల యొక్కరూపమే లక్ష్మియొక్కరూపమనియుండునా!

"శ్రియావా ఏతద్రూపం యత్పత్న్యః" —తైత్తి. బ్రా. ౨. ౯. ౪. ౭.

ఇంతయేల? పత్నీరహితుఁడై నపురుషుఁ డెట్టికర్మములనుజేయ ననర్హుఁడని తెలుపుటయే వారిగౌరవమును జాటుచున్నది.

"అయజ్ఞోవాఏషః । యోఽపత్నీకః" —తైత్తి. బ్రా. ౨. ౨. ౨. ౬.

ఇన్నిమాటలెందులకు? ఇప్పుడు లోకానుభవమునందున్న స్త్రీలవిశేషములను గాంచఁగల్గితిమేని పైయర్థమే మఱింత తేటపడఁగలదు:—సుగుణవతియగుస్త్రీ సహధర్మచారిణియై గృహకృత్యములను బాగుగాఁ జక్కఁబెట్టును; భర్తకు సంతతినిచ్చును; సకలవిధములను భర్తకు సహాయురాలగును; సదా తనభర్తకు మేలుకలుగవలయుననెడి తలంపుదక్క వేఱొకతలంపుతోనుండదు. మంచికళత్రమేకదా లోకమున ధర్మసాధన కుపకరణము; గృహనీతివిద్యకు గృహము; వంశస్థితికి మూలము; చిత్తాహ్లాదసంజనకము; స్థిరగుణములకుగని; గౌరవమునకుఁగారణము; విమలచారిత్రశిక్ష కాచార్యకము. అట్లు స్త్రీయనేకవిధములుగా నుపకారిణియగుచుండఁ బ్రపంచమునం దుత్తమపురుషునకు భార్యకంటె నితరమెద్దియును

ప్రియతమముగానుండదని వేఱుగా జెప్పవలయునా? మంచియిల్లాలు భర్తను జెడుత్రోవనుండి తప్పించి ముక్తినొసఁగును. అనుకూలభార్యావంతులు తమగృహము భూతలస్వర్గముకాఁగా నిఖిలసంతోషమునుబడయఁగలరు. పురుషుఁడొంటరిగా నడవిలో వాసముచేయుచున్నను భార్యయొక్కతియే సహాయురాలై సౌఖ్యదాయినియగును. ఆలుబిడ్డలతోఁ గూడియుండిన వానినే సకలజనులును సమ్మానింపఁదగినవానినిగాఁ జూతురు; విశ్వసింతురు; కాని యేకాకిగా నుండువాని నెవ్వరును విశ్వసింపరు; సమ్మానింపరు.

"నాతండ్రి యెవ్వనికి నన్ను వివాహమొనర్చెనో యాతనిని నేను జీవించియుండునంతకాలమును విడువఁజాలను" అనెడి సుకన్యాఖ్యానమునందలి వచనానుసారముగ నాకాలమున పతి గుణహీనుఁడయ్యును స్త్రీలు పతిసేవచేయుటయే పరమధర్మముగాజూచెడివారలు. అందుచేతనే యేదేశమువారలును గడింపఁజాలనిసుకీర్తిని భారతరమణీమణులు సాధింపఁగల్గిరి.

"సాహోవాచ నైవాహం జీవన్తగ్ం హాస్యామి" —కాణ్వ. శతపథ. ౫. ౧. ౫. ౬.

ఆకాలమునందు నూలుతీయుటకాని యున్నితో వివిధరూపములగు వస్తువులనల్లుటగాని సాధారణస్త్రీల వ్యాపారమైయుండెను.

"తద్వా ఏతత్ స్త్రీణాంకర్మయదూర్ణాసూత్రమ్" —కాణ్వ. శత. ౧౪. ౪. ౨. ౮.

మఱియు నప్పుడు వివేకవతులుగాని స్త్రీలు సాధారణముగా నిరర్థకవాక్యములతోఁ గాలము పుచ్చుచుండెడివారలు. అట్లుకాకుండుటకై గాన మొనర్చుటయో, నృత్యమొనర్చుటయో యాచారమైయుండెను. బాలికలు సంగీతమునేర్వరాదనువార లీక్రిందివాక్యమున కర్థమేమి చెప్పెదరో:—

"తస్మాద్యఏవమోఘు సంహితోయోనృత్యతియోగాయతి తస్మిన్నేవయోషానిమిశ్లతమా"

—కాణ్వ. శత. ౪. ౨. ౪. ౪.

ఈకాలమునందు విద్యావతులు సభలకుఁబోవునట్లే బ్రాహ్మణకాలమునందును విద్యావతులును బ్రహ్మవాదినులునునగు గార్గి, మైత్రేయిలవంటి స్త్రీలు సభలకుఁబోయెడివారలు; కాని సాధారణస్త్రీలు గృహములందే యుండెడివారలు.—

"గృహావై పత్నీ" —కాణ్వ. శత. ౪. ౩. ౧. ౮.
"గృహావై పత్న్యైప్రతిష్ఠా" —మాధ్య. శత. ౩. ౩. ౧. ౧౦.
"తస్మాత్ పుమాగ్ంసః సభాగ్ంయాంతిన స్త్రియః" —మైత్రాయ. సం. ౪. ౭. ౪.

స్త్రీహత్య యప్పుడే కాదిప్పుడునుగూడ నింద్యకర్మముగాఁ జూడఁబడుచున్నది:—

"నవై స్త్రియం ఘ్నంతి" —కాణ్వ. శత. ౧౩. ౪. ౩. ౨.

అప్పటిస్త్రీ లెవ్వనిని జంపెడివారలుకారు:—

"నవై యోషాకంచనహినస్తి" —కాణ్వ. శత. ౮. ౧. ౩. ౩౬.

పైనిచెప్పఁబడినట్లెన్నియో విశేషములు స్త్రీలయెడఁ గాన్పించుటచేతనేకద మనువు తన ధర్మశాస్త్రమునందు "ఎచ్చట స్త్రీలు పూజింపఁబడుదురో యచ్చట దేవతలు క్రీడింతురు; ఎచ్చటఁ బూజింపఁబడరో యచ్చటక్రియలెల్లను ఫలరహితములగును"అని చెప్పెను?




డాక్టరు తూము లక్ష్మీపతిగారు

వాముపాటను పావులాయెత్తు పంచదారతో సేవించినగాని;-వాముపువ్వు, పుదీనా, ముద్దహారతికర్పూరము నొకసీసాలో వేసిన నీరుఅగును-ఆనీటిని పంచదారపై అయిదుచుక్కలువేసి సేవించినగాని అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి నశించును.

కాల్చినఅరటికాయ కొంచెము పంచదార చేర్చి ఉశిరికాయంతముద్ద-కడుపునొప్పికలదేని పావులాయెత్తు మారేడుపండుజిగురు, బెల్లముచేర్చేది-ఇచ్చిన అతిసారము, గ్రహణి కట్టును.

మిల్లిగరిటెడు సరస్వతీఆకురసముగాని; పావులాయెత్తు వస, కటుకరోహిణి సమభాగచూర్ణముగాని; గిలిగిచ్చవేరు, పెన్నేరుకలిపి కుంకుడుగింజంతమాత్ర చేసిగానిసేవించిన అపస్మారము, కాకిచెమ్మలు నయమగును.

పిప్పళ్ళు, మిరియాలు, ఏలకులు, సైంధవలవణము ఇవి సమభాగములుగగ్రహించి చూర్ణించి అందు శర్కర, తేనె కలిపిఇచ్చిన శిశువులమూత్రకృచ్ఛములు నివారణఅగును.

అరఔన్సుశుంఠిని అడ్డసరపాకు, రెడ్డివారినానబ్రాలు వీటిలో నొకదాని కషాయముతో సేవించుట వలన శిశువులఉబ్బసము, కాసశ్వాస, దగ్గు, శ్వాసకాస, శ్వాసక్షయ, శ్లేష్మము నెమ్మదించును.

మామిడిచెక్కరసము 5 చుక్కలు, సున్నపుబొట్లు-7, సున్నముబొట్లు 4 పూటపూటకుసేవించిన ఎరుపు, తెలుపు ప్రదరములు నివారణఅగును.

శొంఠిచూర్ణమువేసి కాచినఆవుపాలు $\frac{1}{2}$ ఔన్సు పుచ్చుకొనిన కామిల నయమగును.

నీటిపిప్పలి లేక బొక్కెనాకురసము ఆరుచుక్కల్ల చొప్పున వేయుచుండినచో సమస్తమైన చెవిరోగములు నశించును.

చింతాకుపసరుగాని నల్లఅంబటిఆకుపసరుగాని చెవిలోవేసిన పార్శ్వపునొప్పులు మానును.

పైడిపత్తిఆకురసముగాని కాయరసముగానితీసి అందు తులశిఆకురసము జేడఎత్తు, అయిదారు ఏలకుల గింజలుకలిపి సేవించిన వాంతులుకట్టును.

పొత్తిదుంప, అయిదుమిరియాలునూరి వాపుమీద పట్టించి గాలిచాటుగానుండిన కాళ్లవాపులుతగ్గును.

కాకరాకు, కోడిమలముకలిపి నూరికట్టిన కుక్కకాటులు మానును.

బర్రింకచెక్క అయిదుమిరియాలుకలిపి నూరికట్టిన నక్కకాటులు నయమగును.

రక్కిసవేరునమలించినను, కుట్టినతావున రక్కిససొనరాచినను తేలుకుట్టుబాధ నివారణఅగును.

నేలతాడిగడ్డలరసముతో వెలిగారముకలిపిత్రాగిన ఏజాతి పాముకాటుఅయినను నిస్సందేహముగ నివారింపబడును.

# ప్రతిశాపము

అప్పల వీరవేంకట జోగయ్యశాస్త్రిగారు

అది నిశీథము ఘోరఝంఝూనిలప్ర
సారసంకీర్ణ భీకరజలదయుతము
తిమిరసంఘాతకరసుప్తదిక్సమూహ
మఖిలజనలోకహృదయభయానకంబు!

* * *

నడచె నావేళ నొకదివ్యనవ్యకుసుమ
సదృశకోమలగాత్రి విస్ఫారజఠర
వజ్రనిభమైన పాషాణపథమునందు
తనదుశిరమునఁ గండోలమునుధరించి.
అందుకూర్చుండె దుర్భరవ్యాధిజనిత
తరసముద్గంధయుతమైన తనువుతోడ
రసికనారీపరిష్వంగలబ్ధసౌఖ్య
మెలమిఁదలపోసికొనుచు నాపాలతిమగఁడు.
అతఁడు కౌశికుఁడానారి యతనిభార్య
భర్తృపాదారవిందసేవావిశేష
కలితసువ్రతకామ సల్లలితహృదయ
సుగుణవారాశియైన యాసుదతి ముందు.

* * *

కొఱతవడియున్న మాండవ్యపరమమౌని
నంధతమసానగాన కయ్యనఘుశీల
వెడలిపోవంగ వానికిఁ బిటముతగుల
మౌని హర్యక్షగర్జాసమానభయద
ఘోరనిర్ఘోషమునవగ కుహరమదర
కుపితమానసుఁడై యంత గొంతునెత్తి
"కఠినుఁడెవ్వఁడు సన్నిష్ఠ గాసిపఱచె
నతఁడుసూర్యోదయంబైన మృతినిబొందు"
ననుచుశాపంబొసంగ నన్నారి భూరి
చండశార్దూలనాదసంచకితమాన
భీతమృగశాబకక్రియ బెదరిబెదరి
పదటువడి వెండి నిర్ఘాంతవడి దయొకింత
కనులఁదొరఁగెడుబాష్పాంబుకణములొత్తి
"కరుణమత్ప్రాణనాధరక్షణముకొఱకు
కువలయాహితుఁడుదయింప కుండుగాక!"
యనుచుశాసించి యన్నారి చనినయంత.

* * *

ప్రళయకాలమహాధ్వాంతపటలకీర్ణ
చటులనిశవోలె నారేయి జరుగకున్న
నడలిబుధకోటి మూర్తిత్రయంబుతోడ
మహితహిమకరుఁగన్నట్టి మాన్యచరిత
సూరిజనవంద్యయగు ననసూయతోడ
సరగఁజనుదెంచిరంత నాసాధ్వికడకు.

* * *

వచ్చి మృదుమంజువాక్ఫణితినిట్లు
సుదతివీక్షించిపల్కి రాసుబుధవరులు
"సకలభూతప్రపంచంబు సంకులపడ
తరుణిరో! యేలగట్టెదు తరణిపథము
వలదు నీయట్టిసాధ్వి కీచలము వినుము
కలికి! నీకిష్టమెద్ది యీక్షణమగొనుము!"

* * *

"ఇది యమోఘము మరలింప నెవరివశము?
ఘూకభేకీలసధ్వానకుధరకుహర
ఘనజలాశయసంఘాతకలితచటుల
కాళరాత్రియె నాపాలి కల్పకంబు
కరము పూర్వాద్రిపై ఖరకరుఁడువొడుమ
వసుధ మత్పతిజీవముల్ బాయుఁగాన."

* * *

"అయిననేమాయె నీకేల నంతభయము?
విమలకరుణార్ద్రహృదయులౌ వీరలెల్ల

విగతభర్తృక నిన్‌జేసి వెడలరెపుడు
పడఁతి! యూహింపుదీనికిఁ బ్రతిహతంబు!"
అనుచు ననసూయవచియింప నమలవృత్తి
బాహుయుగమెత్తి ప్రార్థించె పద్మమిత్రు.

* * *

పొడమె సర్వచరాచరభూతజాత
మృదులహృదయారవిందముల్ మేలుకొనగ.
తమముఁబాయంగనాబుధోత్తములువొగడ
నహిమకరుఁడల్ల పూర్వాద్రిపొడచె.

* * *

నవ్యకోమలకంజాతనయనయుగళ
ముక్తజలబిందుపూరంబు భూమిఁబడక
మున్నె తనపతి సుప్తోత్థపురుషసింహ
మటుల చనియును జీవించె పటులశౌప
యుక్తుఁడయ్యును రోగవిముక్తుఁడగుచు
నచటివారలు జయపెట్ట నద్భుతముగ!

* * *

# మాతృప్రేమ

చిరుమామిళ్ల విజయపార్థసారథి గారు

వ్యాధితఁడగుచు హృదయమును మెతకపరచి యౌవనావస్థయందుకూడ పసితనమందలిభావముల స్ఫురింపచేయును. ఎవరు వృద్ధాప్యములోను రుగ్మతవలనను బలహీనులై విషాదమునొందుదురో, ఎవరు ఆదరించుదిక్కులేక ఒంటరిగ పరదేశములలో జబ్బుపడుదురో వారు చిన్నతనమందు పెంచి పెద్దచేసి తమయశక్తతకుతోడ్పడి ఉద్ధరించినతల్లిని తలంపకుందురు?

ఇతరములైన హృదయానురాగములన్నిటిని అతిశయించినను నిశ్చలమగుమాధుర్యము పుత్రునిపై తల్లికి నిక్కముగఉన్నది. ఆవాత్సల్యము స్వప్రయోజనముచే తగ్గదు. ఆపదలలో అణగిపోదు. అప్రయోజనముచే క్షీణింపదు. కృతఘ్నతవలన నసింపదు. కుమారునిహితవునకు తల్లి తనసర్వసౌఖ్యమును త్యజించును. అతనిఆహ్లాదమునకు తనసంతోషము సహితము సరకుగొనదు. ఆతనికీర్తిలో పాల్గొనును. అభివృద్ధికి ఆనందించును. విపద్దశలో ఆదరించును.

అపఖ్యాతినొందినను ఆమెకు ప్రేమపాత్రుఁడొక్కఁడే. అతనిని విశ్వమంతయు విసర్జించినను అతనికి విశ్వమంతయు ఆమెయైనిల్చును. మాతృప్రేమకన్న గాఢానురాగమైనది మఱియొకటిఉండదు. దానికి అదియేసాటి.

అరుణగభస్తిబింబ ముదయాద్రిపయింబొడతేర గిన్నెలో
బెరుగును వంటకంబు వడపిందెలునుం గుడువంగబెట్టు ని
ర్భరకరుణాధురీణయగు ప్రాణముప్రాణము తల్లియున్నదే?
హరహర! యెవ్వరింక గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్.

—కవిసార్వభౌముడు శ్రీనాథుడు.



# సౌందర్యపోషణ

పండిత పెనుమెచ్చ సత్యనారాయణ రాజుగారు

సుభగంకరణోపాయములను వివరించుటలో కామశాస్త్రగ్రంథములు సాటిలేనివి. కామశాస్త్రగ్రంథములలో వాత్స్యాయనుని గ్రంథము తెలిగింపబడియున్నది. వాత్స్యాయనుని గ్రంథములో లేని విశేషవిషయములను చేర్చిన కొక్కోకుని రతిరహస్యమును తెనిగించుచో ఎఱ్ఱనాదికవులు సుభగంకరణోపాయములను సంగ్రహించిరి. కావున నేను ఆమూలగ్రంథమునుండి ప్రస్తుతము అంగరాగాదులు కొన్ని ఎత్తి సోదరీమణుల ఉపయోగార్థమిచట నిచ్చుచున్నాను.

నువ్వులు, ఆవాలు, కస్తూరిపసుపు, చంగల్వకోష్టు వీనిని కల్కముచేసి నలుగుపెట్టుకొనుచుండుచో శరీరమునకు బంగరు కాంతివచ్చును.

వేప, రేల, దానిమ్మ, దిరిసెన, తాండ్ర, లొద్దుగ ఈచెట్ల చెక్కలయొక్క పొడిలో కస్తూరిపసుపు, నాగము స్తలచూర్ణమును కలిపి నలుగుపెట్టుకొనుచుండుచో అంగములకు సౌందర్యమబ్బును.

నువ్వులు, నల్లజీలకఱ్ఱ, తెల్లావాలు, జీలకఱ్ఱ వీనిని పాలతో నూరుకొని రాచుకొనుచుండుచో చర్మమున గల దోషములన్నియు పోవును.

లొద్దుగ, వస, ధనియాలు వీనిని అన్నిటిని కలిపి పూసిన యౌవనప్రాదుర్భావకాలమున మొగముపై మొలుచు మొటిమలు నిర్మూలనమగును.

గోరోజనము, మిరియములు కలిపి పట్టించుటచే గూడ మొటిమలు పోవును.

పొట్టుతీసిన యవలు పిండిచేసి ఆపిండియు యష్టిమధుకము, తెల్లావాలు, లొద్దుగ చూర్ణము కలిపి స్త్రీలు ముఖమునకు లేపనము చేసినచో ముఖకాంతి వృద్ధిపొందును.

మాదీఫలములలోనుండు తాట కొంచము నమిలినచో నోటికంపు పోవును, అధోవాయువులు అంతరించును.

ఏఱుమద్దిపువ్వులు, నేరేడుదళములు, లొద్దుగ దళములు సమభాగములగ గ్రహించి ముద్దగానూరి శరీరమునకు నలుగుపెట్టుకొనినచో వేసవిలో చెమటవలన ఒడలు గబ్బువాసనవేయుట పోవును.

లొద్దుగ, వట్టివేళ్లు, దిరిసెనము, పద్మకము వీని చూర్ణము శరీరమునకు నలుగుపెట్టిన గ్రీష్మకాలమందుకూడ చెమట, చర్మరోగము పుట్టవు.

మంచిగంధము, కుంకుమపువ్వు, మెట్టతామరదుంప, లొద్దుగ, నందివర్ధనము, కురువేరు, తెల్లమిరియాలు వీనిని సమభాగములుగా గ్రహించి చూర్ణించి నలుగుపిండిగా నుపయోగించుచో, శరీరముయొక్క ఎంతటి తీవ్రమైన దుర్గంధమైనను పోవును.

మారేడు, నేలయుసిరిక ఈరెంటిని సమభాగములుగా స్వీకరించి నూరి పట్టించిన చంకలలోని చెడ్డకంపు నశించును.

నెమలియడుగుచెట్టు గింజలు చూర్ణముచేసి చింతపండులో కలిపి పట్టించిన బాహుమూలములయందలి దుర్వాసన తొలగిపోవును.

# వలమ్నియా

యం. కే. నారాయణశర్మ గారు బి. ఏ.

రోమను నారీమణులలో వలమ్నియా కడువాసికెక్కినది. ఆమె జీవితము నిరుపమానము. భర్తను గోల్పోయి దీనయై వలమ్నియా యొకతనచిన్నికొమరుడగు కేయస్ మార్సియస్‌నుపెంచి పెద్దవానిగజేయుటే తన జీవితసాఫల్యమని భావించెను. అనుదినమును బాలునికి ప్రాచీనరోమనువీరుల బలపరాక్రమాతిశయముల వినోదముగజెప్పుచు అత్యల్పకాలములోనే నీమె 'కేయస్' మనమున ఉదాత్తభావములను భద్రపరచెను. రోముదేశశత్రువులను పరిమార్చవలయుననియు, రోమను విజ్ఞానమును పెంపొందింపవలయుననియు, వలమ్నియా బాలునికి చక్కగ బోధించెను. అపారమగు నామె పుత్రవాత్సల్యము కేయస్‌మాతృభక్తికితోడాయె. ఆమెను రంజింపజేయుటే తనవిధియనియు, ఆమె మాటను జవదాటకుండుటే శ్రేయమనియు ఇతడు తెలిసికొనెను.

కేయస్ క్రమముగ పెరిగిపెద్దవాడాయెను. రోమునగరమును శత్రురాజు లిప్పుడు పీడింపసాగిరి. వలమ్నియా తనకొమరుని యుద్ధభూములకువెళ్ళ నాజ్ఞాపించెను. కేయస్ ఆమె ఆశీర్వాదములనుగైకొని వైరులతో ఘోరముగబోరెను. "టల్లస్ అఫీ డి యస్" అను విరోధిసేనానిని దుర్బలునిగజేసివైచెను. "కొరియాలీ"అను నగరమును విపత్తునుండి ఒక్కక్షణమున సేవించెను. ఇతని ధైర్యస్థైర్యములకు రోమనులెల్ల అచ్చెరువొందిరి. రోమనునాయకులెల్ల ఇతనియుద్ధనైపుణ్యమును వేనోళ్ళశ్లాఘించిరి. కొరియాలీనగరమును రక్షించినకతమున నితనికి 'కొరియలేనస్'అనుబిరుదమును రోమనులు ప్రసాదించిరి. వలమ్నియా బాలునికీర్తినివినియు, ధీశాలిత్వమునుగాంచియు కడుసంతసిల్లెను. పేరుప్రతిష్టలకై మానవు డెట్లు కష్టములకోర్చవలయుననియు, ప్రాణములబాసినను బాయవలయుననియు, వలమ్నియా దృఢముగనమ్మియుండెను.

కొరియలేనస్ విజయములతోబాటు ఆడంబరమును, గర్వమును స్వీకరించెను. క్రమముగ తన్నుమించినవాడులేడని భావించి బీదసాదలను తూలనాడుచు, ధనికుల ప్రతిష్టకై పాటుబడజొచ్చెను. వలమ్నియా తనకొమరుని నూతనగర్వమును గ్రహించలేదు.

కొరియలేనస్ రాజపదవియగు 'రోమనుకాన్సల్‌షిప్'కై ప్రయత్నింపమొదలిడె. కాని అతడు బీదలకడకేగి తన్ను ఆఅత్యున్నతపదవికి నెన్నుకొనమని ప్రార్థింపవలయును. తనగాయములను వారికజూపి, తానెట్లు వారిక్షేమములకై ప్రాణములనర్పింప సంసిద్ధుడైయున్నాడో విన్నవింపవలయును. కాని గర్వియగు కేయస్ యిందులకెట్లుసమ్మతించు? ఎట్టకేలకు చాలకష్టముతో నాతడు వారిని ప్రార్థింపమొదలిడెను. కాని వారి ధిక్కారింపులకును, అధికప్రసంగములకును సైపజాలక గర్వప్రేరితమగురోషముతో వారిని బహుభంగులదూషించెను. క్రోధావేశముతో వారెల్ల నితనిని రాజద్రోహియనినిందించుచు, త్వరలోనే 'కేయస్‌ను' రోమునుండి వెడలగొట్టిరి. వలమ్నియా శోకసాగరమునమునిగెను.

కొరియలేనస్ రోషాయత్తచిత్తుడాయెను. రోమనులపై తనక్షాత్రమును చూపెదనని నాతఁడు తీర్మానించుకొనెను. తదనంతరము తనవైరియగు టల్లస్ అఫీడియస్‌కడకేగి రోమనులు తనకుచూపిన నిరసనమును నాతనికి విన్నవించి, వారితోబోరి రోమును భస్మీభూతముగజేసెదనని శపథముచేసెను. కొరియలేనస్‌నుగాంచి టల్లస్ ఆశ్చర్యచకితుడాయెను. రోముదేశముపై దండువెడల నాత డీతనికాజ్ఞ యొసగెను. కొరియలేనస్ క్రమముగ రోమను పట్టణములెల్ల నాక్రమించుకొనె. ఇక రోమును ముట్టడించుటకై నాత డంజవేసెను. రోమనులెల్ల యిప్పుడు భయవిహ్వలులైరి. దిక్కుతోపమి రోమను నారీమణులెల్ల నేడ్వసాగిరి. తమకేయసే తమ్ముకరవాలములతో బొడచునేలని వారెల్ల దుఃఖవివశులైరి. సంధినిగూర్పుమని పలువురు రోమనులు ఇతనికడకేగుదెంచి ప్రార్థించిరి. కాని కొరియలేనస్ వీరిమాటలను వినడాయెను. రోమనులనెవ్వరిని తన గుడారమునకు రానియ్యవలదని ఇతడు భృత్యులకాజ్ఞ యొసగెను. రోమునకిక దిక్కులేదు. యుద్ధవీరుల భీభత్సముల కది గురికాకతప్పదు.

ఇట్టిసమయమున వలమ్నియా తనకోడలిని మనుమని వెంటనిడుకొని రోమును విపత్తునుండి తప్పింప కొరియలేనస్ కడకువెళ్ళెను. ఆమెనుచూచి అతడచ్చటనుండి వెడలిపో జూచె కాని వలమ్నియా అతనిని నిలువుమని గంభీరముగననెను. "కేయసూ! నీవు రోమను ధీరుడవు. మాతృదేశముపై దాడివెడలవచ్చితివా? రోమున జన్మించితివని అప్పుడే మఱచితివా? ఏనగరరాజము సౌందర్యభావములను, అత్యున్నతానందమును నీకు ప్రసాదించెనో ఆనగరమును దవానలముచే రూపుమాపజూచితివా? ఇది నీకు పాడియా? నీవిజయమునకై మేమెట్లుప్రార్థింతుము? ప్రార్థించితిమా రోమును మంటలబడగోరుటేకదా? ప్రార్థింపనిచో నీమరణమున కెదురుచూడవలయు. నీకై మేమెట్లు తపించుచున్నారమో చూడుము. యుద్ధమును మానుము. సంధియొనగూర్పుము. నీకు కీర్తినొనర్చిన రోమును గౌరవింపుము. నాదీనాలాపముల ధిక్కరింపకుము. రోమునుసేవించి మాకెల్ల సంతసమొనగూర్పుము. ఇంకను నీమనసు కరుగదేని ఇదిగో నీ భార్యనుచూడుము. నీపుత్రుని దయతో నాలకింపుము. వీరిని గూర్చియైన నామాటల నుల్లంఘింపకుము. అట్లు ధిక్కరింపజూచితివా యిదిగో మాశరీరములపై కాలిడి మమ్ములచంపి పిదపరోముపై వెడలుము" అని వలమ్నియా గంభీరముగ నాతనిమనసు కఱగున ట్లుపన్యసించెను. కొరియలేనస్ కంట నీరుబెట్టుకొనెను. ఆమె మాటల నెప్పుడు కేయస్ జవదాటియెరుగడు. ఇప్పుడామె నెట్లు అతిక్రమించును? బేలవలెనాతఁడు "తల్లీ! నీవు నన్నోడించితివి. రోమున కొకయఖండగౌరవమును విజయమును చేకూర్చితివి. నే నికయుద్ధముచేయనొల్ల. నిశ్చింతగనుండుము. కాని నాసైనికులు నన్ను మోసగాడని పొడచి చంపుదురు" అని వెనుకకుదిరిగెను.

వలమ్నియా సంతోషముగ రోమునకేగుదెంచెను. పుత్రుని గోల్పోయెను. రోమును రక్షించెను.

# నందివర్ధనము

డాక్టరు. యస్. శేషగిరి రావు, యల్. ఐ. యమ్.

దీనిని ఆంగ్లమున **East Indian white Rose, Baywax Flower Plant, Ceylon Jasmine** అనియు; సంస్కృతమున కింకిరాత, కింకిరిట, శీతక, శీతభద్రక, హిమగౌర, విప్రలంబీ, షట్పద, నంద్యావర్తము అనియు నందురు. హిందూదేశమునందన్ని ప్రాంతములందును పెంచబడుచున్నది. అందు బంగాళాదేశమునందు, దక్షిణహిందూదేశమునందు అతివిస్తారము. ఆలయపుష్పవనములలో తఱచు పెంచబడుచుండును. నందివర్ధనము పూవులు ఆకారమున బొడ్డుమల్లిపువ్వులను పోలియుండును. కాని వాసన అంతగా గలిగియుండవు. గరుడవర్ధనమని కొందరిచేతను విష్ణువర్ధనమని మఱికొందరిచేతను పిలువబడు పూలమొక్క నందివర్ధనముగణము లోనిదే. నందివర్ధనమును నేలయంట్లువలనగాని ముదురు కొమ్మలు నాటుట వలనగాని వృద్ధి చేయవచ్చును.

నందివర్ధనము పలుశాఖలుపెట్టి తుప్పగా పెరుగుమొక్క. ఆరుమొదలు ఎనిమిది అడుగులు ఎత్తునఱకు ఎదుగును. ఆకులు నాలుగుమొదలు ఆరు అంగుళముల నిడివిగాను, ఒకటిమొదలు ఒకటిన్నర అంగుళముల వెడల్పుగాను ఉండును. ఆకులప్రక్క కొనలు ఎగుడు దిగుడుగా నుండును. ఆకులు నున్నగానుండి నిగనిగగల పచ్చదనముతోనుండును. ఆకు నడిమికాడ కాలుఅంగుళముమొదలు అరఅంగుళమువఱకు వెడల్పు ఉండును. పువ్వు మొదటికాడ ఒక అంగుళముమొదలు రెండు అంగుళముల నిడివియుండును. తొడిమ లావుకానిది. పూవులు ధవళములు. కొన్ని ముద్దపూవులు, కొన్ని ఒంటిరేకపూవులు పూయును. కొలదిగా వాసనయుండును. నందివర్ధనము చెట్టుయొక్క ప్రతిభాగమున పాలవంటి రసము కలదు. అది రుచికి కటువుగానుండును.

నందివర్ధనపు వేరులో జిగురుపదార్థమును **(Resin)**, కటువైన క్షారమును గలదు. నందివర్ధనపు పాలలో రబ్బరుదినుసును, బంకదినుసును గలవు. ఈమొక్కలో హిమద్రావకము **(Ether)** నందు కరిగిపోవు క్షార సంబంధమైన వస్తువుగలదు. ఇది ఇతరపదార్థముల చేరికను తెలిసికొనుటకు సాధనములైన క్షారపదార్థములతో కలిపినచో బాగుగ పనిచేయును. ఇందలి ప్రధానమైనరుచి కటువు.

నందివర్ధనము శీతలముగ నుండును. రక్తదోషము, శిరోరోగము, నేత్రరోగము, కఫము, శీతపిత్తము, వీటినిహరించును. వాతమును చేయును. ఈపూవులు దేవతార్చనకు ముఖ్యము. పైకిపూసిన నందివర్ధనపుపాలు మంచిశమనకరమైనమందు. వాచిన భాగములందు రాయుటవలన వానికి చల్లదనమిచ్చును. నఱుకులకు గాయములకు ఈపాలు వాపుకలుగకుండుటకై పట్టింతురు. కాచబింబమును కంటి గ్రుడ్డునందలి యెదుటిభాగము **(Cornea)** వాచినపుడు పూవులు ఉపయోగింపబడును. నందివర్ధనపుపాలు వడగట్టి కంటి వైద్యమునందును వాడుదురు. ఈపాలునూనెతో తలమీద మర్దనచేయుటచే కంటిబాధలు నివారణఅగును. దీనివేరు, వేరుపట్ట నములుటచే పంటినొప్పులుమానును. నిమ్మరసముతో అరగదీసి ఉపయోగించుటవలన కాచబింబపువాపు, ఇతర కంటి జబ్బులు మానును. పండుటాకులరసమును వడగట్టి కండ్లలోవేసిన కలకలుమానును. పువ్వులను కండ్లకు అద్దుకొనిన చలవచేయును. కంటి ఎరుపులను తగ్గించును. మేలుచేయును. నీటితోకలిపి వేరునూరి ముద్దచేసి ఉపయోగించుటచే క్రిమినాశకమగును. నందివర్ధనపు పూలరసము నూనెతోకలిపి కళ్లకలక, కళ్లమంటలు, చర్మరోగములు వీనియందు వాడబడుచున్నది. ఇది శరీరకాంతిని కలుగచేయుననియు; పందికొక్కు విషమును హరించుననియు ధన్వంతరినిఘంటువునందుగలదు.




## మంగళహారతి

శ్రీమతి యస్. టి. పి. కృష్ణవేణమ్మ గారు

హారతిగైకొనుమా రాజగోపాలనీవు
కోరికలుతీరగను కోమలాంగులొసగు. హా
గోవులగాచునట్టి గొల్లకృష్ణుడవయి
గోపికలనుగాచిన గోవర్ధనోద్ధర. హా

ద్రౌపదిమానమును దయతోనుగాచినట్టి
దయజూచిభువిలోగల దాసులానుబ్రోచి. హా
ద్వారకావాస కృష్ణా దయతోనుబ్రోవుమయ్యా
ధరణిలోపల పదదాసి కృష్ణవేణిని. హా

## లాలిపాట

శ్రీమతి తిరువీధుల అనసూయా దేవి గారు

లాలియనిపాడరమ్మా లోలాక్షులారగుమిగూడరమ్మా మేలుగనుజూడరమ్మా మద్గురుని లీలగొనియాడరమ్మా.

కొమ్మమూడుపురంబులే పురములనుకోరిపడంతస్తులే
తొమ్మిదిద్వారంబులే అందునైదుగురుకావలివారలే. లాలి
నీలంపురామేడపై స్ఫటికములనిగ్గయినమేడగలదూ వాలాయముగ
దానిలో నొకతొట్ల వ్రేలాడుచున్నదమ్మ. లాలి
దిడ్డివాకిటపోయిన నాతొట్ల దివ్యముగకనిపెట్టునే అడ్డముగ
దొంగయొకడు కలడందు అతనిపోదోలరమ్మ. లాలి
నూరువిధికల్పములును మరియొక్క నూరుహరికల్పములును
నూరుశివకల్పములును పోయినను నూనముగ తానుండును. లాలి
యిదివరకుపుట్టలేదు యికముందు యిహమందునుదయింబునొందబోడె
నిదురయెట్టిదొకానడూ కలమేల్క మొదలంటజారనివ్వడు. లాలి
అందున్న బాలుడమ్మ బ్రహ్మాండమందెల్లనిండునమ్మ
సందేహమేలనమ్మ సచ్చిదానందస్వరూపుడమ్మా. లాలి
భువనజాలములెల్లను తనయందు పుట్టిగిట్టుచునుండును
భువనస్వరూపుడమ్మా యీబాలు నెవరెరిగికొలుతురమ్మ. లాలి



సినీమానటి 'మిస్ బేబి గార్బో'



సులోచనకన్య

రాణీరూపమతిఫిలుమునందలి ఒకదృశ్యము

By courtesy of Sound & Shadow.

# కీ. శే. కొమ్మారెడ్డి కమలాజగన్మోహిని

శ్రీమతి ప్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు

నిర్దుష్టమును నిర్మలమునునగు పవిత్రజీవయాత్రగడపిన సాధ్వీమణులలో స్వర్గీయ శ్రీకమలాజగన్మోహిని గారొకరు. నిస్వార్థదేశసేవకులయందు నత్యంతకీర్తిగాంచిన స్వర్గీయ శ్రీమాగంటి యన్నపూర్ణాదేవిగారికీయమ పినతల్లికూతురు. త్యాగధనులును, సుగుణాభిరాములునునయి అల్పవయసుననే కీర్తిశేషులైన శ్రీచెలసాని పట్టాభిరామయ్యగారికిని సాధుశీలయు సజీవయునగు శ్రీపట్టాభిరామమ్మగారికిని కమలాజగన్మోహిని ఏకమాత్ర పుత్రికారత్నము. కమలాజగన్మోహిని 18-9-1904 జన్మించెను.

జగన్మోహినితో నాకొకమారే అపరిచితస్నేహము. కాని యదియే దీర్ఘమైత్రిగ పరిణమించినది. ఆమె సాహచర్యము వాంఛనీయముగనుండును. కమలాసోదరి బాగుగచదువుకొన్నది. కాని యామె మంచివిద్యావతియని యెఱిగినవారరుదు. ఇంగ్లీషునందు 4-వ ఫారముమాత్రమే ముగించినదికాని చక్కని నిర్దుష్టమైన భాషాప్రౌఢిమగలది. హిందీపరీక్షయందు ప్రథమురాలుగ నుత్తీర్ణయయ్యెను. మాతృభాషయందు మంచి వైదుష్యముగలది.

1919 లో మహావైభవముతో శ్రీయుతులు కొమ్మారెడ్డి రామయ్యకారికిని జగన్మోహినిగారికి వివాహముజరిగినది. రామయ్యగారు దేశాభిమానము, విద్యాభిమానము, సంఘసంస్కారము, ఔదార్యహృదయము గల సుగుణపుంగవులు. పసిడికి తావియబ్బినట్లు వారిదాంపత్యము క్షీరోదకన్యాయమై చూడ ముచ్చటగనుండెడిది. వీరి కిప్పుడు ఒకఆడపిల్ల, 4 గురు మగపిల్లలు. బాలికను చిన్నప్పటినుండి మంచిశిక్షణముగల జాతీయవిద్యాలయమునందు విద్యచెప్పించుగొప్పకోరిక యామెకు దృఢముగనుండెడిది. అందుచే 7, 8 ఏండ్ల వయసుననే గుంటూరు శారదానికేతనమునకుబంపిరి. మగపిల్లలతోపాటు ఆడపిల్లలకు సంపూర్ణముగ యున్నతవిద్య కావలయుననుపట్టుదలగల స్వాతంత్ర్యప్రియులు. రామయ్యగారు మంచి భూస్వాములు. గొప్ప పలుకుబడి గలవారు. ఏలూరునకు 4 క్రోసులదూరమునందున్న పోతునూరు వీరిస్వగ్రామము. పోతునూరిలో ఇంతవఱకీమాత్రము ఉన్నతవిద్యనభ్యసించినస్త్రీలలో ప్రథములు జగన్మోహినిగారే. విద్యనుమించిన వినయముండుటచే బంధుమిత్రులకందరకు తలలో నాల్కవలెనుండెడిది. పెద్దలయందామెకు అత్యంతగౌరవము, భయభక్తులు గలవు. కుటుంబమునందమితసానుభూతి.

సోదరి యన్నపూర్ణాదేవివలె త్యాగశీలయై ధన్యురాలుకావలెనను నాశయ మామెయందు నిగూఢమైయుండెడిది. కాని తనప్రస్తుతవిద్యాసామర్థ్యములు చాలవనియు గార్హస్థ్యమునందే శక్తిసామర్థ్యములు ఎక్కువగగడింప ప్రారంభించినపని నిర్విఘ్నముగ నెరవేర్పగలసంకల్పము యుదాత్తమైనది. స్వవిషయమున మాత్ర మనుష్ఠేయములైనవి. ఇంకను కొంతకాలమైన నీసోదరిజీవించియున్న సోదరీలోకమునకును, సంఘమునకు అమూల్యోపయోగముగనుండెడిది. ఆమెవిద్యగాని, వివేకముగాని, ఔదార్యముగాని, సౌజన్యముగాని లోకమునకు బహిర్గతమగుటకు కాలములేదు. ఆమెనుజూచి తల్లి యానందించినంత యామెబిడ్డలగని యానందించునవకాశ మామెకు కలుగలేదు.

గర్భిణీసమయమున ఆకస్మికముగ నామెకు క్షయవ్యాధియంకురించి శీఘ్రముగవృద్ధియై భర్త, తల్లి, బంధుగులు ఎందరెన్నితిప్పలువడినను ఫలితములేకపోయినది. తుదకు మదనపల్లికిగొంపోయిరి. అక్కడ ఇట్టిస్థితిలోగూడ నామె ఎందరో ఆంగ్ల, క్రైస్తవస్త్రీలకుద్బోధించి వైద్యశాలలో పెక్కండ్రకు ఖద్దరుదీక్షనొసంగినదట. పిమ్మట మగశిశువునుప్రసవించెను. వెంటనే వ్యాధితీవ్రమయినందున స్వగ్రామమునకుదోడ్తెచ్చిరి. తుదకు పిన్నవయస్సుననే 27 ఏట ది 25-12-30 శాశ్వతపరంధామము గైకొననేగెను.

# దమయంతి ప్రేమము

శ్రీమతి ఆకెళ్ళ అన్నపూర్ణమ్మగారు.

పూర్వకాలమున హిందూదేశమున నెందరో ప్రఖ్యాతిగాంచిన నారీశిరోమణులుండెడివారు. వారిలో నొకతె బహుకష్టసుఖముల నోర్చిన పతివ్రతాశిరోమణి దమయంతి. విదర్భదేశపురాజగు భీమనృపాలుపుత్రి. ఆమెచిత్త మతిరమణీయమై ప్రభాతకాలంబున తొణుకు బెణుకు లేనట్టి సరస్సోదకముఖంబునుబోలె యతినిశ్చలమైనది. యుక్తవయస్సామెశరీరంబున నెచ్చటి యవయవంబుల నచ్చటదిద్ది సర్దుబాటు చేయుటజేసి యప్పుడేవిడిన పద్మమువలె వికసించుచున్నదామె జవ్వనము. ఉదయమునకు పూర్వము త్వరలో సూర్యబింబమును తన యుపరిభాగంబున ప్రతిఫలింపచేయు కుతూహలముతోకూడిన సరోవరంబును బోలినదామె మనస్సు.

చెలికత్తెలగూడి, ఉద్యానవనమున విహరించుచున్న దమయంతి ఫలవంతమగు చిత్తమును గుర్తెరింగినది రాజహంసము. ఉపకారపూరితమగు బుద్ధిసితయగు నారాజహంసము దమయంతి హృదయభూతలమున ప్రేమఅను విత్తులనాటి, మొలకలనెత్తించి, పతివ్రతత్వమను నుదకముచే పెంచి పెద్దగజేసి, ప్రేమఫలంబుల పండించి, ముందుయుగముల స్త్రీలచే నాఫలంబుల చవిచూపింప నిశ్చయించినది.

అందుకొఱకై రాయభారత్వమును వహించినది. మెలమెల్లన దమయంతిదరి చేరబారినది. ఆమెతో నలునిగుణగణముల ముచ్చటించినది. నలునిప్రతిబింబ మామెహృదయమున ప్రతిఫలింపచేసినది. ఉదయసూర్యుని బింబము నిశ్చలజలమున ప్రతిఫలించు సమయమున కన్పట్టుకాంతినిబోలు విచిత్రమైన కాంతి యామెయందు పొడచూపె.

పూర్వపుదమయంతి కాదిప్పుడు. ఎల్లప్పుడేదియో యాలోచనమె: రాజహంసము కొఱకు కాచియుండుటె: వేడినిట్టూర్పులతో కాలము వెళ్ళబుచ్చుటయె. తోడిచెలికత్తెలను కూడుట బొత్తిగమానివేసినది. ఏకాంతముగ నొక్కచోచేరి నలునిగూర్చి రాజహంసంబు వర్ణించినవర్ణనను స్మరించుకొనుచుండును. నిద్రమాలినది. బహు శుష్కించిన దామె.

ఆమె మనమున, తన హృదయము తోడుకోరుచున్నట్లొకక్రొత్తభావముద్భవించెను. నలునిహృదయ మామెహృదయమునకు తగినతోడని నిశ్చయించినది. ఏలాగుననైన తమ యిరువురి హృదయముల సమ్మేళనముజేసినకాని బ్రతుకు నిష్ఫల మనుకున్నది. ఈభావ సముద్రము రాజహంసము ప్రేరేపించుఅనురాగమను తుపానుచే, ఉపద్రవమగు మనోవికలతవలని చేష్టితములను యలలచే బహుభయంకరముగ చూపట్టుచున్నది. ఈమెకు నలుని యందుగల యనురాగము దినదినప్రవర్ధమానమై యయ్యది చూపరుల కొకవింతభీతిని పుట్టించుటచే వారలు యామె తల్లియొద్దకుబోయి యామెస్థితిగతుల చెప్పి యామెకు యుక్తవయస్సువచ్చుటజేసి పెండ్లిచేయమనిరి. ప్రేమము నెంతహృదయాంతరంగమునదాచి బీగము

వైచినను పరులకుదాని యునికి పొడకట్టకమానదు. నలునియం దామెకుగల యనురాగము దేవతలకుకూడ విశదమయ్యెను.

ఆమెహృదయము నొకక్రొత్తశక్తిలాగుచున్నట్లు ఆమెకు తోచినది. నలుని హృదయముదరికి లాగుచున్నట్లు బోధపడినది. వారిరువురి హృదయములు నేకమై భావగీతమును పాడవలెనను కుతూహలము చిత్తమున పొడచూపినది. అయ్యదియె ప్రేమగీతము. కుతూహలము అనుభవముకన్న యతిరమ్యమైనది. ప్రేమగీతికల నేకత్వమున పాడినదంపతులదేకదా పుణ్యము? ఏస్త్రీ తాను తన హృదయేశ్వరుతోగూడి బహుశ్రద్ధతో ప్రేమగీతల పాడునో యామెయెకదా పతివ్రత?

దమయంతికి నలునియందుగల ప్రేమాతిశయము బహుకష్టతరమైన పరీక్షలకులోనైనది. ఆమెయనురాగము దేవతలుకూడ నెరింగినవారై యారామె ప్రేమతత్వమును పరిశోధింప దలచి భీమరాజు తనపుత్రిక స్వయంవరంబునకు రాసంపిన యహ్వానము ననుసరించి విదర్భకే తెంచుచున్న నలునిగాంచి యాతని తమకును దమయంతికిని దూత్యముసలిపి యామెను వారిలో నొకరినైన వివాహమాడునట్లు చేయుమని నిరోధించిరి. వారి కోపభయంబుచే నలుడందులకియ్యకొనెను. వారొకయదృశ్యమంత్రము నాతనికి నుపదేశించిరి. దానిశక్తి ప్రభావంబున విదర్భరాజపుత్రి మందిరాంతరంగమును చొచ్చి యామె నేకాంతమున గనుంగొని తనసందేశము నామెకు తెలియపరచెను. సందేశమామె యచంచలత్వమున కేమాత్రమును కీడొనరింపజాలదయ్యెను. నిజప్రేమ మెప్పుడును మార్పులేనిది, నిశ్చలమైనది. దిక్పాలకులు భూమీశులు కెన్నియోరెట్లుమిన్నలు. ప్రాపంచకసుఖములులు నిజప్రేమను చలింపచేయజాలవు. పాకశాసనునిరాణియగుటకంటె ఆమె నలునిరాణియగుటకే ఇచ్ఛగించినది. ఆమెప్రేమ మెంతవర్ణనీయము!

# నిత్యయాత్రికుడు

కస్తూరి రాజమాణిక్యముగారు

ఈఅనంతమహావిశ్వహృదయసీమ
అమృతవేణుసంగీతపుటలలమ్రోతఁ
గరగి పులకింప ఎందుకోకాని లోన
నిత్యయాత్రావిహారాలు నెఱపుకోర్కెఁ
గదపునేదో ఉషాకలకంఠగళము.
ఎంతఆకలినుతేమిన దీయుషస్సు!—
ఎన్నిదుఃఖాలనలిగిపోయినది కుసుమ
పేశలమునాయెడంద; ఈవెట్టిబ్రతుకు
విజనసీమల దేనికై వెదకికొనును?
వెదకివెదకి తిఱిగితిఱిగి విసిగివిసిగి
అలసి జలభరనయనాల వెలుగుకలలు
ఏఅగాధాన కడకు లయించుటగునొ?
నేను గీతాలుకదిపిన తేనెచోటు
నాయెడదమ్రోతలయగల్పు వాయువీచిని;
అకట విడివడుతుదిచూపు పెకలునపుడు
ఒకరహస్యవిరహబాధ నుచ్చరించి
హృదయగర్భాన చేవెట్టిరెవరొ యేదొ
నింపుకొనిపోయి జలదరించినది లోన
దిశలుతిఱుగాడు నిత్యయాత్రికునకింత
వెఱ్ఱిమమకారమెందుకో వేగిరించు?

# బాలవిజ్ఞానశాఖ

౧. పాట

## సందెగొబ్బి

శ్రీమతి దామోజిపురపు తులసీదేవిగారు

చందమామ చందమామ ఓచందమామ
చందముఖిపిల్లలందరు నీలగిరికన్యలు
నీలగిరికన్యలకు నిండుపూలతోట
నిండుపూలతోటకు మంచినీళ్ల బావి
మంచినీళ్లబావికి మల్లెల్లతాడు
మల్లెల్లాతాడుబోయె బుడుగుబుడుగుమనంగ
బుడుగుబుడుగుమన్నచోట జీడిగింజదిష్టి
జీడిగింజదిష్టిపలుకు నేబట్టనేల
నేబట్టానేకుంటె మాచెలియకాదు
మాచెలియామాయక్క హద్దులుముద్దులు
హద్దులుముద్దులేనిచోట పానంగతీగె [లేవు
నల్లచామంతిపూలు నాలుగువేలుస్వామి
యెఱ్ఱచామంతిపూలు ఏడువేలుస్వామి
పచ్చచామంతిపూలు పాతికవేలుస్వామి
తెల్లచామంతిపూలు తేజస్తుస్వామి
ఆపూలూఈపూలు బండిగట్టించి
వెళ్లెనమ్మఆబండి శ్రీరంగంకడకు
శ్రీరంగంరంగనాయకులకు పూజచేయిస్తూ.

## పాతపాటలు

శ్రీమతి యన్. ప్రసూనాంబగారు

౧

చందమామఇల్లుకట్టి సారెపప్పుబళ్ళోబోసి
అమ్మానేచిన్నదాన్ని అల్లుడొస్తేఅంపబోను.

తోటల్లోవుండే ఆవుల్లారా గోవుల్లారా
అమ్మమ్మనీమొగుడి పేరేమిచెప్పు?
నీళ్లల్లోనిమ్మపండు పాలల్లోపనసపండు.

౨

ఆకోబాకో దామరబాకో
దామరాకుమీద వండ్లెండబోసి
కూడుకూడువండి కూటానబెట్టి
మాడుమాడువండి మాటానబెట్టి
అల్లవారింటికి చల్లక్కుబోతే
చల్లవారికుక్క కూడుముట్టిపాయ
కూడుముట్టినచోట కుంకమ్మురాలె
మాడుముట్టినచోట మల్లెల్లురాలె
మల్లెలమహారాజు తోటకట్టించె

3

చిట్లబొట్లకాయ సీమనెల్లికాయ
గొల్లపుచ్చకాయ కోలనిమ్మకాయ
అత్తకుపెట్టుదుఅల్లం
నేనూతిందుబెల్లం
కొత్తకుండల్లారా గోధుమల్లారా
పాతకుండలారా పసిబిడ్డలారా
పేపేగుఱ్ఱం పెండ్లికిపోయె
దామరగుంటకు నీళ్లువచ్చె
గార్‌గీర్ ఘల్లుమనె.

2. పద్యము

## పాపాయి

చిట్టా రామలింగశాస్త్రిగారు

పాపకన్నులలోను ముత్యాలతళుకు
పాపవన్నెలలోను బంగారుమెరుపు.
పాపాయిశ్వాసలో చందనముగలదు
పాపాయిపలుకులో సౌరభమువెలయు.
పలుకాడితే తేనె చిలికేటిపాపాయి
అందరీబళ్లోకి వెళ్లేటిపాపాయి
కన్నవారితోను మాట్లాడుపాపాయి
పిన్నలందరితోను పోట్లాడుపాపాయి
ఉంగతాగకఊం ..విసిగించెపాపాయి
పాలుకావాలనీ పీడించెపాపాయి
ఒప్పైనసుగుణాలకుప్ప మాపాపాయి.
పాపకీపల్కుల్లు నేర్పనీవారు
పాపాయిలీలలను చూడనీవారు
లేతగులాబీని లెక్కచేస్తారా?
పాపాయిగజ్జల్ల ఘల్...ఘల్ మోత
మురిపెంపుకృష్ణునీ మువ్వల్లమోతే
పాపాయినగవులో ముత్యాలువిరియు
ముత్యాలమెరపులో పాపాయివెలయు.
ఎదురుగావచ్చిన ఎవరైనకాని
పాపాయిపలుకులకె మారాడగలరా?
పాపాయిచేతులు చిటివేకాని
ఆటలకుమించంగ వేరేవికలవు?
ఆటలకు పాపకీ బొమ్మలున్నాయి
అందులోఓబొమ్మ కూతురవుతుంది
పాపాయినాడించ పదిమందిఐతే
పాపాయికూతురికి పాపాయెచాలు.
పాపాయికందరూ బావలవుతారు
పాపాయిజుట్టంత బంగారుకుచ్చు
పాపాయిగాజులూ భమిడిగాజుల్లూ
పాపాయినగవులు బోసినగవులు
పాపాయిచిట్టక్క పండంటిమోము
పాపాయివెలసింది ప్రమదమ్ముకొలుప.
పాపనూముద్దాడ భాగ్యాలుకలుగూ
పాపనూచూడగా సౌఖ్యమ్ములొదవూ
పాపాయిచక్కనీ పసిడిబొమ్మమ్మా!

3. కథలు

## అగ్రహారం పిల్లి

యు. వేంకటనరసుగారు

ఒకప్పుడు పిల్లికి చెవుడుపట్టిఉంటే చెవిలో పసురుపిండి చేపలపథ్యం పెట్టేడు తిమ్మన్న వైద్యుడు గారు. కాని చేపసరుకు అగ్రహారమందు యేదుకాణంలోను పిల్లికి లభించిందికాదు పాపం! పొరుగూరి మాలగూడెంలో పోలక్క అనే ముసలమ్మ అప్పుడె ఐదుచేపలు తెచ్చుకొని రెండువండి ఉట్టి కెక్కించి మూడుచేపలు మూకుట్లో ఉంచి మూంగిట ఎండ పెట్టింది. బిడాలంగారికి చెవుడైనా ముక్కు బాగా పనిచేస్తుంది గనక చుక్కానివేసినట్టు చక్కగా సాగిపోయింది ముసలమ్మ యింటికి దివ్యదృష్టితో. అవ్వ వక్కలాకులు రోటిలో లొటుకూలొటుకూమని దంచుకొంటూ పక్కన చేతికఱ్ఱవుంచుకొని గుడ్లు మిణకరిస్తూఉణ్ణింది గొంతుకూర్చోని. పిల్లిబావ సరాసుగా వెళ్లితే సందుపడేలా కనుపించలేదు గనుక చిక్కుడుపాదులో మకాంవేసి నిక్కి చూస్తూవుంది మీసాలు తీడుకుంటూ. అవ్వ యెంతసేపటికి కదల్లేదు.

చత్వారంపట్టి ఉండకుండా ఉంటుందా యింతముసలిముండకి అని తనలోయోచిస్తూ చేపలవైపు మెల్లగా నడిచిపోయి 'అగ్రహారం పిల్లినుండావాణ్ణి. అదాటుగా వస్తిని. ఇంత మత్స్యదానం చేసుకో ముసలవ్వా! మోక్షం వస్తుంది నీకు మ్యావ్ మ్యావ్' అనిందిపిల్లి. 'ఏమిటూశాస్త్రీకం? వెళతావా లేదా?' అని కర్రైతాటించింది ఘట్టిగా. 'అబ్బా బలే బిట్టుగాఉందే వ్యవహారం' అనుకోని మార్జాలం గోడమాటుకు పోయి మళ్లీవచ్చింది. సాధనమున పనులు సమకూడడం తెలిసిందిగనక. అవ్వ కన్నులపై చేతినడ్డముగా నుంచి చూచి 'తిరిగీవచ్చావ్?' అనింది కెదవులుబిగించి. 'వాచవియైనవో బాగయుండినవో మూచూచి పోనిమ్మా, ముసలమ్మనన్ను, మ్యావ్ మ్యావ్' అని నిక్కుతూ నంజుడుగాలి నాణెం చూడబోయేడప్పటికి దడిల్లని ముసలమ్మచేతికఱ్ఱ పిల్లిముడ్డికి మూరెడు దూరంలోవచ్చి పడింది. దానితో పిల్లి తల్లక్రిందుల పల్టీకొట్టి తలవాకిలిదాటుకొని తనతల్లికడుపుచల్లదనం దలంచుకుంటూ అగ్రహారం బాటబట్టింది. అక్కడికిపోయి అంతటితో మానిందా ఆప్రయత్నం? చింతచెట్టుమీది ఆసామిని సైగచేసి క్రిందికి పిలుచుకొని మంత్రాలోచనం జరిపి యిరువురు ఒక్కమాటుగా మాయమై పోయినారు. ప్రారబ్ధార్థము లుజ్జగింపరనుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్ అంటారుగదా! ఇక్కడ పోలక్క పిల్లినాబట్టపోరు పడలేనమ్మా, అని గొణుగుతూ చేపలను మఱింత చేరువగావచ్చి కావలికూర్చుండి చుట్టింటిచూర్లో ఎవడో తొంగిచూడడం కనిపెట్టి లేవబోయింది. 'పెట్టిపోయని ధనము పెట్టెలోగలదని మిట్టిపడియెదవేల ముండా; ఉట్టి తెగిపోజేయనున్నాడు పైయముడు ఊగులాడెదవేల కుండా బ్రావ్ బ్రావ్' అని పాడుకుంటూ బిడాల బ్రహ్మచారి తలవాకిట హాజరైనాడు మూడవదఫా. 'తాళు తాళు నీతల్లిసిగ్గొయ్య బుద్ధిచెప్పిస్తా మనముసా-ట్రూయ్ ఉజ్జా' అని కేకవేసింది పండ్లుకొఱుకుతూ ముసలమ్మ. తక్షణం యెక్కణ్ణుంచి వచ్చిందో దిక్కుమాలిన మొండికుక్క మెఱుపులాగ వచ్చి పిల్లిమీద అమాంతంగా పడింది. పిల్లిపోయి అవ్వమీద పడింది. అవ్వ అల్లాడుతూ దొర్లి దొంతికుండలమీద పడింది. ఇదేసందని తిమ్మన్నవస్తాదు మూకటిమీదపడి మూడుచేపలు మొత్తంగా యెత్తుకొని ఒక్కలగువుతో తనచింతచెట్టు మీదికి ఉడాయించాడు. ముహూర్తకాలం గడిచిన తరుపరి పిల్లిబావ గోటిగిచ్చులతో శరీరమాద్యంతం కుంకుమపూజ చేయించుకొని సొక్కుతూ, సోలుతూ పోయి కోతిని చూచి కంటతడిపెట్టుకుంది. 'మనం వెళ్లింది రాహుకాలం, ఐనా పర్వాలేదు ఇది మాపటి భోజనంలో పథ్యంచెయ్యి, అన్నిబాధలు నివర్తిస్తాయి' అని ఒక చేపను క్రింద పడవేసింది వైద్యరత్నంగారు. పిల్లి ఆప్యాయనంగా ఆపదార్థం సంగ్రహించి నెమ్మదిగా వంటఇంటి తలుపుచాటునకు వెళ్లి కర్యూ కర్యూ మని కొఱికి సాపడుతుండెను. అసద్దువిని రెంకమ్మవ్వ వచ్చి వంగి—చూచి 'వెధవా! బాపనకూట్లో బజ్జికలుపుతున్నావా?' అనింది చెవిమీద చేటతో తాటించి. 'గుఱ్ఱు—మని నిప్పుకండ్లతో చూచింది రెంకవ్వకేసి పిల్లి. అవ్వ హడలిపోయి ఉజ్జా—ఉజ్జా—మంత్రోచ్చాటనం సలిపింది మహాకోపంతో. ఈ భైరవప్రళయం తప్పించుకోటం సాధ్యంకాదని యిల్లువదలి పెట్టి శాఖామృగస్వామివారి కైంకర్య మొనర్చి బహుకాలమునకు వారికటాక్షంచేత వృక్షారోహణవిద్య సమగ్రముగా గ్రహించి ఈలాంటిచిక్కులు తటస్థించినపుడు తటాలున చెట్టెక్కి ఆత్మరక్షణం చేసికోవడమేగాక తనసంతతికంతా ఈవిద్య వెదజల్లి ఆచార్యపీఠం అధిష్ఠించింది అగ్రహారంపిల్లి. అప్పట్నుంచి పిల్లి చెట్లెక్కుతూందంటారు.

## పోతురాజు చెప్పినకథ

శ్రీమతి చావలి బంగారమ్మగారు

మా జవానుతండ్రి పోతురాజనే ముసలాణ్ణి కథ చెప్పరాఅంటే ఇల్లాచెప్పేడు:
నాలాంటివాడే మొగుడండి. నాపెళ్లామంటిదే పెళ్లామండి. ఇద్దరూకలిసి పుల్లలకెళ్లారండి.

పుల్లలట్టుకుని తిరిగి ఇంటికొస్తుండేటప్పుడు తాడిచెట్టుమీద తేనెపట్టు కనిపించిందిట. అది చూసి, పుల్లలమోపు దింపుకొని, చెట్టెక్కి తేనెపట్టుతీసి మొగుడు తింటున్నాడంట. పెళ్లాం నాక్కూడా కాస్త పెట్టమందిట. 'ఆడతాడిమీదపట్టిన తేనెపట్టు ఆలితినకూడదులే' అన్నాట్టండి. 'పోతుతాడికింద కూచుని తేనెపట్టుతిన్న నామొగుడుకి జబ్బుచేయకుండావుంటే, పోలేరమ్మకు పోతుమేకని బలియిచ్చి, పుట్టకు జొన్నలు కుడుములువండి నైవేద్యం పెడతా'నని మొక్కుకుందండి. ఇంటికెళ్లి బాగున్నంగదాఅని మొక్కుబడి తీర్చిందట మొగుడు ఇంట్లో లేకుండగానే. ఇంతట్లో మొగుడొచ్చి 'పోతుమాంసం కూరా, కుడుములూ నాకేవే!' అన్నాట్ట. 'వాస్! వూరుకో మొక్కుబడి పోతుమాంసం మొగుడు తినకూడదు. ఇంకోపాలి వండుతాన్లే' అందిట.

## శివరాత్రిఒక్కపొద్దుకథ

యస్. వి. రత్నముసెట్టిగారు

అనగాఅనగా ఒకవూరు. ఆవూళ్ళో ఒకచింతచెట్టుమీద ఒకకోతివుండేది. ఆకోతికి శివరాత్రి ఒక్కపొద్దువుండాలని బుద్ధిపుట్టింది. రేపుశివరాత్రిగావుంటే కోతి యీాదినంతలచుకొన్నదేమంటే, "నేను రేపు ఒక్కపొద్దువుంటాను. ఈచెట్టుమీదనే కూర్చొనివుంటే చింతకాయలు తినాలనే బుద్ధిపుట్టుతుంది. గాన రెండుమైళ్ళదూరమావలపోయికూర్చుండి వుండిన యాబుద్ధిపుట్ట"దనుకొని తక్షణమే యచ్చటినుండి బయలుదేరి రెండుమైళ్ళకావల పోయికూర్చుండి మరల ఇట్లుదలచెను. "నేను యిప్పుడు ఇంతదూరం వచ్చివేసినాను. రేపంతా వుపవాసంవుంటే ఈరెండుమైళ్ళదూరం నడచుటకు నాకుశక్తిలేకపోయినచో నేనేమి చేయుదును" అనిదలచి మరలచింతచెట్టుజేరెను. చెట్టుయొద్దజేరి యిట్లుదలచెను. "రేపంతా వుపవాసంవుండడంచేత మర్నాటికి చెట్టెక్కుటకు బలంలేకపోయినచో నేనేమిచేయుదు"నని తలచి చెట్టెక్కి చెట్టుమీదకూర్చుండెను. మరల "కాయలుకోయుటకు బలములేనిచో నేమి జేతునని"దలచి కాయలన్నీకోసి ప్రోగుచేసుకొనెను. మర్నాటికి నిండాఆయాసముచేత "కాయలు చేతిలోఎత్తుకొని నోటిలోవేశికొనుటకుగూడ కానిచో ఏమిజేతు"ననిదలచి నోటిలోవేసుకొని మరల నమలుటకగునో లేదోయనిదలచి నమలెను. ఇంతకష్టపడియును మ్రింగుటకగునోలేక ఏమగునోయని మ్రింగివేసెను. కథకంచికి. మనమింటికి.

## గ్రుడ్డివాడు, చెవిటివాడు

శ్రీమతి తుమ్మలపల్లి హైమవతిగారు

చాలాసంవత్సరములక్రిందట ఇద్దరుస్నేహితులుఉండెడివారట. వారిలో ఒకడు గ్రుడ్డివాడు. రెండవ వాడు చెవిటివాడు. ఒకరోజున వారిద్దరుకలసి ఎక్కడో ఆటఆడుతుంటే చూచుటకువెళ్ళిరి. గ్రుడ్డివాడు ఆహా! పాటఎంతబాగున్నదిఅని అనెను. చెవిటివాడు ఆహా! నృత్యముఎంతబాగున్నది అనెను. ఆట, పాటలుఅంతా అయినతరువాత గ్రుడ్డివాడు "మనమిద్దరము భాగస్థులమగుదము. నీవు ఏమిచూచినదనుసరే నీవుచెప్పు. నేను ఏమువిన్ననుసరే నేనుచెప్పెద"ననెను. అప్పుడు చెవిటివాడు ఒప్పుకొనెను. ఒకరోజున వాళ్ళుఅడవికివెళ్ళి

ఒక గడ్డిమేయుచున్న గాడిదనుకలసికొనిరి. దానిమీద ఒకకుండఉన్నది. ఇది మనఅదృష్టమని చెవిటి వాడుఅనెను. గ్రుడ్డివాడు ఏమిటి? అనిఅడిగెను. అప్పుడు వాడు నేను ఒక గాడిదనుచూచితిని. దీనికి యజమానులెవ్వరునులేరు. కాబట్టి మనముతీసికొందము అనెను. ఆకుండను గ్రుడ్డివానిమీదపెట్టి వాడు దానికిత్రాడుకట్టి ఆదారిని వెళ్ళుచుండిరి. ఆలాగావెళ్ళుచుండగా చెవిటివాడు కొన్ని భయంకరమైనచీమ లనుచూచెను. అవికొన్ని తీసుకొందమనిచెప్పి వాడిజేబులోనున్న వెండిడబ్బాతీసి దానికినిండుగ చీమలను వేసెను. ఆలాగ వారిదారిని వారువెళ్ళుచుండగా ఒక పెద్దతుపానువచ్చెను. వారిద్దరును అక్కడ ఒక ఇల్లుఉంటే అందులోనికివెళ్ళిరి. ఆఇల్లు ఒకరాక్షసునిఇల్లు. ఆరాక్షసునికి మనుష్యులనుచంపి తినుట ఎక్కువ ఇష్టము. చెవిటివాడు స్నేహితుని లోనికిఈడ్చుకొనివెళ్ళెను. ఇనుముతో చేయబడినతలుపులను మూసి వైచెను. వాళ్ళు, ఆగాడిద అందరు సురక్షితముగానున్నారు. అప్పుడు వారు ఒకభయంకరమైనశబ్దమువినిరి. ఆరాక్షసుడు తలుపులువేసిఉండుటచూచి ఎవరు? అందులోఉన్నవారిదేహము నరికివేశెద, ఇందులో మనుష్యులున్నారు, తలుపుతెరవమని గోలచేశాడు. ఆశబ్దము వినుటకు వారు చాలాభయపడిరి. వాడు చాలాభయంకరముగానుండును. వాడియొక్క పొడుగు పండ్రెండుఅడుగులు. వాడిచెవులు ఏనుగులచెవులవలెనుండును. ఆచెవిటివాడు చిన్నరంధ్రమునుండిచూచి భయముతో ఒణికిపోయెను. వాడు నీవెవరనిఅడిగెను. వాడు నేను ఈఇంటియొక్క యజమానునిఅనెను. అప్పుడు ఆగ్రుడ్డివాడు నీవురాక్షసవా? అయితే నేను రాక్షసుని తండ్రియగు రాక్షసుడను. తండ్రిపైకి కొడుకు ఎప్పడికి దెబ్బలాటరాకూడదు అనెను. నీవునాతండ్రివా? నాకు తండ్రివన్నసంగతి నాకుతెలియదు అనెను. రాక్షసుడు ముఖముచూపుమనిఅడిగెను. చెవిటివాడు గాడిద ముఖమునుమాత్రము చిన్నరంధ్రమునుండిచూపెను. నీదేహమును చూపెదవా? అనెను. వారు ఆకుండను చూపిరి కాని నాకు నీశబ్దంవినవలెనని కోరికగాఉన్నదిఅనెను. వాడు గాడిదతోకనుగిల్లెను. అప్పుడు ఆగాడిద అరచుటకు మొదలుపెట్టెను. రాక్షసుడు నీవు ఇక్కడనేఉండుతండ్రీఅనిచెప్పి వెళ్ళిపోయెను. తరువాత రోజున వారు లేచునప్పటికి నేలంతయు వజ్రములు, బంగారముతోనిండిఉండెను. అప్పుడు చెవిటివాడు మనముతప్పక గొప్పవాళ్ళయ్యెదము అనెను. వాళ్ళు ఆబంగారము, వజ్రములు కుండకుసగమునకువేసి తరువాత కొంతమూటకట్టుకొనిరి. వారిద్దరుకలసి ఒకమైలుదూరమువెళ్ళిరి. అప్పుడు చెవిటివాడు వెనుకకుతిరిగి చూడగా నలుగురురాక్షసులు వచ్చుచుండిరి. అప్పుడు వారుభయమొంది ఒకచెట్టుఎక్కిరి. రాక్షసులందరు ఒకరిమీదనొకరుచొప్పున నిలువబడిరి. వారు కొన్నిచీమలనుతీసి వారిచెవిలోనికిప్రాకించిరి. వారందరుఏడ్చి వారిదారినివారు వెళ్ళిపోయిరి. తరువాత గ్రుడ్డివాడు, చెవిటివాడు ఇద్దరుకలసి వారిసొంత ఊరుకు వెళ్ళి అక్కడ ఇల్లుకట్టుకొని సురక్షితముగానుండిరి.

౭. భూగోళ శాస్త్ర కథలు

## వెన్నెలయ్య

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

భూమమ్మముద్దులకొడుకగు వెన్నెలయ్య గుండ్రనిముఖముకలవాడు. మిక్కిలి సౌందర్యవంతుడు. అందమునకు పోలికతెచ్చుకొనఁదగినవాడు. మొగముపైనఁగల పుట్టుమచ్చ అతనిముఖమునకుఁగల చక్కదనమునకేమియుఁ గొరతగలిగింపలేదు. వెన్నెలయ్యకు తలిదండ్రులయందు అత్యంతగౌరవమును భక్తియునుగలవు. వారివంశాచారప్రకారము అతడు గురువులకు ప్రదక్షిణముచేయుచు (నెలకొకసారి) వినతులొనగుచుండును. ఇదివరలోవ్రాసి

నట్లు వెన్నెలయ్యకు దురదృష్టవశమున క్షయరోగ మొకటి యతనిదేహమునం దంకురించినది. పాపము భూమమ్మ యతనిక్షయరోగమునకు దానే కారకురాలేమోయనిఅనుకొని చింతించుచుండును. ఏలయనగా పూర్వ మొకనాడు భూమమ్మయు, ఆమెతండ్రిగారైన లోకమిత్ర మహారాజులుంగారును, ఇతరబంధువులును నొకచోటకూర్చుండి ఇష్టాగోష్ఠి సలుపుచుండిరి. ఆసమయమున వెన్నెలయ్య చిన్నపిల్లవాడుగానుండి తల్లిచుట్టుతిరుగుచుండగా ఆమెక్రీనీడ అతనిపై బడెనట. ఒకరినీడ మరొకరిపై బడినపక్షమున క్షయరోగమువచ్చునని నమ్మకము లోకములో వ్యాపించియుండుటచేత భూమమ్మకు అనుమానముండి ఆమెకు ఎడతెగనివిచారముకలిగించినదాయెను. వెన్నెలయ్యముఖముమీద పుట్టుమచ్చను కవులుకూడ కుందేలుగా భావించి తమకావ్యములందు వింతవింతవర్ణనలుచేసిరి. ప్రతిపూర్ణిమకు అతనిముఖము నిండుకాంతితోనొప్పుచున్నను అమావాస్యకుమాత్ర మతనిక్షయరోగ మెక్కువై శరీరము శుష్కించి నల్లబడి రాత్రి చీకటిలో నతనిగుర్తించుటయే దుష్కరమన్నట్లుగానుండును. దీనికిఁదోడు సంవత్సరమున కొకటి రెండుపర్యాయములు పున్నమదినమునగూడ క్షయరోగ మకస్మాత్తుగా గానవచ్చి అతనిశరీరములో గొంతభాగమునుగాని అంతనుగాని నలుపుగా చేసివైచును. అయినను జ్యోతిష్కులతనిని బూర్ణాయుష్మంతుడని యేకగ్రీవముగా తీర్మానించినందున భూమమ్మకుఁగొంత సంతసముగలదు. మాతామహసంబంధమైనవర్చస్సు అతని ముఖమునఁగానబడి ఇతరులపై నది మరల చల్లనికాంతిపుంజములను వెదజల్లుచుండుటవలన లోకులకు వెన్నెలయ్య మనోల్లాసకారియయ్యెను. చంటిబిడ్డలతనిని చందమామయని పేరు పెట్టిపిలుచుచుందురు. పిల్లతల్లులు తమబిడ్డలకు చందమామరావె జాబిల్లిరావె యను ముద్దు పాటలుపాడి వారినాడించుచుందురు. ఇట్లుచెప్పదలచిన వెన్నెలయ్యమీద ఒకపుస్తకము వ్రాయదగినన్ని ముచ్చటలు చెప్పవచ్చును. మగవారలేకాని ఆడవారలేకాని సౌందర్యవంతులగుట తటస్థించినపక్షమున పడుచుదనములో వారిమీద అనేకముకిట్టనిమాటలుపుట్టించుట పామరులైనలోకులకు అలవాటుకాబట్టి అట్టినిందనుండి వెన్నెలయ్య తప్పించుకొనలేకపోయినాడు. వెన్నెలయ్య పెద్దవాడైనప్పు డతనికి రోహిణియనునొక సౌందర్యవంతురాలనునిచ్చి పెద్దలు వివాహముచేసిరి. ఆమెకు తారయను మరొకపేరుకలదు. ఆమె యొకచక్కనిచుక్క. ఆమెపేరుగల మరొకవనిత బృహస్పతికి భార్యయైయుండెను. వెన్నెలయ్య తనవిద్యార్థిదశను బృహస్పతి యింటగడిపినందున ఆయనభార్యయైన తారనువలచి గురుద్రోహముచేసినాడని అతనిని కొందరు కుకవులు దూషించిరి. గురువుగారిశాపమే ఆయన యిప్పటిక్షయరోగమునకుఁగారణమని పౌరాణికులనమ్మకము. వెన్నెలయ్యపాలించు దేశము భూమమ్మయుండు దేశమునకు దగ్గరనున్నదని యదివర కొకవ్యాసములోఁ దెలిపియున్నాను. అతని పరిపాలనాకార్యమంతయు రాత్రులందుజరుగుట వింతలలోనొకవింత. అతనిదేశములోనుండు కచేరీలన్నియు రాత్రులు తెరువబడి పగలు మూయబడును. అతఁడు రాచకార్యము లెక్కువగానున్న దినము

లలో రాత్రిమాత్రమేగాక పగలుగూడఁబనిచేయుచు చాలసేపువరకు మేలుకొనియుండును. అట్టిసమయములం దతనితాతగారైన లోకమిత్రమహారాజులుంగారుచూచి "అబ్బాయీ! ప్రొద్దెక్కువరకు మేలుకొనకురా" అని మందలించుచుందురట. ఎట్లయినను వెన్నెలయ్యవంటి సుగుణవంతునికన్న భూమమ్మకడుపు చల్లనికడుపు.

౫. బుద్ధిపరీక్ష

# చిత్రప్రశ్నలు

మార్చి 10-వ తేదీలోపున ఈ చిత్రప్రశ్నలకు సరియైన సమాధానమును లేఖాముఖమున మాకు తెలుపువారినామములను పైమాసపు గృహలక్ష్మిలో ప్రచురింతుము.

౧

పట్టిసపు శ్రీరామమూర్తిగారు

అష్టవర్షప్రాయమగు బాలనేమండ్రు
వసుధలో కాసారివస్తువేది
మనుజులకెయ్యది మానంబుగాచును
కుంభకర్ణుం డేది కోరుచుండు
పైరుకోతలకు నేర్పఱచెడుమితియేది
ఇల దంతధావన కేదితగును
వరపతివ్రత నిజపతికెంత దవ్వుండు
వేడికేమగు వస్తువితతియెల్ల
వర్ణములసంఖ్య సమము జవాబులందు
ఆదితుదియైన తుదియాది యైనగాని
శబ్దమందలి యర్థమ్ము సరిగనుండు
దీని భావమ్ము తెలుపుఁడీధీరులార!

౨

సూరి రామసుబ్బరాయ శాస్త్రిగారు

సంపదాపదలందు సమతనెవ్వఁడుగను?
కలకంఠిపల్కులఁ గలదదెద్ది?
వామదేవుం డెద్ది వసనముగాగొనె?
ద్రుంచె సుందోపసుందులనదెద్ది?
ఎద్దానిఁదలిసిన నెల్లలోకముమిథ్య?
వాసుదేవుఁడు కేల మోసెనెద్ది?
పితృదేవతానాథు పిన్నసైదోడిల
వాహినీరూపియై వరలెనెద్ది?
అన్నిటికిఁజూడమూఁడేసి యక్షరములె
అమరనుతయగునాదివర్ణములఁగూర్ప
ప్రకృతియనిపల్కుదురు తత్వపరులు, దీని
భావమెట్టిదో తెలిసినవారె ఘనులు.

## జానకీదేవి

నరహరిసెట్టి శేషగిరిరావుగారు

అలరించినావమ్మ ఆత్మజనకులను
సౌందర్యమూర్తివై జనసమంది
తలపించినావు ప్రాక్తనవిదుషీమణీ
సమితిని బుద్ధికౌశలమునందు
వెలయించినావు జీవితనాథు భవదీయ
మహనీయసుగుణసంపదలచేత
తులయించినావు సత్పుణ్యాంగనాశీల
మున నీదు సత్ప్రవర్తనము తల్లి!
భాగ్యవతివి, విదుషివి, పావనచరిత్ర
వతులశాంతమూర్తివి, బహుదయాస్వభావ
వమ్మ జానకి! నీకథ యఖిలలోక
మందు సువర్ణాక్షరాల వ్రాయంగవలదె?




## ప్రశ్నోత్తరములు

శ్రీమతి సుంకర పార్వతీదేవిగారు

పిల్లినెంతవరకుతోలేవు?
గోలకొండవరకు—
గోలకొండఏమిచ్చింది?
గుడ్డిగవ్వ—
గుడ్డిగవ్వఏమిచేశావు?
నూతిలోవేశాను—
నుయ్యిఏమిచ్చింది?
నీరు—
నీటినిఏమిచేశావు?
చెట్లుకుపోశాను—
చెట్లుఏమియిచ్చాయి?
కాయ! పింజ—
కాయ, పింజ ఏమిచేశావు?
అవ్వకు, తాతకుయిచ్చాను.
అవ్వ, తాత ఏమిచ్చారు?
ఈని! పేని—
ఈని, పేని ఏమిచేశావు?
దూలంపైనొక్కేను—
దూలంఏమిచ్చింది?
చెక్కపేడు—
చెక్కపేడుఏమిచేశావు?
పొయ్యిలోపెట్టేను—
పొయ్యిఏమిచ్చింది?
పొయ్యిబుగ్గి—
పొయ్యిబుగ్గిఏమిచేశేవు?
పెంటమీదవేశాను—
పెంటఏమిచ్చింది?
గరికి—
గరికిఏమిచేశావు?
ఆవుకేశాను—
ఆవుఏమిచ్చింది?
పాలు—
పాలుఏమిచేశావు?
పాలు పరమాన్నంవండి
నేనుకొంచెంతిని నీకుకొంచం
దాచాను. అది పిల్లితినేసింది.
అంచేత గోలుకొండవరకు తగిలే
శాను. దానిని యిప్పుడునేను.

## ఆటకూతలు

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు

(ఆడపిల్లలు ఆటలాడుకొనునప్పుడు కూయుకూతలు)

అక్కలకర్ర
మొక్కలపీట
కూచోవదినా.

సూరీగుమ్మడికాయ
సూరమ్మతలకాయ
తలకాయతంకాయ.

సూదిలోదారం
సుబ్బక్కపెళ్లి
పెళ్లీపెళ్లీపెళ్లీ.



**రాజమండ్రీ కళాశాల.—**

“మద్రాసురాజధానియందు విద్యాశాఖలో వ్యయకర్తనము చేయు సంకల్పముతో సంబంధముగల వారిని, వారుగావించిన కొన్నిసూచనలయందు ప్రదర్శింపబడిన వారితెలివిని మేము అభినందింపజాలము. రాజమహేంద్రవరమునందలి చిరప్రతిష్ఠితమైన గవర్నమెంటుకళాశాలవంటి సంస్థను సమాప్తము చేయు ప్రయత్నముండుటకు మేము అబ్బురపడుచున్నాము. తెలుగుజిల్లాల విద్యాజీవితమునందు రాజమహేంద్రవరము వత్సరములుగా ప్రథితకీర్తి నార్జించియున్నది. ఇపుడు ఉన్నతవిద్యాసంస్థలేని నగరముగా దానిని గూర్చి చింతించుట దుర్భరము. ఆపట్టణము విద్యాసాహిత్యములకు పంటపొలమైన ఒకగొప్ప ఆంధ్ర సామ్రాజ్యమునకు రాజధానియై ఉండిన దొకప్పుడు. ఇప్పు డది వత్సరములుగ తనదైయుండిన కళాశాలను నిలుపుకొనుటకు ప్రార్థనలు, విజ్ఞప్తులు అవలంబింపవలసివచ్చినది. ఈ విషయమై అప్పుడే కొంత అలజడి కలిగినది. కావున ప్రభుత్వమువారు ఈ కళాశాల ఎత్తివేతను మానివేతురని ఆశింతుము.”

—*The Educational Review.*

**మదరాసు గౌరవ స్త్రీ న్యాయాధిపులు:—**

“మదరాసునగరగౌరవన్యాయాధికారులు (Honorary Magistrates) లో నీతడవ హిందూ నిమ్న జాతియువతి యన్. శివరాజుగారిభార్య నియమింపబడుట సంతోషము. ఇంతవఱకు నీ గౌరవము నిమ్న జాతి స్త్రీసంఘమునకు గలుగలేదు. ఈ సందర్భములో గవర్నమెంటువారిని, శివరాజుసతిని అభినందించు చున్నాము. మఱియు మహమ్మదీయసంఘముపక్షమున యాకూబు హుస్సేనుగారి సతి నియమింపబడుటయు, మహమ్మదీయ స్త్రీ ఘర్షాలేక నిట్టిపబ్లికుసంస్థలలో పాల్గొనసంకల్పించుట ప్రశంసనీయము. —దీనబంధు.

**టిక్కెట్లు తనిఖీ చేయు విధము:—**

“టిక్కెట్టుకలెక్టరు మొదటితరగతిప్యాసెంజరుతో ‘అయ్యా! వందనములు. మీటిక్కెట్టును నేను చూడనగునా?’—రెండవ తరగతి ప్యాసెంజరుతో ‘దయచేసి టిక్కెట్టు చూపండి.’—ఇంటరు తరగతి ప్యాసెంజరుతో ‘మీ టిక్కెట్టు ఎక్కడ?’—మూడవ తరగతి ప్యాసెంజరుతో ‘టికెట్, టికెట్.’

—*The Indian Labour Journal.*

**బరోడా రాష్ట్రమున విద్యాభివృద్ధి:—**

“**1929-30** సంవత్సరపు బరోడారాష్ట్రపరిపాలన నివేదికయందు ఆరాష్ట్రమున విద్యాభివృద్ధి ఇతర స్వదేశసంస్థానములయందుకంటెను, బ్రిటీషు ఇండియాయందుకంటెను హుటాహుటినడలతో సాగి

యున్నదని చదువుటకు సంతోషించుచున్నాము. స్కూలుకు పోదగిన వయస్సుగల బాలురలో నూటికి 91. 9వఱకు పాఠశాలలయందుండిరి. బాలికలలో నూటికి 64. 6 వఱకు పాఠశాలలయందుండిరి. మొత్తపుజనాభాలో నూటికి 10. 8 వఱకు విద్యనందుచున్నారు. బ్రిటీషుఇండియాలోని సగటు విద్యార్థులసంఖ్య కంటె ఇది హెచ్చుగానున్నది. బరోడారాష్ట్రమున విద్యకొఱకు ధనవ్యయము క్రమముగ హెచ్చింపబడుచున్నదనుటకు క్రిందిఅంకెలు చాలియున్నవి. 1906లో 6 లక్షలు; 1910లో 13 లక్షలు; 1915లో 16 లక్షలు; 1920లో 22 లక్షలు; 1925లో 29లక్షలు; 1930లో 34 లక్షలు. ప్రతిభారతదేశసంస్థానమును తమ పరిపాలననివేదికలయందు ఏటేట ఇట్టి విద్యాభివృద్ధి చూపగలుగుగాక యని కోరెదము."

—*The Educational Review.*

**కమ్మవారినును గుడుపులు :—**

"సాధారణముగా వివాహానంతరము ఆసంవత్సరములోపల కమ్మవారిలో అత్తవారిండ్ల పెండ్లికుమారుడు కనీసము మూడుమాసములయిన ఉండుటాచారము. హిందూమతసాంప్రదాయము ననుసరించి బహుశః వివాహమునకు పూర్వము ఈ వధూవరు లొకరినొకరు చూచియుండరు. ఒండొరుల ప్రేమించియుండరు. ఒక్కసుముహూర్తమాత్రమున నాటబడిన ఈప్రేమాంకురములను పోషించుకొనుట కీవిశ్రాంతియెంతయు తగినది. ఒకజాములో శంఖుస్థాపనచేయబడిన ప్రేమసౌధమునకు వధూవరులచూడ్కులుకలిపి హృదయములజేర్చి ప్రేమావలోకనములనెడి పునాదులు వేయు రోజులివియే." —అట్లూరి రామశేషయ్య.

**మాఘమాసము; శివరాత్రిమహిమ :—**

"మాఘమాసము స్నానదానములకు శ్రేష్ఠమైది. ఈమాసములో బ్రాహ్మణులు అరుణోదయముననే లేచి కాల్యకృత్యములు తీర్చుకొని నదులకువెళ్ళి స్నానముచేసి మాఘమహాత్మ్యమును చదువుదురు. ఈ మాసము కడవరకు ప్రతిదినమును ఒకఅధ్యాయము చదువువారు బ్రహ్మహత్యాది ఎన్నిమహాపాతకములున్నను స్నానము చేసినంతమాత్రముననే పరిహారమగునట్లు చెప్పియున్నది. మఱియు ఈమాసమున సదరు పాతకములు పోవలసినకాలము వచ్చెనేయని దుఃఖించుచుండునట. అందువలన స్త్రీపురుషులెల్లరు ప్రాతఃకాలమున వేనవేలుగ కావేరి, గంగ మొదలగు మహానదులలో స్నానములుచేసి దానములు చేయుచుండుట, మాఘమహాత్మ్యమును వినుట, స్త్రీలు ఇసుకతో గౌరీదేవినిచేసి పూజించుట, చూడ కనులపండువుగానుండును. ఈనెలలో రథసప్తమి యొకగొప్పపర్వదినము. ఈదినమున జనులందరు జిల్లేడు ఆకులను నెత్తిని పెట్టుకొని స్నానము గావించి పితృదేవతల ప్రీతికై తర్పణములు చేసెదరు. భీష్మఏకాదశి మఱియొకపర్వదినము. శివాలయములలో గొప్పఉత్సవములు జర్గును. మఱియొక పర్వదినమగు వ్యాసపూర్ణిమయందు మాఘమహాత్మ్యమును చెప్పునట్టి బ్రాహ్మణులకు మంగళవాద్యములతో దంపతిపూజలుసల్పి బ్రాహ్మణసమారాధనలు చేసెదరు. గౌరీపూజచేయుస్త్రీలు ముత్తయిదువులకు వాయనముల నిచ్చెదరు. ఈ మాసమునందలి అన్ని పండుగలలోనికిని శివరాత్రి గొప్పది. శివరాత్రిమహావ్రతమును, శివపూజయు, సకలశివక్షేత్రములలో జరుగుచున్నప్పటికిని శ్రీకాళహస్తి, శ్రీశైలము, గోకర్ణము, మహానంది అను నీనాలుగు స్థలములందు విశేషముగా జరుగుచున్నది. శ్రీకాళహస్తిక్షేత్రము పంచభూతమహాలింగస్థలములనబడు నైదుపుణ్యస్థలంబులలో నిది వాయుస్థలము. కావున నీక్షేత్రమునందు శివరాత్రివ్రతము నాచరించువారికి సకలాభీష్టములు సిద్ధించును. శ్రీ కాళహస్తిక్షేత్రము దక్షిణకైలాసంబని పురాణప్రసిద్ధము. శివరాత్రియనునది వ్రతదినమును, పరమశివుని ధ్యానించుటకు దగిన ప్రధానకాలమైన ప్రదోషకాలము. ప్రదోష

కాలమనగా సాయంకాలము మొదలు ఒకముహూర్తము. ఇది సామాన్యవచనము. మఱియు ప్రతిపక్షమునందును చతుర్దశీదినమునందలి సాయంకాలము ప్రతిదిన ప్రదోషకాలమునకంటె శ్రేష్ఠము. ప్రతిసంవత్సర మాఘ బహుళ చతుర్దశిదినమునందలి ప్రదోషము మహావిశేషదినము. ఇదే మహాశివరాత్రి. ఈశివరాత్రియందు శివధ్యాన తత్పరులైయుండువారు సకలప్రదోషకాలములయందు శివధ్యానముచేయు వారికంటె నధికఫలమును, అవసానమున శివసాయుజ్యముజెందుదురని యనేకగ్రంథములందు చెప్పబడియున్నది. శివరాత్రి —అనగా శివుని యొక్క రాత్రి. శివుడు మంగళము నిచ్చువాడు. కావుననే శివునిపత్నియగు పార్వతీదేవి సర్వమంగళయనబడెను. దుఃఖనివృత్తియే మంగళము. ఈవ్రతమునందు రాత్రిజాగరణమునకు కారణము ఆలోచింపదగినది. శివుడు సంహారకర్త. సంహారమన సకలాత్మల నొక్కటిగా కూర్చుట. అనగా సకలజంతుకోట్లను తనలో నైక్యము జేసికొనుట-శివరాత్రి జాగరణముసేయువారికి శివుడు సాయుజ్యపదవి నొసగును. ఈ వ్రతము ఉత్తరాయణ పుణ్యకాలమునవచ్చును. ఈవ్రతము రాత్రి ననుష్ఠించవలసినది. పగటికంటె రాత్రివేళ మనస్సును నిలుపుకొనుటకు సులువుగ నుండును. ఒకరాత్రిలో ఒక ముహూర్తకాలములేక, ఒక నిమిషమైనను శివుని యందు మనస్సు లీనమగునేని శివానుగ్రహము తప్పక కల్గును-కావున నీవ్రతము రాత్రిచేయవలెనని ఋషులు చెప్పినట్టున్నది. మఱియు భీష్ములవారు ద్రౌపదికి శివరాత్రిప్రభావము చెప్పుచు శివరాత్రి జాగరణముచేతను, నాటి మరణముచేతను జనులు ముక్తినొందుదురని చెప్పెనందురు. శివరాత్రియందు మేల్కొని యున్నందున నెందఱో దుర్మార్గులుకూడ ముక్తినొందినట్లు చెప్పెదరు." —నీలాపాళెం సుబ్బరత్నమ్మ.

**దొంతులమ్మ సంబరము:—**

"బందరులో దొంతులమ్మ యీ నెల 10-వ తేది బుధవారమునాడు పరమపదించినది. ఈమె యోగసిద్ధురాలు, చిరకాలజీవి, దైవసమానయని పలువురి యభిప్రాయము. ఆంధ్రదేశమున సర్వప్రాంతములందును నీమె శిష్యవర్గము కలరు. ఎక్కడెక్కడివారును వచ్చి పూవులు, పండ్లు, సమర్పించి పోవుచుండిరి. బిడ్డలు లేనివారు, పరీక్షలు తప్పినవారు, కష్టముల జిక్కుకొన్నవారు నీమెను శరణాగతు లగుచుండిరి. కాని యీ సిద్ధురాలిన్నాళ్ళు నెవ్వరితోడను మాట్లాడినట్లు లేదు. భక్తులు తెచ్చిన ఫలపుష్పాదులను బరిగ్రహించినదా వారికోరిక లీడేరినట్లే. ఇట్లే యేదో సాంకేతికముగ వీరెల్లరును సంతృప్తిపడిపోవుచుండిరి. చుట్టును జేరిన శిష్యకోటి యామె సంకేతముల కర్థములుచెప్పి వచ్చినవారిని సంతృప్తిపెట్టుచుండిరి. మొత్తముమీద పామరజనములో నీమె శిష్యకోటి యెక్కువా, చిలకలపూడి శ్రీకీరపాండురంగభక్తకోటి యెక్కువా యని విమర్శించినచో నిర్ణయించుట కష్టమే. చదువుకొన్నవారు, బ్రాహ్మణులు, వైశ్యులలో గూడ శ్రీ దొంతులమ్మవారు మహాయోగేశ్వరి యని నమ్మువారు కలరు. ఆబిడ పిచ్చిది, అంతకంటె విశేషమేమియును లేదని నిరసించువారుగూడ గలరు. కాని మౌఢ్యము, మానవప్రవృత్తి నభ్యుదయమొందించుటలో నెంతవఱకు బనికి వచ్చుచున్నది? గ్రామసీమలలో గంగానమ్మ భక్తులెంద రున్నారు? ఏదో యొక భయము లేనిచో నసంస్కృతమై, సహజముగ రాక్షసప్రవృత్త్యున్ముఖమైన వారి చిత్తధోరణి లోకమును విఱుచుకొని తినకమానదు. కావున నీమూఢవిశ్వాసములును లోకాభ్యుదయహేతువులే యనుట నిర్వివాదాంశము. ఎట్లయిననేమి, దొంతులమ్మ మహాత్మురాలు. కాకపోయిన ప్రాణముపోయిన తరువాత గూడ శవమున కంత సంబరమెందరికి జరిగినది?" —కృష్ణాపత్రిక.

**సీతాఫలము:—**

"మనదేశమున విచ్చలవిడిగా ఫలించునట్టి చెట్లలో శీతాఫలవృక్ష మొకటి. ఇది మహావృక్షజాతికి చెందిన పెద్దచెట్టుకాదు. క్షుద్రవృక్షకోటికి చెందినచిన్న మొక్కయుకాదు. మధ్యరకపు ద్విదళజాతి

వృక్షము. సాధారణముగ నిది తోటలలోపలగాక తోటలుచుట్టు నాటబడును. కొండలమీదను, అడవులలోను కిరవిగా పెరుగును. దీనికి దోహదము చేయనక్కఱలేదు. ఎక్కడనైనను చక్కగా బ్రదికి పైకిరాగలదు. ఇది సంపెంగజాతిలోని మొక్కయైయున్నది. సంవత్సరమున కొక్కతూరి దీనిపండ్లు సర్వసాధారణముగ మొదలు, సార్వభౌములవఱకుగల సకలజనులయొక్క దృష్టి నాకర్షించుచు ఒకటిరెండు మాసములు వీథివీథికి విరుగులంపును. కొన్నితావులలో శ్రావణమాసముననే సీతాఫలము పండదొడగును. కృష్ణామండలమున భాద్రపదాంతమునుండియు పండ మొదలిడును. ఆశ్వయుజ, కార్తికములందు సీతాఫలము లవ్వారిగ లభించును. తీయని రుచిగల గుజ్జుతో నింపి దుమ్ము పడకుండ, మురికి తగులకుండ ముచ్చికల మూతమూసి ప్రకృతిమాత పంపించిన పరమాన్నమే యీఫలరసము. దీని మాధుర్యమును చవిచూచుటకు చాలమంది నాగరకులు సంశయించుచున్నారు. అనేకు లీసౌఖ్యమునుండి వంచితులగుచున్నారు. విషయుతములగు మందులను మ్రింగుటకు వెనుదీయనివా రీ యమృతసేవనమున కడలుజెందనేల? పనికిమాలిన వస్తువులతో పాకముచేయబడి కశ్మలములై మురికిచేతులతో ముట్టబడుచు నన్నివిధములను ననారోగ్యకారులైయుండు పకోడి, పెసరట్లు, ఇడ్డెన, లడ్డుకము, కాఫీకొట్ల ఫలహారనామక వ్యర్థపదార్థములు, ఇంట చేయబడు వంటకముల నిస్సంశయముగ నిరాఘాటముగ తినుచుండు వారీయుపయుక్త ప్రకృతి సిద్ధ, నిర్మల, నిరపాయకరఫలము నానుట కింతభయమొందనేల? దానింగూర్చితిన్నగ తెలియకపోవుటయు, మితితప్పి తినుటచే కొన్నిదుర్లక్షణములు పొడసూపుటయు, శరీరము రోగగ్రస్తమైయుండ నీఫల మారోగ పదార్థమును వెలువరింప యత్నించుటయు నిందుకు కారణము. సీతాఫలమునందు చక్కెర మిక్కుటముగ నున్నది. ఆమ్రరసమువలె యిది శీఘ్రముగను, సులభముగను జీర్ణముకాదు. నారింజ, బత్తాయి, సీమరేగు వాడినట్లు సీతాఫలరసమును వాడరాదు. కరకర యాకలియగునపుడు మితిమీఱకుండునట్లు తినగలిగినన్ని పండ్లు తినవచ్చును. దీనిని తినినపూట మఱిదేనిని తినకుండ నుందురేని ప్రతివారికి నీ ఫలము జీర్ణమగును. రోగులు సైతము జీర్ణశక్తి ననుసరించి దీనిని నిస్సంశయముగ భుజింపవచ్చును. సీతాఫలమునందలి సుగుణములను కొన్నిటిని వస్తుగుణదీపిక యిట్లు వర్ణించుచున్నది. "రక్తమును, ఇంద్రియమును వృద్ధిచేయును. గుండెకు, మనసుకు బలమునిచ్చును. జీర్ణశక్తినిచ్చును." (ప్రకృతిపత్రిక) —జ్ఞానాంబ.

## కాఫీత్రాగుపిల్లలు:—

"1912 సం॥న సి. కె. టైలరుగారు కాఫీత్రాగు పిల్లలసంఖ్య తెలిసికొనుటకై ప్రయత్నించి ఒక పాఠశాలయందుగల 464 విద్యార్థులను బరీక్షించి వారలలో నూటికి 70 మంది కాఫీత్రాగువారుగలరనియు వీరలలో కాఫీత్రాగువారే తెలివితేటలు లేనివారుగా గాన్పించిరనియు వ్రాసిరి. కావున పిల్లలకు కాఫీపానీయము నష్టకరమై మిగుల ననర్థదాయకమైనదని తెలిసికొనుడు." —ప్రకృతి.

## స్త్రీ స్వాతంత్ర్యము:—

"జాతికి ప్రథమశిక్షకురాలగు స్త్రీకి చీపురు, మసిపాత చేతికిచ్చి హృదయములేనిబొమ్మలను కనుటకు మాత్రమేయని శాసించుచున్నది. లోకమునకు "మాత" యగు స్త్రీపై సనాతనధర్మపిశాచమును ప్రయోగించి బంధించివైచితిమి. ఎప్పుడు జననియగుస్త్రీని బంధించితిమో, అప్పుడే జాతియంతయు బంధింపబడినది. స్త్రీయొక్క బానిసతనము, విద్యావిహీనత, మౌఢ్యము సంతానమునందు మూర్తీభవించి, భారతజాతిని నిర్వీర్యమొనర్చి హీనస్థితికి దెచ్చినది. స్త్రీల ఐహిక, మానసికస్వేచ్ఛను బంధించుటలోగల మన భయోద్దేశ్యమున కాధారములేదు. బంధించి నీతిని కలుగజేయజాలము. నీతి స్త్రీల కెంతయవసరమని తలంచుచున్నామో,

పురుషులకు నక్కర్లే యవసరమని మనము తలంచుటలేదు. పురుషు లవినీతిపరులై యున్నంతవఱకు స్త్రీలయందు నీతి యలవడదు. స్త్రీలకు నీతియలవడజేయవలయునన్న పురుషుని ప్రవర్తన మాదర్శప్రాయముగ నుండ వలయును. పురుషులను దురాచారులమై ప్రవర్తించుచుండ పురుషులలో కలసి మెలసి తిరుగు స్త్రీలకెట్లు నీతియలవడును ? నీతినిగూర్చి చెప్పవలసియున్న పురుషునికన్న స్త్రీయందే యధికముగనున్నది. చాలవరకు స్త్రీల యవివేకమునకును అవినీతికిని పురుషుడే ప్రధానకారణము. పక్షపాతములేని ప్రతి పురుషుడును, యిది నిజమనియే ఒప్పుకొనును. మనమిప్పుడు జపహోమములతో కాలముగడుపుటలేదు. స్త్రీలకు స్వేచ్ఛ నొసంగుట ముఖ్యావసరము. స్వేచ్ఛ సృష్టినైసర్గికగుణము. జ్ఞానములేని పశువులు, పక్షులు సహితము, స్వేచ్ఛాభంగము నంగీకరింపజాలవు. బంధింపబడియున్న ప్రతిజంతువును, సమయముచిక్కిన తప్పించు కొనుటకే ప్రయత్నించును. స్వేచ్ఛ యెంతటిదెట్టియానందము, అభివృద్ధిగలదో మనము చూచుచునేయున్నాము. స్వేచ్ఛానిర్బంధమువలన మానసికనిర్బంధ మేర్పడును. మానసికవికాసములేని మానవుడు పశువనియే చెప్ప వలయును. స్త్రీలపై మనకు నమ్మకము, విశ్వాసము నుండవ-యునుగాని నిర్బంధముండరాదు. స్త్రీల యభివృద్ధి దేశమునకు, జాతికిని యెంతేని యవసరమైయున్నది. శిశుత్వమునుండి సక్రమశిక్షయు సదుద్దేశ్య ములు తనయునియందు కలుగజేయుటకు తల్లియే కారణము. మందమతులగు తల్లులవలన తమ బిడ్డలకు మంచి గుణములు కలుగజాలవు. స్త్రీలకు మానసికస్వేచ్ఛ నొసగి ఉత్తమవిద్యావ్యాప్తి చేయవలసిన బాధ్యత, మన యందున్నది. ఇప్పటికే కాలము మించిపోయినది. స్త్రీ, పురుషుని సమానహక్కుదారురాలుగాని సేవకు రాలు గాదని జ్ఞాపకముంచుకొనవలెను. స్త్రీలయభివృద్ధియే మనయభివృద్ధి. స్త్రీ లస్వతంత్రులై యున్నంత వరకు దేశము, జాతి క్షీణించిపోవుటకు సందేహములేదు. మన ప్రస్తుతహీనితనమునకు భారతస్త్రీల హీనిత్వమే కారణము. భారతభావిభాగ్యాభివృద్ధికి స్త్రీపురుషులలో సామరస్యసమత్వములు సర్వేశ్వ రుడు త్వరలో కలుగజేయుగాక యని కోరుచున్నాము.”

—ధర్మరక్షిణి.

### కె. నటరాజన్ గారికి సన్మానము:—

“ప్రజాసేవయే మానవ జీవితమునకు పరమావధి. ఈ ధర్మతత్వమును గ్రహించి బరోడాసంస్థానాధీశు లగు గయిక్వారు మహారాజుగారు ప్రజాసేవ యందగ్రగణ్యులగువారికి ప్రతిసంవత్సరము 22 వందల రూపా యలు విరాళమొసంగుచు తమయౌదార్యమును ప్రకటించుచున్నారు. ఈ సంవత్సరము గయిక్వారుగారి బహుమానము కె. నటరాజనుగారి కొసంగ నిశ్చయింపబడినది. నటరాజనుగారు సుప్రసిద్ధదేశారాధకులు. వీరు బొంబాయినుండి (Indian Social Reformer) యిండియన్ సోషల్ రిఫార్మరు పత్రికను నిర్వహించు చున్నారు. ఈపత్రికామూలమున వీరు గావించుచున్న ప్రజాసేవ అపారమైనది. గయిక్వారుగారి సన్మాన ముచే నటరాజనుగారు ద్విగుణీకృతోత్సాహముతో ప్రజాసేవ గావించెదరని మేము భావించుచున్నాము.”

—సంస్కారి.

### కీ. శే. డాక్టరు శ్రీమతి యామినీ సేన్:—

“ఈ నారీమణి శ్రీయుత చండీచరణసేనుగారి కుమారిత. విఖ్యాత వంగదేశకవయిత్రియగు శ్రీమతి కామినీరాయిగారి సోదరి—శ్రీమతి యామినీసేన్ చిరకుమారిగానుండి వైద్యవిద్యనార్జించి సంఘమును సేవించి ధన్యురాలయ్యెను. ఇండియా దేశములోనే ఆమెవైద్యవిద్యను చక్కగా నభ్యసించెను. అంతటితో సంతృప్తి జెందక ఆమె రెండుపర్యాయములు ఉన్నతవైద్యవిద్యాసముపార్జనార్థమై గ్రేటుబ్రిటనుదేశము కరిగెను. కొంతకాలము నేపాళదేశప్రధాననగరమునందు తత్ప్రభుత్వపక్షమున పనిచేసెను. అనంతరము ఈ దేశ

ములో ప్రభుత్వముక్రింద ఆగ్రా, సిమ్లా, అకోలా మున్నగుపట్టణములందు వైద్యురాలుగానుండెను. గడచిన రెండు సంవత్సరములనుండి శరీరాస్వస్థత మూలమున శ్రీమతి యామినీదేవి పూరీనగరమునం దుండెను. కాని అక్కడగూడ నామె పూర్ణవిశ్రాంతి గైకొనలేదు. పూరీజిల్లా మేజస్ట్రీటు కోరికమీద అచటి వైద్యశాల యొక్క పరిపాలనాధికారమును ఆమె వహింపవలసినదయ్యెను. తనకు వ్యాధి ప్రబలముకాగా నిటీవల జన్మస్థానమగు కలకత్తాపట్టణమునకువచ్చి పరలోకగతురాలయ్యెను. శ్రీమతి యామిని వైద్యనైపుణ్యమునకును, సద్వర్తనమునకును, పరోపకారబుద్ధికిని పేరుపడిసిన వనితాశిరోమణి. బ్రాహ్మసమాజమునకీమె మరణమువలన తీరజాలని లోటుకలిగినదని చెప్పనగును." —ధర్మసాధని.

**జయపూరు చెయ్యి మించుతూంది:—**

"జయపూరుప్రజల అదృష్టం. జమీందారుగారు మంచివారు లభించారు. నిరంతరం యేస్టేటు అభివృద్ధినిగూర్చియే ఆలోచన. నలుగురు అసిస్టాంటుదివానులు, ఒకదివాను. పరిపాలన చాలా చక్కగావుండవచ్చును. జమీందారుగారు అందరికిసులభుడు. ఉదయం 7½ గంటలు మొదలు 11 గంటలవరకు దివానాయింటి వద్దనే కచ్చేరిసాగింతురు. ఎవరైనను బాహాటముగా దర్శించవచ్చు. రయితులు చెప్పుకొనుదానికి వెంటనే విచారణ, తగునిర్ణయము లభించును. రయితులపైవిధించు పన్నుగూడ యకరముల నిర్ణయ ప్రకారముగాక అరకకు రు. 4 లునంతున నిర్ణయింతురట. అరకకు ఎన్నియకరములు సాగుచేసినను అదేశిస్తు. ఈ యేస్టేటు అడవులుచాలా గొప్పవి. ఈఅడవులలో విశేషము కమలాఫలములు లభించును. లక్క విశేషముగా లభించును. కర్పూరముగూడ లభింపగలదని వినికిడి. శ్రీయుతులు పుల్లారెడ్డిగారి దివానుగిరిక్రింద, నూత్నశోభలతో ఆంధ్రదేశమునకు ఆదర్శప్రాయముగ ఈయేస్టేటు అలరారగలదని ఆశించుచున్నాము." —జమీందారిరైతు.

**చంద్రమతిదేవిగారస్తమించిరి:—**

"నేడొక సాధ్వీమతల్లి ప్రకృతిలోలీనమైపోయినది. అపరకళాసరస్వతి అంటె అభిమానమంటారేమో, ఆమె సంగీతకళానైపుణ్యతనువింటే యథార్థమంటారు. విద్యానైదుష్యముంటె సౌందర్యముంటుందా అనుకొంటాము. కాని మాచంద్రమతిదేవి యీలోకమందు రతీదేవిఅంటె ఉత్ప్రేక్షకాదు. సౌశీల్యమాలోచిస్తే ఆమెను పోల్చడానికి మాకు యెవరూ దొరకనేలేదు. ఇన్నిగుణాలపుట్టినిల్లయి భర్తఅయిన శ్రీ కవిరాజ త్రిపురనేని రామస్వామిచౌదరిగారిని మహదానందాబ్ధిని నోలలాడిస్తూ నేడు దురదృష్టవంతులయిన యిద్దరు మగబిడ్డలను యొకఆడపిల్లను వొదిలి నిర్యాణమొందినందులకు భర్తయేగాక కమ్మకులమును, మేమును దురదృష్టవంతులమని చెప్పుటకు సందేహములేదు. ఇది కవిరాజుగారికి తీరరానిదుఃఖము, దాటరానిఆపద. ఆమె ఆత్మకు శాంతికల్గుగాక." —కుర్రా గోపాలకృష్ణయ్య.

**స్త్రీ పోలీసులు:—**

"ఢిల్లీ పోలీసుసూపరింటెండెంటు స్త్రీపోలీసులనియమింప నిశ్చయించెననివిందుము. కాని ప్రస్తుతమున్నపరిస్థితులలో ఈప్రయత్నము నెఱవేఱునాఅని మాభయము. ఖైదుకుపోవసిద్ధపడుచున్న స్త్రీలసంఖ్య దినదినమును హెచ్చుచున్నది. వీరిని అరెస్టుచేయుటమొదలగుపనులకు స్త్రీపోలీసులు నియమింపబడుట సరియైనదే. కాని ప్రస్తుతరాజకీయపరిస్థితులలో స్త్రీలు విరివిగా పోలీసువృత్తి నవలంబింతురాయని మాసంశయము. రష్యాదేశమున ఒక్కపోలీసుశాఖయందేగాక సైనికశాఖయందును స్త్రీలు జేర్చుకొనబడుదురు. ఇంగ్లండులో స్త్రీలపోలీసుఫోర్సుగలదు. కాని హిందూదేశమున-శతాబ్దులుగ పూర్వాచారమునకు పట్టుకొమ్మయగు హిందూదేశమున—స్త్రీలు పోలీసుశాఖలోచేరుటయను పరివర్తనముగొనివచ్చుట కష్టము. విద్యగలతావులలో ఈకష్టముఉండదని శ్రీమతి కమలాదేవిఛట్టోపాధ్యాయసతి ఏర్పఱచిన హిందూస్థాని స్త్రీసైనికదళమువలన తెలియనగును."

—*Malayala Rajyam.*




### రెండు ముట్టెల గొఱ్ఱెపిల్ల:—

నిమ్రోడ్ నందలి ఒకానొకకర్షకుని గొఱ్ఱెలమందలోని ఒకగొఱ్ఱె తొమ్మిదిమాసముల క్రితము ఈనినది. ఇన్నాళ్ళును ఆకర్షకుడు ఆపిల్లను పరీక్షపెట్టిచూడలేదు. ఈనడుమ ఒకనాడుచూడగా దానికుడిచెవిక్రింద ఒకరంధ్రము ఉండెను. దానిని పరిశీలింపగా సరిగాముట్టెవలెనుండెను. అందునాలుక, దంతములు మామూలు ముట్టెనందుండునట్లే గలవు. ఈముట్టె కంఠమునకును, ఊపిరితిత్తులకును సంబంధముకలిగిఉన్నది. ఆగొఱ్ఱెపిల్ల అసలుముట్టె తెఱుచునపుడును, మూయునపుడును ఈరెండవముట్టెకూడ తెఱుచుకొనుచును, మూసికొనుచును ఉండును. అసలుముట్టెతోవలె దీనితోడను ఊపిరిపీల్చగలదు. అసలుముట్టెతో ఆహారమును తీసికొనునపుడును, నెమరువేయునపుడును ఈరెండవ ముట్టెకూడ కదలుచుండును.

### చదలు:—

చదలు మనయిండ్లలోసైతము కొన్నిచోట్ల పుట్టలుపెట్టుకొనినివసించుచు బలిష్టమైన కొమ్మువంటి పండ్లతో కఱ్ఱసామానులనుసైతము తినివేయుచుండుట మనము చూచుచున్నాము. వీనిని బల్లులు, గబ్బిలములు మొదలగునవితినును. అందుచే పుట్టలనునిర్మించుకొని అందు నివసించుచుండును. ఇవి ఉష్ణదేశములందుండును. ఇవి వేలకువేలుగా నివసించుచుండును. అన్యోన్యమైత్రిగల్గి సంఘనిబంధనలకులోబడి ప్రవర్తించుకొనుచుండును. ఈనిబంధనలు వానిపనులు ఆశ్చర్యమునుగొల్పునవిగానుండును. వీనియందు బేధములుగలవు. (1) రెక్కలపురుగులు (2) రెక్కలులేనివి. ఇందు రెక్కలుగలపురుగులను ఇసుళ్ళుఅందుము. వీనిలో ఆడవి, మగవి అను రెండుతరగతులు. సంతానమువృద్ధిచేయుటయే వీనిపని. వర్షాకాలమున నివి తిరుగునపుడు నేలపైబడి కొన్ని చచ్చిపోవును. మిగిలినవానిరెక్కలు నేలపైబురదకంటుకొని ఊడిపోవును. అట్లు ఊడిపోవనియెడల తమరెక్కలను తమంతతామే రాల్చుకొనును. రెక్కలులేకపోవుటచే నెగురజాలవుగాన శత్రుబాధనుండి తప్పించుకొనుటకు పుట్టలునిర్మించుకొనును. ఇందు వేలకువేలు గదులుండును. అందుఒకటి రాజుకు, రెండవది రాణికి, మూడవది ఆహారపదార్థములు నిల్వచేయుటకు ప్రత్యేకింపబడును. మగది రాజు. ఆడది రాణియగును. రాణి మూడున్నరఅంగుళముపొడవుగల్గి ముప్పాతికఅంగుళము వెడల్పుగల్గియుండును. తన ప్రత్యేకపుగదియందుండును. రాణిగదికి రెండుద్వారములుండును. ఒకద్వారమునుండి తక్కినపురుగులు ఆహారము నందిచ్చుచుండును. ఇది దినమునకు లక్షగ్రుడ్లుపెట్టును. రెండవద్వారమునుండి ఆగ్రుడ్లనుగొనిపోయి

పాడిగదులయందు యితరపురుగులు చేర్చుచుండును. అచ్చట దాదులు వానిని పోషించుచుండును. పుట్టలోని యితరపురుగులన్నియు ఈరాజురాణిపురుగులకు రెంటికి యావజ్జీవము ఊడిగము చేయవలసినదే. ఇక రెక్కలు లేని పురుగులనుగూర్చి. వీనికి లింగభేదము లేదుగాన నివన్నియు నపుంసకములు. ఇందు (1) భటులు (2) పరిచారకులు అను రెండుతెగలు. ఇవిరెండును ఒకేమాదిరిగానుండుగాని భటులశిరములు పెద్దవిగాకన్పడును. పట్టువీడకుండుటకై గట్టికోరలుండును. ఇతరపుట్టలనుండివచ్చుపురుగులను తమపుట్టలలో చేరనీయకుండుట, యెదిరించినవానితో పోరాడి వెడలగొట్టుట, పరిచారకులుచేయుపనుల జాగ్రత్తగాపరిశీలించుట, పనులు చేయించుట లోనగువిధులను భటులుచేయుచుండును. వర్షాకాలమందు యెదిగినపురుగులను (యినుళ్లు) గూడ వెడలుగొట్టుచుండును. ఇక పరిచారకులు గ్రుడ్లను చెమ్మలేనిగదులచేర్చుట, పిల్లలపోషించుట, రాజుకు, రాణికి ఆహారములనందిచ్చుట, వారికి సపర్యలుచేయుట, దండుకు కావలసినఆహారమును నిల్వచేసియుంచుట చేయుచుండును. పరిచారకులుగాగాని భటులుగాగాని యినుళ్ళుగాగానిమారుటకు పరిచారకులు తెచ్చియిచ్చు ఆహారమునుబట్టియేయుండునని శాస్త్రజ్ఞులు నిశ్చయించినారు. —అదిరాజు అమృతేశ్వరరావు.

ముక్కు భీమా:—

సెంటులు, అత్తరులు, తలనూనెలు మొదలగు పరిమళద్రవ్యముల సువాసనలను మిగుల నిపుణత్వముతో పసికట్టగలిగిన ఒక విదేశీయురాలు తాను ఫ్రాంసు, ఇటలీ, యీజిప్టుదేశములకు ప్రయాణముచేయుటకు పూర్వము తన ఘ్రాణేంద్రియముయొక్క ప్రభావముచెడిపోయి ఆదాయమునకు నష్టమువచ్చుననుభయముతో తనముక్కును రు. 1,50,000 ఒకలక్షయాబదివేలరూపాయిలకు భీమాచేయించుకొనినదట. ఆమె ఒకవేళ మోటారుబస్సులలో ప్రయాణముచేయుట, నేపిల్సుపట్టణమునుజూచుట, కెయిరోపట్టణముపోయి ఈజిప్టుల గృహములను దూరిచూచుట, పడిశముపట్టుట, సంభవించినయెడల భీమా రద్దుఅగునను షరతులుకలవేమో తెలియదుకాని భీమా దరఖాస్తుఅంగీకరించబడి వాయిదాపైకము రు. 15000 పదిహేనువేలరూపాయలు చెల్లింపబడెనట. —భీమా పత్రిక.

బ్రతికి పేద: చచ్చి ధనికుడు:—

బెర్లినులో హార్డిన్ అను డెబ్బదిఆరేండ్లముసలివాడు తాను పేదవానినని చెప్పి మునిసిపలువారినుండి మాసబిచ్చముపొందువాడు. రోడ్డుపై చిత్తుకాగితముముక్కలు, సిగరెట్టుపీకెలు ఏరుకొనువాడు. అందుచే మార్గస్థులు వానియందుదయదలచి డబ్బులు యిచ్చుచుండువారు. ఆతడు ఒకచిన్నగదిలో మఱిముగ్గురతో కలసియుండువాడు. ఆతడు చనిపోయినపుడు నిర్ధనునిగాఎంచి అంత్యక్రియలు ప్రభుత్వమువారుజరుప నిర్ణయించుటకు ఆతనిగదిని వెదకిరి. ఆశ్చర్యమేమియనగా ఆతడుచేర్చిన చిత్తుకాగితముముక్కలను వెతుకుటలో ఆతనిపేరుగల సేవింగ్సుబ్యాంకుబుక్కు ఒకటి కనుపించెను. అందు ఆతనిపేర 11,000 మార్కునాణెములును, 15,000 మార్కునాణెములవిలువ బాండులునుగలవు. పౌనులలో వీనిమొత్తపువిలువ 1,200. ఆసేవింగ్సు బ్యాంకుపుస్తకము బాగుగా పరీక్షింపగా ఆతడు చనిపోవుటకు కొద్దిమాసములముందు మాసమునొక్కంటికి 200 మార్కుల చొప్పున మిగిల్చుకొనుచుండెను.

ఎఱ్ఱచేమంతి:—

గృహలక్ష్మిలో ఈవఱకువ్రాయబడినట్టి 'చేమంతి' అనువ్యాసమున ఎఱ్ఱచేమంతులులేవని వ్రాయబడినది. ఎఱ్ఱచేమంతిఅంటు కాకినాడలో మాబంధుగులయింటనుండగా తెప్పించి నెల్లూరునందు మాపెరటిలో పెంచుచున్నాము. మందారపుష్పములకంటె మిక్కిలి ఎఱ్ఱగాను ముద్దగాను ఉన్నది. —విస్సా సత్యవతమ్మ.

# పత్రికా పరిచయము

**కినీమావీక్లీ:—**

ఆంగ్లవారపత్రిక. సినీమాకుసంబంధించినవిషయములతో నిండారియుండును. సినీమానటకురాంద్ర మనోహరచిత్రములును, చిత్తాకర్షకములగు సినీమారంగచిత్రములును కొన్ని ప్రతిసంచికయందును ఉండును. చిరునామా: కినీమావీక్లీ, 8, అయలూరు ముత్తయ్యమొదలివీధి, జి. టి. మద్రాసు.

**భీమాపత్రిక:—**

భీమావ్యాపారమునుప్రచారముచేయు మాసపత్రిక. సంపాదకులు సూరంపూడి కనకరాజుపంతులు గారు. ప్రతిమాసమున మొదటివారములో ప్రకటింపబడును. జనవరిమాసమునవెలువడిన ఈపత్రిక మొదటి సంపుటము మొదటిసంచిక మాకార్యాలయమునకు పంపబడినది. దేశహితకరోద్యమములలో భీమాయుద్యమ మొకటి. దానినిగూర్చి ప్రచారమునలుపుటకైన ఈపత్రిక సర్వవిధములఅభివృద్ధికి రాదగినది. డబుల్ క్రౌను సైజున గ్లేజుకాగితములపై ముద్రింపబడుచున్నది. మహాశయులు పలువురు ఆశీర్వచనసందేశములనుపంపి ఈ పత్రికయొక్క భావిశుభమును సూచించినారు. ఈప్రథమసంచికయందు శనివారపు సుబ్బారావుపంతులు గారు 'మనిషికూడాఆస్తే' అను విషయమునుగూర్చియు, దిట్టకవి వీరరాఘవయ్యపంతులుగారు 'ప్రావిడెంటు భీమావ్యాపారము'అను విషయమునుగూర్చియు, క. భీమేశ్వరరావుగారు బ్యాంకుఅనగా ఏమి అనువిషయ మునుగూర్చియువ్రాసిన వ్యాసములు పేర్కొనదగినవి. భీమావిషయమునుగూర్చి తెనుగున ప్రచురింపబడు ఈ ప్రథమపత్రిక చిరకాలము ఆంధ్రసేవచేయునుగాకయని కోరెదము. సాలుచందా రెండురూపాయలుమాత్రము. చిరునామా: మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

**ధర్మరక్షణి:—**

పక్షపత్రిక. మొదటిసంపుటపు మొదటిసంచిక జనేవరి 15-వ తేదీని వెలువడినది. 1931-వ సంవత్సరము అక్టోబరునెల 11-వ తేదీని బెజవాడయందు స్థాపింపబడిన మానవధర్మరక్షణసమాజమువారిపక్షమున ప్రచురింపబడుచున్నది. కులభేదములనుగూర్చిన అనేక భారతనాయకులఅభిప్రాయము లీసంచికయందు ఒకచో ఏర్చికూర్చబడియున్నవి. కొందరునాయకురాంద్ర అభిప్రాయములుచేర్చుటకూడ స్తుతింపదగియున్నది. దేవాలయప్రవేశము, అతిబాల్యవివాహము మొదలగు సమస్యలును యుక్తియుక్తముగ చర్చింపబడినవి. ఇట్టిపత్రిక చక్కని సంస్కారావబోధమునుకలిగించుటకు అనువైయున్నది. సంపాదకులు బండి బుచ్చయ్యచౌదరిగారు. డబుల్ క్రౌనుసైజు. గ్లేజుకాగితములు. సంవత్సరచందా రెండు రూపాయలు. చిరునామా: యస్. బి. యస్. ప్రెస్, బెజవాడ.

**సంస్కారి:—**

కేవల సంఘసంస్కారముకొఱకేపనిచేయు ఆంధ్రపత్రిక ఒక్కధర్మసాధనిమాత్రమే ప్రస్తుతమున్నది దానికితోడగా ఇపుడీనూతనపక్షపత్రిక ప్రచురింపబడుచున్నదనుటకు తెలుగువారు సంతసింపగలరు. ఈ పత్రిక ప్రతిమాసము 5, 20 తేదీలయందు ప్రచురింపబడును. సంఘసంస్కారము ప్రధానోద్దేశము. భారత దేశములోని భిక్షుకులుఅను వ్యాసము ఎన్నియో క్రొత్తసమస్యలను చర్చించుచున్నది. సంపాదకీయము కుల భేదములనుగూర్చి. చదువదగియున్నది. ఈపత్రికనుండి కొంతభాగమును ఈమాసపుపుష్పచయమున ఉద్ధరించితిమి. 'కులభేదమహాపాతకము'నుగూర్చిన భారతనాయకుల యాక్రోశము ఒకచోచేర్చబడినది. ఆంధ్రసంఘ సంస్కారమునకు పాదుపుచుక్కయగు వీరేశలింగముపంతులుగారినిగూర్చిన ప్రశంసాపద్యములు పఠనీయములు పత్రికకు దీర్ఘాయువుకలుగుగాక. చిరునామా: సంస్కారిపత్రిక, ఎలమర్రు, కృష్ణాజిల్లా.




## పోయిన కన్నులు వచ్చుట:—

మా గ్రామములో మాయిరుగుపొరుగు ఒక కాపుస్త్రీ. ఆమెతల్లితండ్రులది చంద్రనగరము. ఆమె మేజరే. ఆమెభర్తకు మదరాసులో ఏదోఒక పేటలో స్కూలుటీచర్ పని. ఆమెకుకూడ కొంచెమువిద్య చదువను వ్రాయనువచ్చును. ఇట్లుండగా ఒకనాడు ఆస్త్రీకి ఉన్నట్టుఉండి ఒడలుకొయ్యబారిపోయి దేహము తెలియకుండపోయినది. ఏమోజబ్బని ఆమెభర్త డాక్టరువద్దకుపిల్చుకొనివెళ్లి కొంతఔషధం ఇప్పించినాడు. తరువాత మఱికొన్నిరోజులకు అట్లనే కొయ్యబాఱిపోయినది. దానిపైన అతడు గాలిఅని, పిశాచిఅని చెప్పుతో (పొరకతో) తలమీదకొట్టినాడు. అందుమీద రెండుకన్నులు అగుపడకుండపోయినవి. తెల్లగ్రుడ్డుమాత్రము కనిపించుట, రెప్పయెత్తిచూచితే నల్లగ్రుడ్డంతయు పైకిలాగినట్లగుట: బొత్తిగా దృష్టిలేక చాలబాధపడుతుండినది. ఆమెతల్లిపిల్చుకోవెళ్ళి మావూర్లో ఏదైనచిట్కావైద్యం చేయించెదమనిచెపితే పంపను డాక్టర్‌వైద్యమే చెయ్యవలెనని ఆమెమగడు పట్టుపట్టిపంపలేదు. పాపం ఆమె చాలా బాధపడుతూఉండినది. తరువాత జనరల్ ఆస్పత్రి పెద్దడాక్టర్‌గారివద్దచూపించితే తల్లో బాగాకొట్టినట్లయిన నేత్రములువచ్చునని చెప్పగా బాగ పుర్రెమీదకొట్టితె దెబ్బలువోర్చలేక నాకు కండ్లులేకున్నమానినదని నాతల్లిదగ్గరకు నన్నుపంపించండి అని భర్తనువేడుకొన్నది. వైద్యంచాలించాడు కాని తల్లివద్దకు ఒకసంవత్సరము పంపలేదు. అట్లు ఆమె భర్తమనస్సు మరల్పలేక బాధపడుతూనే 1½ సం॥ జరిపినది. ఆమెతల్లిదండ్రులు మొండికిబడి చంద్రనగరం పిల్చుకొనివచ్చిరి. కొద్దిరోజులైనతరువాత ఆమెతమ్ముడు పది పదకొండుఏండ్లపిల్లవానికి వొళ్ళుతెలియకుండ ఆవేశంవచ్చి "నేను ఒక దేవతను. నన్ను నీభర్త చెప్పుతో బుర్రమీదకొట్టినాడు. కావున నేత్రములు అవుపడకుండపోయినవి. కావున ఈభార్యను నేనుఅంటనుఅని శపథంచేసినట్లయిన నేత్రములిచ్చెద"నని పదిమంది యెదురుగా ఆపిల్లవాడుచెప్పినాడు. "అదేప్రకారము జరిపెదము స్వామీ! నేత్రములిచ్చినచాలును. నీకు పొంగలిపెట్టెద"మని మ్రొక్కిరి. అప్పుడా బాలునికి తెలివివొచ్చినది. అప్పటికి నాలుగురోజులనుండి ఆనేత్రములులేనిపడుచుకు దేహముతెలియక ఆహారపానీయములులేక కొయ్యబాఱిపడిఉన్నది. వెంటనే వారు ఒక కలశముబెట్టి పొంగలిచేసితెచ్చి ఆకలశముముందరవుంచి వారిబంధువులు ఇంక పొరుగువారుకొందరు ఆమెభర్తనుతెచ్చినిలవబెట్టి, నేను ఇక ఈభార్యనంటను వేరెవివాహంచేసుకొనెదనని చెప్పమనిరి. అతడట్లు చెప్పడయ్యె. ఆవూరివారందరు బలవంతపెట్టి అతనిచేత అక్షింతలువేయించిరి. తోడనే ఆకాపుపిల్లలేచి తడువుకొనుచు ఆకలశమునకు దండముసమర్పించిలేచేటప్పటికి రెండునేత్రములు తామరరేకులవలె వికసించినవి. ఈవృత్తాంతమంతయు ఆమెముఖమున తెలుసుకొని వ్రాసితిని. —కంకిపాటి రుక్మిణమ్మ.

వరశుల్కాచారమునకు బలి:—

వీరేంద్రనాధచౌదరి కలకత్తాలో అక్రూరదత్తువీథిలో నివసించుచుండెను. అతని కొకచెల్లెలు. పేరు సావిత్రిలతాదేవి. ఆమె వరయోగ్యయైయుండెను. డాక్టరువీథిలో నివసించుచున్న దినేశచంద్రఘోషు జ్యేష్ఠపుత్రునకు ఆమెనిచ్చుటకు రహిశమయ్యెను. షరతులు లిఖితమొనర్చిరి. వధువునుచూచిన పిమ్మట ఆవివాహమునకు తన అంగీకారమును తెలుపుచు ఘోషు ఆలిఖితపత్రముపై వ్రాలుపెట్టెను. మార్చి 11-వ తేదీ ముహూర్తము. ఈలోగా ఘోషు కట్నమును ముందుపంపవలసినదని కబురుచేసెను. అందుమీద వీరేంద్రుడు నూరురూపాయలు అడ్వాన్సుగా టెలిగ్రాఫ్ మనియార్డరుచేసెను. మిగతసొమ్ము పంపుటకును, వివాహవ్యయములకును ఆతడు తనఆస్తినంతయు తనఖాపెట్టెను. ఇంతలో ఘోషు సావిత్రిని తనపెద్దకొడుకునకు చేసికొనజాలననియు, తన రెండవకుమారునకుచేసికొనగలననియు కబురుచేసెను. ఆరెండవకొడుకునకు ఇచ్చుట బొత్తిగ వరహీనమగును. అందును అతడు వర్తనచే గుణహీనుడగుట సుస్పష్టమైయుండెను. వీరేంద్రనాధునకు ఏమియు పాలుపోవుటలేదు. సావిత్రిలత ఇదియంతయుచూచెను. కాగల తనఅత్తవారి వింతప్రవర్తనకు కక్కసపడెను. తనకుగా సోదరునిఆస్తిఅంతయు తాకట్టుపడుటకు విచారించెను. ఇంతటికినిమూలమగు తానుమరణించుటయే మంచిదని ఆమె నైట్రిక్ ఆసిడ్ త్రాగి పరలోకమునకుపోయెను. వీరేంద్రుడును, ఘోషును కోర్టుకుపోయిరి. వరశుల్కాచారము పనితను కొండఎక్కించినది. మిగతావారిని కోర్టుకెక్కించినది. తాను నిరాఘాటముగ నిలబడియున్నది.

"కలకత్తా గవర్నమెంటు ఆఫీసులో దయ్యములు":—

బెంగాల్ గవర్నమెంటు సెక్రటారియేటులో ఈనడుమ నొకనాటిరాత్రి మొఱుగులువినవయ్యెను. రాత్రి కాపలావాండ్రు అవి దయ్యములుచేయు శబ్దములుగాతలచి భయపడిరి. మఱునాటిరాత్రికూడ ఆ మొఱుగులువినవయ్యెను. అదిగో పులిఅనిన ఇదిగోతోకయనువారు ఆమొఱుగులు చనిపోయిన ఒకానొక గవర్నమెంటుఉద్యోగస్థుని దయ్యపు మొఱుగులనియు, ఆదయ్యము తలుపుతెఱపమని హంగామాచేయుచున్నదనియు చెప్పదొడగిరి. జనులు ఈవింతశబ్దములనువిన వందలుగమూగిరి. ఒకనాటిరాత్రి శబ్దము ఎక్కువకాగా అచ్చటివారు దీపములువెలిగించి ఆఫీసుఅంతయు వెదుకనారంభించిరి. రెండవఅంతస్థుపైనున్న రవుండు రూమునువెదకుటకు తలుపుతెఱచిరి తెరచీతెరచుటతోడనే ఒకనల్లనిఆకారము బయటికి దూసుకుపోయెను. కావలివాండ్రు దయ్యము తమపైపడుచున్నదను నమ్మకముతో కుయ్యవెట్టిరి. కాని నిదానించిచూచినవారు అది దయ్యముకాదనియు ఒకనల్లకుక్కఅనియు చెప్పిరి. అది పగలుఎప్పుడో ఆగదియందు ప్రవేశించియుండుననియు, తలుపులువేసివైచుటచే అందది ఇఱుకుకొనిపోయినదని ఊహింపబడెను. ఈదయ్యమును లాఠీచార్జి చేసి తరిమివేసిరి. ఇది రాత్రిజరుగుటచే ఎవ్వరికిని తెలియలేదు. మఱునాటిరాత్రియు దయ్యముఅఱుపులు వినుటకు జనములుమూగిరి. అది దయ్యముకాదనియు, అందుచిక్కుపడిపోయిన ఒకకుక్కఅనియు, అది గతరాత్రి వదలివేయబడెననియు అచ్చటివారు ఎన్నివిధములుచెప్పినను మూగినవారు వినలేదు. తుదకు పోలీసువారినిపిలిచి ఆమూగినవారిని చెదరగొట్టవలసివచ్చెను. పోలీసులు రెండుసారులు కలుగచేసికొనిరి.

పులికిపుట్రలైన గ్రామస్థులు:—

నడియాడుచెంతగల ఒక గ్రామములో ఎట్టితుపాకులును లేకనే ఆగ్రామస్థులు పెద్దపులినిచంపిన సాహసకార్యము పత్రికలకెక్కినది. ఒకనాటియుదయమున ఆగ్రామమున పెద్దపులిగానవయ్యెను. కొందఱు పోవుచుండ అది వారిని అటకాయించెను. గాండ్రుమని వారిపైబడనుండెను. అందులో ఒకడు ఎట్టిభయమును లేక తెరిచిన పెద్దపులినోట తనచేయిపెట్టెను. మఱియొకడు ఆపెద్దపులి చెవులుపట్టుకొనెను. అందుతో వంటయింటికుందేలయిన దానిని మఱియొకడు గొడ్డలితో నఱికివైచెను.

# గ్రంథపరిచయము

**కవిత్వచింతామణి:—**

గ్రంథకర్త చదలువాడ కోటి నరసింహముగారు. ఆంధ్రభాషారచనమునకువలయు శబ్దజ్ఞానము, సంధి వివేకము, సమాసకల్పము, అలంకారము, ఛందోలక్షణములు, బంధగర్భకవిత్వములు మొదలగునవి ఇందు వివరింపబడినవి. పూర్వకవులగ్రంథములనుండి లక్ష్యములును చేకొనబడినవి. కవిభూషణ, కవిరాజబిరుదాంకితులగు శ్రీరాజా వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు తెలుపునటుల ఈగ్రంథమున ఆంధ్రభాషాకావ్యనిర్మాణమునకువలయు పరికరములన్నియు సంక్షేపరూపమున సంఘటింపబడినవి. క్రౌనుసైజున 130 పుటలు. గ్లేజు కాగితములు. వెల 0-12-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా ఊటుకూరునకు వ్రాయునది.

**శ్రీమద్రామాయణతత్త్వజిజ్ఞాస:—**

బెజవాడతాలూకా పటమటగ్రామ బోర్డుహైయరు ఎలిమెంటరీపాఠశాలాసహాయోపాధ్యాయుడు పొన్నలూరి సూర్యనారాయణశర్మవిరచితము. ఆదిశైవపత్రికనుండి సముద్ధృతము. ఆదిశైవగ్రంథమాలలో ఎనిమిదవపుష్పము. రామాయణమునందలి ప్రక్షిప్తములు, కథలవైరుధ్యము మొదలగువానిని సప్రమాణముగ విమర్శించుగ్రంథము. జిజ్ఞాసరేపుచున్నది. డెమ్మీసైజున 40 పుటలు. వెల రు. 0-4-0. చిరునామా 'ఆదిశైవ పత్రిక' చిలుమూరు, అనంతసరంపోస్టు, గుంటూరుజిల్లా.

**హితోక్తిరత్నాకరము:—**

పెరంబూరునందలి రావుబహదూర్ కలవల కన్నయ్యసెట్టి హైస్కూలునందు ప్రధానాంధ్రపండితులును, చాణక్యగ్రంథరచయితలునుఅయిన శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు నారాయణపండితుని సంస్కృతహితోపదేశమునకుచేసిన తెనిగింపుఇది. సుహృల్లాభసుహృద్భేదములను రెండుప్రకరణము లిందు గలవు. ఈగ్రంథమును మేము ఆమూలాగ్రముగచదివితిమి. శైలి సరళము. రచన ధారాళముగాసాగిపోవుచున్నది. నీతులకు గని. అగుట ఇది ప్రతివిద్యార్థియు చదువదగినది. పాఠశాలలయందు ఇట్టి నీతిగ్రంథములు ప్రవేశింపజేయుట అధికారులవిధి. లయోలాకళాశాలలో ఆంధ్రమున అధ్యాపకులగు శ్రీ కె. వి. రాధాకృష్ణ శాస్త్రిగారీగ్రంథమునకు ఆంగ్లమున చక్కనిపీఠిక వ్రాసియున్నారు. అందు హితోపదేశప్రాశస్త్యమును, ఈ అనువాదప్రాశస్త్యమును వెల్లడించియున్నారు. గ్రంథముద్రణము సుందరముగనున్నది. గ్లేజుకాగితములు. క్రౌను సైజు. 100 పుటలు. వెల 0-8-0 అణాలు మాత్రము. వలయువారు గ్రంథకర్తపేర వ్రాయవచ్చును.

**రఘువంశము:—**

రెండవభాగము. కాళిదాసుని రఘువంశకావ్యములోని పదునొకండవసర్గతో ప్రారంభమై తుదిదగు పందొమ్మిదవసర్గతో సమాప్తమైనది. ఇట్టిగ్రంథములను విద్యార్థులకరకమలములకందించుటచే వారు భారతీయునకుకీర్తిదెచ్చు గ్రంథములతో పరిచయము సంపాదింతురు. ఆంధ్రభాషాపోషకులగు పూర్వపురెడ్డిరాజులకీర్తిని నిలబెట్టుచున్న నేటి నెల్లూరురెడ్లలోనొకరగు శ్రీ అల్లూరు వరదారెడ్డిగారికి ఈగ్రంథము అంకితముచేయబడినది. ఈగ్రంథమునందలి 'సీతాపరిత్యాగము' అనుప్రకరణము స్త్రీలు ముఖ్యముగ చదువదగినది. తెనుగునాట తమఉత్తమగ్రంథప్రచురణముచే ప్రసిద్ధికెక్కియున్న దీపాల పిచ్చయ్యశాస్త్రిగారీగ్రంథమునకు కర్తలు. గ్లేజుకాగితము. క్రౌనుసైజు 142 పుటలు. వెల రు. 0-12-0. చిరునామా: మేనేజరు, కళానిధి, నెల్లూరు.

శాలివాహనగాథాసప్తశతీసారము:—

హాలశాతవాహనుని ప్రాకృతగ్రంథమునందలి రత్నములకు తెనుగుసేత. పీనుమిగిలినవిమర్శకులై తెలుగు తల్లినిసేవించుచున్న రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ఆంధ్రీకర్త. పెక్కు తెలుగుగ్రంథములకు పీఠికవ్రాసి ఆంధ్రసారస్వతమునర్చించుచున్న శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారీగ్రంథమునకు విపులమగు పీఠికవ్రాసిరి. ఈగ్రంథమున ఏపద్యమున కాపద్యమే ఒకకావ్యముగానున్నది. భావములు అతినూతనములుగను, ముగ్ధమనోహరములుగఉన్నవి. మాతృకయు, అనువాదమును ఆంధ్రులసొమ్ము. ఈప్రశస్తగ్రంథము విశేషప్రచారము నందుగాకయని కోరెదము. దళసరి ఖేదరువెయిటుకాగితములపై అతిసుందరముగ ముద్రింపబడియున్నది. క్రౌనుసైజున 104 పుటలు. చిరునామా: సాధనప్రెస్, అనంతపురము.

హిమ్మత్ సింగు:—

శ్రీయుత గాదె రామకోటిరెడ్డిగారిచే సంపాదింపబడుచున్న భారతీగ్రంథమండలియం దిది రెండవ కుసుమము. వారణాసి లక్ష్మీనారాయణగారిచే రచియింపబడినది. Indian Chivalry అను గ్రంథమునందలి హిమ్మత్ సింగుకథనుగైకొని దీనిని పెంచి గ్రంథకర్తగారు నవలగావ్రాసిరి. కథానాయకుని పితృభక్తి ప్రశంసనీయముగనున్నది. రాజభక్తి, మిత్రప్రేమ, స్త్రీవిద్య మొదలగుగుణము లిందలిపాత్రలచే పోషింపబడినవి. సత్యసింహుని రాజభక్తి, సుజాబాయిసాహసము అద్భుతముగా ప్రదర్శింపబడినవి. ఇది అపూర్వపుగ్రంథము. క్రౌనుసైజున 270 పుటలు. వెల ఒకరూపాయి. చిరునామా: భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి.

మలబద్ధము:—

ప్రాకృతచికిత్సకులగు యస్. స్కాట్టుగారు పెక్కుపుస్తకములనుపరిశోధించి విశేషానుభవమునుసంపాదించి మలబద్ధమునుగూర్చివ్రాసిన వ్యాసమునకిది అనువాదము. అనువాదకర్త్రి శ్రీమతి జ్ఞానాంబగారు. వ్యాధులకు మూలకారణమగు మలబద్ధమును ఎంతటికాలమునుండియున్నదియైనను నివారించుటకు ఇందు చక్కని ఉపాయములు వివరింపబడినవి. ఆరోగ్యముకోరువారెల్ల చదువదగినది. క్రౌనుసైజున 60 పుటలు. ప్రకృతి చందాదారులకు వెల 0-8-0; ఇతరులకు వెల 0-12-0. దొరుకుచోటు: ప్రకృతికార్యాలయము, బెజవాడ.

ఋషిజీవనప్రకాశమ్:—

వివిధవిషయములనుగూర్చి మహనీయులిచ్చిన ఆలోచనను రేపు అభిప్రాయముల క్రోడీకరణమీగ్రంథము. బెజవాడ ప్రకృతికార్యాలయమున వెలకుదొరుకును. గ్రంథము ఆంగ్లమునగలదు. క్రౌనుసైజున 24పుటలు.

ప్రహ్లాదనారాయణయుద్ధము:—

విజ్ఞానప్రచారిణీగ్రంథమాలలో ౧౧-వ పుస్తకము. సంపాదకుడు పింగిలి లింబాద్రిరెడ్డిగారు. బాలకవి శతావధాని సంపన్ముడుంబ శింగరాచార్యప్రణీతము. ప్రహ్లాదనారాయణయుద్ధకథకుమూలము వ్యాసవిరచితమగు వామనపురాణమునగలదు. కథ నూతనమును, కవిత్వమురసవంతమును అయిఉన్నది. క్రౌనుసైజున 70 పుటలు. గ్లేజుకాగితములు. చిరునామా: విజ్ఞానప్రచారిణీగ్రంథమాల, నెమలికొండ, జగ్త్యాల, నైజాము.

శ్రీవెంకటేశ్వరవైభవము:—

ఇది శ్రీనృసింహయతియనెడు సన్న్యాసిస్వాములవారిచే విరచితము. పదునాలుగుశ్లోకములు. శ్రీమాన్ బ్రహ్మశ్రీ పర్ణశాల నృసింహాచార్యులవారిచే ఆంధ్రవ్యాఖ్యానము రచియింపబడినది. 'కలౌ వేంకటనాయకః' అగుట "శ్రీవేంకటేశ మమదేహి కరావలంబ"మను మకుటముగల ఇందలి 14 శ్లోకములు భక్తులుపఠింపదగినవి.

క్రౌనుసైజు. గ్లేజుకాగితములు. 16 పుటలు. వెల 0-2-0. చిరునామా: టంగుటూరి రామస్వామయ్య, 290, టంగసాలవీథి, జి. టి. మదరాసు.

**ఆంగీరసనామసంవత్సరగంటలపంచాంగం:—**

ఇది మూండూరు వీరభద్రసిద్ధాంతిగారిచే గుణింపబడినది. రాజమండ్రిలోని రాజవైద్య పొన్నాడ భాస్కరం అండ్ బ్రదర్సువారిచే ప్రకటింపబడియె. చిన్నసైజున జేబునందిముడునట్లు ముద్రింపబడినది. గడియలలోకాక కాలము గంటలలోచూపుటచే ఎల్లవారు సులభముగ ఈపంచాంగమునుచూచుకొనవచ్చును. తపాలవ్యయముకొఱకు 0-1-6 బిళ్లలుపంపువారికి ఇది ఉచితముగపంపబడును.

**వైరాగ్యసంగ్రహము:—**

ప్రథమసంచిక. మనస్సంబోధనము. గ్రంథకర్త పూరి సత్యనారాయణాచార్యులుగారు. భగవద్విషయమైన కొన్నిముచ్చట లిందు చేర్చబడినవి. చిన్నసైజు. గ్లేజుకాగితములు. 26 పుటలు. వెల 0-1-0. చిరునామా: పింగళిరెడ్డి అందుకో, నెమిలికొండ, జగిత్యాలతాలూకా.

**కావ్యామృతము:—**

ప్రథమద్వితీయభాగములు. కృతికర్త అల్లంశెట్టి అప్పయ్యగారు. ప్రథమభాగమున ప్రకృతివిషయములు, అన్యాపదేశవిషయములు. ద్వితీయభాగమున అనువాదములు. శ్రీయుతులు అల్లంశెట్టి అప్పయ్యగారు గృహలక్ష్మిపత్రికకు క్రొత్తవారుగారు. వీరిరచనములు ఈపత్రిక మనసునకెక్కినవే. 'శారదావివాహము' మొదలగుగీతములను చదువుచో వీరు కాలముమఱువనికవులని తెలియనగును. 'గ్రుడ్డియిల్లాలు' స్త్రీలు తప్పక చదువదగినది. సుందరముద్రణము. గ్లేజుకాగితములు. 70 పుటలు. వెల రు. 0-6-0. చిరునామా: వైద్యవిద్వాన్ చదువుల నందికేశ్వరరావుగారు, పొందూరు, విశాఖపట్టణముజిల్లా.

**ఆరోగ్యదీపిక:—**

కళింకోట ఆరోగ్యశిశువార ప్రదర్శనసంఘమువారు ప్రచురించినది. కళింకోట కుమారరాజావారు ఈ ఆరోగ్యశిశువార ప్రదర్శనసంఘమునకు చేయుచున్న సహాయమును, దానియెడ వారుచూపుచున్నశ్రద్ధ ప్రశంసనీయములుగనున్నవి. మనజమీందారులెల్లరును వీరితీరు అవలంబించుటకు ప్రయత్నింతురుగాక.

**జన్మభూమి:—**

కరుణరసభరితమగు నవ్యనాటిక. జువెనిల్ బడ్జెట్టులోని హృదయంగమమగు నొకచిన్నకథనుగ్రహించి స్వదేశవిదేశమహాకవుల ఉన్నతభావములను క్రోడీకరించి శ్రీముద్దా విశ్వనాథముగారు దీనిని రచియించిరి. ఈచిన్నినాటికనుచదువుచుండగా ఉద్రేకముకలుగును గాని శుచిభావమునువీడము. కథానాయకుడగు రాఘవరావు పితృభక్తి నిరుపమానము. దేశసేవాపరాయణులు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు దీనికి చక్కనిపీఠిక వ్రాసియున్నారు. ప్రతివిద్యార్థికరకమలమునందును ఈగ్రంథప్రతియొకటి యుంచదగినది. చక్కనిఅచ్చు, ఆకృతి అతిసుందరము. గ్లేజుకాగితములు. 52 పుటలు. వెల రు. 0-3-0. ప్రకాశకులు: వ్యాసకుటీరము, యలమంచిలిదగ్గఱ, మేలుపాక, విశాఖపట్టణముజిల్లా.

**మాధవశతకము:—**

కమ్మకులచంద్రులును, ఆశుకవీంద్రులును, శతావధానులునుఅగు శ్రీఇనగంటి పున్నయ్యచౌదరిగారిచే రచియింపబడినది. మాధవాయనుమకుటము. అన్నియు ఉత్పలమాలలు. కవిత్వము ధారావేగమున నొప్పు

చున్నది. భక్తిని ఉద్దీపింపచేయుటయేగాక సంఘదురాచారములను తిరస్కరింపజేయునదిగాకూడనున్నది. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు. 24 పుటలు. వెల రు. 0-4-0. వలయువారు గ్రంథకర్తపేర బాపట్లతాలూకా, అప్పికట్ల వ్రాయవలయును.

కష్టజీవి:—

శ్రీయుత తంగిరాల రామనాథశర్మగారిచే రచియింపబడినది. ఆంధ్రసాహితీగ్రంథాలయమున మొదటి పుష్పము. పద్యకావ్యము. నవలవలె చదువదగియున్నది. శృంగారాదిరసములుగలవు. పెక్కువిషయములు బోధింపబడినవి. కవిత అత్యంతసులభముగానున్నది. దేవతాప్రార్థనాదికములు మొదలగువానిని తడవక వీరీ గ్రంథమునురచించుట క్రొత్తమార్గము. కావ్యాంశములుకొన్ని అపూర్వములు. ఉపమలు అతివిస్తరము. డెమ్మీసైజు. గ్లేజుకాగితములు. 106 పుటలు. ప్రతివెల రు. 1-0-0. దిట్టమైన అట్టబెండు. చిరునామా: మేనేజరు, ఆంధ్రసాహితీగ్రంథాలయము, నెల్లూరు.

సాంఘికదర్పణము:—

విజ్ఞానప్రచారిణీగ్రంథమాల ౧౮-వ కుసుమము. సంపాదకుడు పింగిలి లింబాద్రిరెడ్డిగారు. గ్రంథకర్త మల్లాది నాగభూషణముగారు. స్వామివివేకానంద, భగవాన్ తిలకు మొదలగు భారతమహాశయులగ్రంథముల సాయమున ఈగ్రంథము రచియింపబడినది. మూఢవిశ్వాసములుఅను ప్రకరణము ముఖ్యముగ చదువదగియున్నది. క్రౌనుసైజున 100 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు. 1-8-0. చిరునామా: విజ్ఞానప్రచారిణీగ్రంథమాల, నెమిలికొండ, జగ్త్యాల.

పశుపరీక్ష:—

వరాహమిహిరకృతము. గంధర్వమహల్ ప్రొప్రయిటరులగు డి. జె. శర్మగారు పశుపరీక్షనుగూర్చి వరాహమిహిరుడు సూత్రప్రాయముగ సంస్కృతమునచెప్పినసంగతులను ఇందు ఆంధ్రవివరములతో కూర్చిరి. ప్రస్తావోచితముగా విశేషాంశములు చేర్పబడినవి. రైతులకు ముఖ్యమైనది. ప్రాచీనార్యసభ్యత కొంతకుకొంతకువెల్లడిచేయు ఈగ్రంథము విరివిగా వెలకుబోవునని నమ్ముచున్నారము. ఫూల్‌స్కాప్ చిన్నసైజు. 48 పుటలు. గంధర్వగ్రంథమాలికలో చతుర్థసారిక. వెల రు. 0-4-0. వలయువారు విజయనగరములోని గంధర్వమహల్ వారికిగాని, రాజమండ్రిలోని దువ్వూరిబ్రదర్సువారికిగానివ్రాసిన బడయగలరు.

మధురావిజయము:—

విజయనగర సింహాసనాధీశ్వరుడైన బుక్కదేవరాయని కొడుకగు వీరకంపరాయని భార్యయగు గంగాదేవి సంస్కృతమున రచించిన కావ్యమునకు తెనుగు. ఇదియొక చారిత్రకకావ్యము. రంగాజమ్మ తెలుగున రచియించిన మన్నారుదాసవిలాసము ఎట్లుభర్తృచరిత్రాత్మకమో గంగాదేవిరచించిన ఈకావ్యమును అట్లు భర్తృచరిత్రాత్మకము. చందవోలు గ్రామవాస్తవ్యులైన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకర్తలు. గంగాదేవి తెలుగుస్త్రీయని మానమ్మకము. ఒరుగల్లు ప్రాంతమునందలి గంగాధర, విశ్వనాథ కవులను ప్రస్తావించినది. తిక్కనసోమయాజినికూడ ఈమెస్తుతించి యున్నదనవలయును. దసరాసంచికలో ఈమధురావిజయమునుగూర్చి ప్రత్యేకవ్యాసము ప్రచురించియున్నారము. స్త్రీరచితమగు ఈఉత్తమగ్రంథము సులభసుందరశైలిగల పద్యములలోనికి అనుపదింపబడి ఇట్టి గ్రంథరూపమున ప్రచురింపబడియున్నది గావున ఆంధ్రులు ఈకావ్యమును తప్పక చదువుదురుగాకయని కోరెదము. క్రౌనుసైజున 105 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు. 0-10-0. వలయువారు బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి, రామలింగేశ్వరపేట, తెనాలి, అని వ్రాయునది.




### తిరిగి స్వర్గలోకమున కలసికొందము:—

జపానుదేశస్త్రీల దేశభక్తి నిరుపమానమైనది. కావున ఈజపానుదేశభక్తురాలిచేతకు ఉపమానము వెదకుట వ్యర్థము. కియోల్చిఅని ఆమెపవిత్రనామము. ఆమెకు ఇరువదియొక్క వత్సరము. భార్యయై ఎంతయోకాలము కాలేదు. మగడు సైనికుడు. జపానుకు మంచూరియాతో యుద్ధముపొసగెను. మగడుయుద్ధభూమికిపోయెను. పోయెనేగాని యావనసుఖములనుగూర్చి కల్పనములు గావించుకొనుచు తనధర్మమును విస్మరించునేమోయని ఆవీరపత్నికి తోచెను. మగడు తనవిధ్యుక్తధర్మమును విస్మరింపకుండచేయుటఎట్లు? ఆతనిసుఖమయకల్పనలకు తావలమైన తానీలోకమును బాయుటచేతనే. అన్నినగలు అలంకరించుకొన్నది. మంచి బట్టలు కట్టినది. ముఖమును తీర్చిదిద్దుకొన్నది. గృహదేవతకు ఎదురుగ కూర్చున్నది. కత్తిని పట్టినది. కంఠమునందలి ఒకనరమును కోసికొన్నది. ప్రాణములను బాపుకొన్నది. ఆమె మగనికివ్రాసిన తుదియుత్తరమున ఇట్లున్నది: "నీప్రేమకు ప్రణామములు. కొద్దిదినముల పాటిదైన మనగృహస్థజీవితము నిశ్చలానందయుతము. నన్నుగూర్చి ఎట్టిచింతయు పెట్టుకొనకుము. నీపూర్తిశక్తితో దేశమును సేవింపుము. నన్నునుండి నిన్ను విడిపించిపోవుచున్న నా ఆనందమును వెల్లడించుటకు పదములుచాలవు. వీరునివలె నీవు వెళ్ళియున్నందుకు నిన్ను అభినందించుచున్నాను. నే నీలేఖతో 5 పౌనులు పంపుచున్నాను. అవి నీతోడిసైనికులకు ఈయగలవు. నాతుదిప్రార్థనమొకటి. నీజీర్ణశక్తి కొంచము మందమైనది. దానివిషయమై మిక్కిలి జాగ్రత్తగ నుండవలయును. నేను సంతోషచిత్తముతో చనిపోవుచున్నాను. ఉత్తరలోకమున జీవితము శాశ్వతమైనది. తిరిగి మనమచ్చట కలసికొందము." ఆమె ఆజ్ఞానుసారము ఆసైనికుడు ఆమెనుగూర్చి ఎట్టిచింతయు పెట్టుకొనలేదు. అంత్యక్రియలకైన పోలేదు. మంచూరియాయుద్ధభూములలోనిలచి దేశసేవయందు పరివ్యాప్తుడయ్యెను. ఇది మొన్నటివిషయము.

### లేడీహార్డింజి మెడికలు కాలేజీకి గ్రాంటు:—

అసెంబ్లీసభకుచెందిన స్టాండింగుఫినాన్సు కమిటీవారు 1932-33-వ వత్సరమునకు ఢిల్లీయందలి లేడీహార్డింజిమెడికలుకాలేజీకిని, హాస్పిటలుకును కలిపి మూడులక్షల రూపా

యలను గ్రాంటుచేసిరి. స్త్రీయుద్యమాభిమానులకందఱకును ఈవార్త సంతోషమును కలిగింపగలదు. ఈకాలేజీలో వివిధరాష్ట్రములనుండివచ్చు ఉన్నతవైద్యవిద్యార్థినులకు సౌకర్యములు ఏర్పాటుచేయు విషయమును కూలంకషముగ చర్చించుటకు దివానుబహాదురు హారవిలాసశారద, గయప్రసాదసింగు, జి. మోర్గనుగార్లు ఉపసంఘముగ నియమింపబడిరి. స్త్రీజనాభివృద్ధికి ప్రాపకులగువారిలో నొకరైన హారవిలాసశారదగారి యాజమాన్యమున ఈ ఉపసంఘము వివిధరాష్ట్రములకు లాభకరములగు సూచనలుగావించునని నమ్మెదము.

లీడ్సు విశ్వవిద్యాలయమునకు భూరి విరాళము:—

లార్డుబ్రాథర్టన్‌గారు తమ మరణకాలమున లీడ్సువిశ్వవిద్యాలయమునకు 100,000 పౌనులను విరాళమిచ్చిరి. జీవితకాలమునకూడ వారీవిశ్వవిద్యాలయమునకు విశేషవిరాళము లిచ్చియుండిరి. విశ్వవిద్యాలయమునకుచేర్చి పుస్తకభాండాగారమందిరము కట్టుటకు 100,000 పౌనులును, బాక్టీరియాలజీప్రొఫెసరుషిప్ ఏర్పఱచుటకు 20,000 పౌనులును వారీవఱకిచ్చియుండిరి. జీవితకాలమునఇచ్చిన ఈ 120వేల పౌనులుగాక మరణకాలమున 100,000 పౌనులుయిచ్చిరి. ఇట్టి చేతికిఎముకలేని వదాన్యులుండిరి కావుననే పాశ్చాత్య విశ్వవిద్యాలయములు విశ్వవిఖ్యాతిని గాంచుచున్నవి. ఏవిశ్వవిద్యాలయమైనను ఇట్లు విరాళములనుపొందుట వినినపుడెల్ల మాకు ఆంధ్రవిశ్వవిద్యాలయము తలపునకు వొఱచుండును. ఆంధ్రదేశమునందలి లక్ష్మీపుత్రులు తమదైన ఈవిశ్వవిద్యాలయమునకు విశేషముగ సాయముచేయకుండుటకు విచారింతుము. ఈనడుమ కొన్నిషరతులతో శ్రీఅల్లాడి కృష్ణస్వామిఅయ్యగారు మనవిశ్వవిద్యాలయమునకు ఏడాదికి వేయిరూపాయిల చొప్పున విరాళమిచ్చుటకు ప్రారంభించిరనివింటిమి. వీరి ఈమార్గమును ఇతరఆంధ్రమహాశయులును అవలంబింతురుగాకయని కోరెదము.

డాక్టరు గణేశప్రసాదుగారి వితరణ:—

డాక్టరు గణేశప్రసాదుగారు కలకత్తా విశ్వవిద్యాలయపు గణితశాస్త్రోపాధ్యాయులు. బాలికలవిద్యాభివృద్ధికై వారు ఇరువదిరెండువేలరూపాయిలనిధిని సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వమువారికి అందచేసిరి. ఈనిధి కృష్ణకుమారినిధియని పిలువబడును. విద్యాశాఖాధికారియాజమాన్యమున ఈనిధి నిర్వహింపబడును. స్కూలుఫైనలుపరీక్షలో గౌరవముగ జయమునుపొంది కళాశాలవిద్యను గ్రహింపబోవు హిందూబాలికలకు—కులవివక్షతలేదు—ఈ నిధినుండి ధనరూపకములగు బహుమానములీయబడును. బాలియాజిల్లా హిందూబాలికలకే ఈబహుమానములుద్దేశింపబడినవి. బాలియాజిల్లాలో ఈబహుమానము పొందదగిన హిందూబాలికలులేనియెడల ఇతరజిల్లాలలోని హిందూబాలికలు ఈబహుమానము పొందుటకు అర్హులు. విద్యావిషయికములగు ఇట్టివిరాళములు భారతదేశమున మిక్కిలి అరుదు. గణేశప్రసాదుగారివంటివారు పలువురకు దేశమాత నోచుకొనునుగాక!

**ఫ్రెంచి స్త్రీలకు ఓటింగు హక్కు:—**

ఫ్రెంచిస్త్రీలకు ఓటింగుహక్కు ప్రసాదించుట మొదలగు కొన్ని మార్పులను చేయు నుద్దేశముతో ప్రవేశపెట్టబడిన ఫ్రెంచిఎలక్టోరల్ బిల్లును ఫ్రెంచిసినేటువారు త్రోసిపుచ్చిరి. స్త్రీస్వాతంత్ర్యము చిలువలుపలువలు పెట్టియున్నదని మనమభావించుచున్న ఫ్రాంసుదేశమునకు చెందిన సినేటుసభవారు స్త్రీలఓటింగుహక్కులవిషయమున నింతటి సంకుచితముగ మెలగిరి. కాలమహాపురుషుడు కొనివచ్చుచున్న మార్పులను కన్నులుండియు ఆసినేటుసభికులు చూడలేదు. ఇందువిషయమై లావెల్ మంత్రివర్గమువారు రాజీనామానిచ్చిరి. ఫలితమెట్టిదగునో చూడవలసియున్నది. నవీననాగరికతలో మునిగితేలుచున్న పాశ్చాత్యదేశమందలి శాసననిర్మాణసభసభికులే స్త్రీసమస్యలపట్ల నింతటి ప్రతికూలమును వహించుచుండ పూర్వాచారమునకు పాదుఅయిన భారతదేశమునందలి శాసననిర్మాణసభసభ్యులు స్త్రీసమస్యలపట్ల ఎంతటి ప్రతికూలమును వహించినను ఆశ్చర్యము గొలుపదు.

**శ్రీ సూర్తంకరుసతి విజయము:—**

ఈనడుమజరిగిన బొంబాయికార్పొరేషనువారి ఎన్నికలలో సూర్తంకరుసతి అఖండ విజయమునందినది. ఏఒక్కసభ్యుడును పొందనన్ని ఓట్లు—19, 817—ఆమె పొందినది. ఈరీతిని బహిరంగమగు ఎన్నికలలో స్త్రీజయమందుటకు బొంబాయికార్పొరేషను చరిత్రలో నిదియేమొదలు. బొంబాయికార్పొరేషనుయొక్క గతసభయందును ఈమె సభ్యురాలుగనుండినది. పాఠశాలల కమిటీయందు నాలుగుసంవత్సరములు సభ్యురాలుగనుండినది. గతకార్పొరేషనుసభలో ఈమె స్త్రీలకుకొన్ని సభ్యత్వస్థానములు ప్రత్యేకింపబడవలయునని తీర్మానమును గొనివచ్చినది. ఆతీర్మానము నెగ్గలేదు. ఈఎన్నికలలో ఈమె గొప్పగా నెగ్గుటచే స్త్రీలకు ప్రత్యేకస్థానములు ఏర్పరచకుందురుగాక, వారు బహిరంగమగు ఎన్నికలలోనే సాఫల్యవిజయమందగలుగని ఇందుమూలమున వెల్లడించినది. అఖిలభారతస్త్రీజనసభతోడను, భారతస్త్రీల జాతీయసంస్థతోడను ఈమెకు సంబంధముకలదు. సాంఘికసమస్యలందు ఈమెకు మంచి అభినివేశముగలదు. ఇంతమందిఓటర్లు తమఓట్లు ఈమెకు ఇచ్చియుండుట ఈమె ఈవరకు కార్పొరేషనులో చేసియున్నపనికి యోగ్యతాపత్రము, ఇకముందు చేయబోవుపనికి నమ్మికపత్రము.

**శ్రీ తుని రాజావారి పట్టాభిషేకము:—**

మహితలు, మాన్యలు అగురమణులను ఆంధ్రచరిత్రకు అర్పించిన, అర్పించుచున్న ఆంధ్రక్షత్రియకుటుంబములలో అగ్రసరమైనదగు వత్సవాయవంశమువారి తునిజమిందారీని (కొర్టాఫువార్డ్సుయస్టేటును) ఇరువదివత్సరములుగ కోలంక దంతులూరివారియాడపడుచులును, కీర్తిశేషులగు శ్రీరాజా వత్సవాయి వేంకటసింహాద్రిజగపతిరాజుగారి సతీమణులునగు

రాణీ సుభద్రయాంబజగపతి బహద్దరు జమీందారిణివారు పరిపాలించుచు ఆంధ్రరమణుల రాజ్యపాలనాకౌశల్యమునకు నిదర్శనముగానున్నారు. వారు 19-2-32తేదీని శ్రీకుమార రాజా శ్రీసూర్యనారాయణజగపతి బహద్దరువారికి పట్టాభిషేకమహోత్సవము జరిపించి రాజ్యాధికారమును ఒప్పగించిరి. మహత్తరమైన వారిఆశీర్వచనముతో శ్రీసూర్యనారాయణజగపతిబహద్దరువారు పరిపాలనము ప్రారంభించిరి. శ్రీవారు విద్యారసికులును, కావ్యగీతిప్రియులును అయియున్నారు. వారిప్రాపకమున ఆంధ్రసారస్వతమునకు నూతనాభ్యుదయము కలుగగలదని ఆశింతుము. శ్రీవారికి శుభపరంపరకలుగునుగాక!

**హిందూవిశ్వవిద్యాలయమునకు భూరివిరాళము:—**

శ్రీకాశీమహారాజావారి పట్టాభిషేకమహోత్సవసందర్భమున సంయుక్తరాష్ట్రప్రభుత్వపు హోముమెంబరు నవాబు సర్. మహమ్మదు. ముజాముల్లాఖానుగారు కాశీకివచ్చినపుడు పండిత మదనమోహనమాలవ్యాగారితోకూడ హిందూవిశ్వవిద్యాలయమును చూడనేగిరి. వారు ఆవిశ్వవిద్యాలయనిధికి పదివేలరూపాయిలు విరాళమొసగిరి. మహమ్మదీయులయ్యు హిందూవిశ్వవిద్యాలయమునకు ఈభూరివిరాళమిచ్చుటచే విద్యాభిమానమునేగాక తమ సర్వసమత్వభావమును వారు వెల్లడించుకొనిరి.

**కీ. శే. మారియన్ ఫిలిప్సు:—**

సాంఘికసేవయందు చీమునెత్తురులు వెచ్చించిన ఆంగ్లస్త్రీ. ఆంగ్లదేశమున లేబరు పార్టీ నిర్మాణమునకు కారణభూతులైన ప్రజ్ఞావంతులలోనొకతె. వెనుకటి పార్లమెంటునందు సందర్లాండునకు ప్రతినిధురాలుగనుండినది. తనకు ఏబదియొక్కటవ వత్సరమున జనవరి తుదివారమున ఆమె మరణించినది.

**తాళిబొట్టు తెంపించిన ఉద్యోగి క్షమాపణకోరినాడు:—**

తెల్లిచేరియందు కోర్టులో జరిమానాకొఱకు ప్రభుసతిగారి మంగళసూత్రమును తెంపించి హిమాలయశిఖరమును ముట్టినకీర్తినిసంపాదించిన ఉద్యోగి డాడ్వెల్ క్షమాపణ కోరినాడు. ప్రభుత్వమువారొకప్రకటనగావించి అందుతో ఆవిషయమును తుదముట్టించిరి.

**దంపతులఏకకాలమరణము:—**

గౌడబ్రాహ్మణులు. ఎలమంచిలితాలూకా సత్యవరము కాపురస్థులు. డబ్బీరు వంశీకులు. భర్త నారాయణయ్య, వయస్సు 105 వత్సరములు. భార్య లక్ష్మీదేవమ్మ, వయస్సు 95 సంవత్సరములు. పురాణదంపతులగు పార్వతీపరమేశ్వరులనుబోలిన ఈవృద్ధదంపతులు ఒకగంటవ్యత్యాసములో జనవరిమాసమున సంక్రాంతిపర్వదినములకుముందు మరణించిరి. చనిపోవువఱకును ఈదంపతులు దృఢగాత్రులై యుండిరి. ఏకకాలమున మరణించిన ఈపుణ్యదంపతులను ఏకముగుచితిపై దహనమొనర్చిరి. దంపతీభావమునకు పూర్ణత్వము కలిగినది. ఎంతటి పుణ్యవర్తనులగు దంపతులకోగద ఇట్టి అపూర్వమరణము!

1932 March

# డైరి

## జనవరి

**20**:—బొంబాయి. ఫ్రీప్రెస్సుజర్నలుఎడిటరు సదానందుగారిభార్య ఎరస్టు. పురుషోత్తమత్రికందాను సతిగారికి 6 నెలల కఠినశిక్ష, 50 జుల్మానా, లేదా 6 వారముల అదనపుశిక్ష. శ్రీమతి గోషెపుకెప్టెనుసతిగారి ఎరస్టు.

:—కలకత్తా. లక్ష్మీదేవిఆచార్యగారి అరెస్టు. శ్రీమతులు అమితదత్తు బి.ఏ. విభాదత్తు బి.ఏ. గార్ల అరెస్టు.

:—సేలం. కామాక్షమ్మగారికి రు. 200 జరిమానా, లేదా 2 నెలల విడిఖైదు.

:—గోబిచెట్టిపాలెం. గోవిందమ్మాళ్, నాబాయిగార్లకు 6 నెలలు విడిఖైదు.

:—మదరాసు. అంబుజమ్మ, జానకమ్మ, కమలాబాయిగార్లకు చెరి 6 నెలలుశిక్ష.

**21**:—మంతెనవారిపాలెము. మంతెన అచ్చయ్యమ్మ, సుఖవాసి భ్రమరాంబ, మంతెన చినఅచ్చయ్యమ్మ, దంతలూరు సుబ్బయ్యమ్మగార్ల ఎరస్టు. చెరిఆరుమాసముల కఠినశిక్ష. సి క్లాసు.

:—ఏజన్సీపోలవరము. చేబియ్యం సోదమ్మ, తూము చూడమ్మగార్ల ఎరస్టు.

:—గోవాడస్త్రీలు చిలకమర్రి రామానుజమ్మ, తుమ్మలచిన్నమ్మాయి, పర్వతనేనికౌసల్యమ్మగార్లకు చెరి 6 నెలల విడిఖైదు. రామానుజమ్మకు బి క్లాసు.

:—కోమిల్లా. శ్రీమతులు నిర్మలసర్కారు (అభయాశ్రమకన్యాశిక్షాలయాధ్యక్షురాలు) స్నేహలతాపాల్, సరోజబోసుగార్లకు ఒకసంవత్సరము విడిఖైదు.

:—బ్రహ్మపురము. ప్రమిళా, కమలా, బలరాణి, జ్యోతిర్మయదేవులకు ఆరేసినెలలు కఠినఖైదు.

:—కలకత్తా. లాల్ మోహనమిత్రగారికూతురికి 6 నెలలు కఠినశిక్ష, రు. 7 జరిమానా.

**22**:—కంకిపాడుస్టేషనుయిలాకా కొమ్మమూరుగ్రామము. గాది సుబ్బమ్మ, రామినేని రాజమ్మ, మయినేని శ్రీరామమ్మ (రెండుఏండ్ల పిల్లవానితోసహా) అరెస్టు. 17-1 క్రి. అమెండుమెంటుఆక్టుప్రకారము, ఎమర్జెన్సీఆర్డినెన్సు 3-32ప్రకారము బెజవాడలో విచారణ. ఒక్కొక్కరికి ఏడాదిశిక్ష. సి. తరగతి.

:—చేబ్రోలు. సూర్యదేవరకుటుంబమున రాజ్యలక్ష్మమ్మ, అన్నపూర్ణమ్మ, రాజలక్ష్మమ్మ ముగ్గురిఅరెస్టు.

:—కడలూరు. అంజలేఅమ్మాళ్ గారికి 3 నెలలు కఠినశిక్ష. సి. క్లాసు.

:—కోమిల్లా. యమునాఘోషు, సురుచిచౌదరిమనలత, సర్కార్ ఆరునాముజందార్లకు 6 నెలల కఠినశిక్ష.

**23**:—లాహోరు. సర్ గంగారామ్‌గారికోడలు ఎరస్టు. శాంతిదేవి, లజ్జావతి, విద్యావతిగార్లవిచారణ. చెరి రు. 25 జరిమానా, లేదా, 1 నెలఖైదు. సి. క్లాసు.

:—బొంబాయి. బాహిబెను దేశాయిగారికి 8 నెలలు కఠినశిక్ష, రు. 200 జరిమానా, లేదా 2 నెలలశిక్ష సేనాబాయిరావు అనునామెకు 6 నెలలశిక్ష.

:—కలకత్తా. లక్ష్మీబెన్, కుమారినిమతాయిగార్లకు మూడేసినెలల విడిఖైదు.

:—కాన్పూరు. షింతాదేవి, లండాదేవిగార్ల అరెస్టు.

:—జలాల్పూరులో మహాలయకామబేన్, కళావతిబేన్, మధుమతిబేన్ గార్ల అరెస్టు.

**24**:—యలమర్రుకాపురస్తురాలు ప్రస్తుతము తేలప్రోలులోనున్న కోనేరు అనసూర్యావతిగారిపై పికెటింగుకేసు. నూజవీటిలోవిచారణ. ఆరుమాసములశిక్ష. సి. తరగతి.

**25**:—పెదపులిపర్రు. తట్టా నరసమ్మ, దేవినేని శ్రీరాజలక్ష్మమ్మగార్లకు చెరి 6 నెలలకఠినశిక్ష. సి. క్లాసు.

:—కలకత్తా. కౌసల్యాదేవి, లక్ష్మీదేవి, మరియిద్దరుస్త్రీల ఎరస్టు.

:—తణుకు. దేవులపల్లి సత్యవతమ్మగారికి 6 నెలల కఠినశిక్ష, రు. 200 జరిమానా, లేదా మరి 6 వారములశిక్ష.

27:—చేబ్రోలు. సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మ, సూర్యదేవర అన్నపూర్ణమ్మ, సూర్యదేవర రాజలక్ష్మమ్మ వీరిముగ్గిరికిని ఒక్కొక్కసంవత్సరం శిక్ష, రు 200 జరిమానా లేదా మరిరెండు నెలలు శిక్ష.

:—మచిలీపట్టణము. తంగిరాల సీతారామమ్మ, త్రిపురనేని కౌసల్యమ్మగార్లను పికెటింగు చేయుచుండ పోలీసుస్టేషనుకు తీసుకొనిపోయి వసంతపుసీళ్లతో కొట్టి వదలివైచిరి.

:—రేపల్లె. నాదెళ్ల రంగమ్మ, కొత్తపల్లి రంగమ్మ (బేతపూడి) కొల్లిరత్నమ్మ (శింగుపాలెం) గార్లు బేతపూడిగ్రామములో కరపత్రములు పంచిపెట్టినందుకు ఎరస్టు.

:—కలకత్తా. బెంగాలు 15-వ డిక్టేటరు శ్రీమతి జోతిర్మయీగంగూలికన్యగారికి ఒకసంవత్సరము విడిఖైదు. శ్రీమతులు రామదేవి, గంగాదేవిగార్లకు చెరి 6 నెలల కఠినశిక్ష.

:—బర్హాంపూరు. మృణాళిదేవిగారికి 6 నెలలశిక్ష.

:—బాలోర్ఘటు. శ్రీమతి రాజలక్ష్మిగుహ (70 ఏండ్లది) 8-వ నియంత్రి అరెస్టు.

:—అలహాబాదులో కాంగ్రెసునాయకప్రముఖుడయిన నర్మదాప్రసాదసింగుగారిభార్య, కుమార్తె, దాసీమనిషి అరెస్టు. సింగుగారిభార్యతో ఒకటిన్నరఏళ్ల ప్రాయముగల బిడ్డఉండెను.

:—రాజమండ్రి. మద్దూరి వేంకటరమణమ్మ, కాశీభట్ల వేంకటరమణమ్మ, శివరాజు సుబ్బమ్మగార్ల కేసు విచారణ. మద్దూరి వేంకటరమణమ్మ, శివరాజు సుబ్బమ్మగార్లకు చెరి 5 మాసముల కఠినశిక్ష. సి. క్లాసు. కాశీభట్ల వేంకటరమణమ్మగారికి 2 వారముల విడిఖైదు. ఏ. క్లాసు.

:—పూనా. పద్మావతిహరోలిక ఎరస్టు.

28:—చేబ్రోలు. పాటిబండ్ల పార్వతమ్మగారు విదేశవస్త్రములదుకాణములవద్ద పికెటింగు చేసినందుకు ఎరస్టు.

:—రేపల్లె. 26, 27 తేదీలయందు అరెస్టయిన 6 గురుస్త్రీలవిచారణ. చెరియొకఏడాది కఠినశిక్ష. సి క్లాసు.

:—మధురలో డాక్టరు పిచ్చిముత్తుకన్యగారికి క్రిమినల్‌లా అమెండుమెంటు ఆక్టుక్రింద ఏడాదికఠినశిక్ష. సుబ్బరామన్‌సతి, సుందరరామన్‌సతిగార్లకు చెరి ఆరునెలలకఠినశిక్ష. బి క్లాసు.

:—అహమదాబాదు. పద్మామోహతాకన్యకు 6 నెలలు విడిఖైదు, రు 100 జుల్మానా లేక ఒకనెల అదనపుశిక్ష.

29:—అమృతసరము. బట్టలబజారు పికెటింగు. శ్రీమతి కనోన్దేవి, మరియిరువురిఅరెస్టు.

:—బోగ్రాబజారులో పికెటింగు చేసినందుకు శ్రీమతి చారుబలాగుహారాయిసతికి 3 నెలలశిక్ష.

:—నాగపూరు. గంగాబాయిచౌబేగారికి 9 నెలల కఠినశిక్ష. రు. 100 జరిమానా.

:—అహమదాబాదు. ఊరేగింపు. బంధుమతీఠాకోరుగారి, మరిఅయిదుగురుస్త్రీల అరెస్టు.

:—కలకత్తాలో శ్రీమతి సర్యాభట్టాచారిగారి అరెస్టు.

30:—బొండాడగ్రామములో నిర్బంధింపబడిన శ్రీమతి వారణాసి సీతమ్మగారిని వదలివేసిరి.

:—పూనాలో పద్మావతిబాయిహరోలేకర్‌గారికి 1 సంవత్సరముఖైదు.

:—మొగల్రాజపురం కాపురస్థురాలు, ధనికురాలునుఅగు శ్రీమతి కాట్రగడ్డ శీతారామమ్మగారికివిధించిన నాలుగువందలజరిమానాను వసూలుచేయుటకై పోలీసువారు బస్సులో మొగల్రాజపురంవెళ్లి శీతారామమ్మగారికోడలును జరిమానాచెల్లించవలసినదిగ అడిగిరట. జరిమానాతో తమకు నిమిత్తములేదని కోడలుగారుచెప్పినంతలో ఆమెగారివద్దనున్న సొమ్మును జప్తుచేసితిమనిరట. అందుపై తమవద్దనున్న నగలను తీసిఇచ్చిరట. నగలతో మరికొంత చరాస్తికూడ జప్తుచేయబడినది.

:—కరాచి. నిర్మలలాల్వానీ విద్యార్థినికి స్వామి గోవిందానందముఖిటోపన్ గారిభార్యకు రెండేండ్లుఖైదు. అక్రమసంఘములో సభ్యురాలుగనున్నందుకు శ్రీమతి లావణ్యా ప్రోవాదత్తుసతికి 3 నెలల కఠినశిక్ష రు. 108 జరిమానా, కట్టనిచో మరి ఒక నెల కఠినశిక్ష.
:—ఆగ్రాజిల్లాలో రాష్ట్రీయమహిళాసమితులను రాష్ట్రీయప్రభుత్వమువారు నిషేధించిరి.
:—గుజరాతురాష్ట్రపు డిక్టేటరుగానుండిన డాక్టరు కానుగాగారిభార్య శ్రీమతి విజయగౌరిసతిపైవిధించిన రు. 300 జరిమానాను యింటియందలిసామానును జప్తుచేసి పోలీసులు వసూలుచేసిరి.
:—పూరీ. పోలీసుఉత్తరువులనుల్లంఘించి సభలో ఉపన్యసించినందులకు శ్రీమతి గాణమంజరీదేవి, నిసామణి దేవిగార్లకు చెరి 50 రూపాయలు జరిమానా, లేదా ఒక నెల కఠినశిక్ష.
:—గోగినేని రంగాగారిసతి భారతీరంగాగారు నిడుబ్రోలులో ఎరస్టు. పొన్నూరు తీసికొనిపోబడిరి.
:—లాహోరు. పతాకోత్సవము. శ్రీమతి రానురక్షగారిఎరస్టు.

## ఫిబ్రవరి

1:—లక్నోలో 144 శెక్షనుమీరినందుకు గార్గిదేవి ఎరస్టు.
:—హౌరా. కరుణామయిదేవి. ప్లీడరుభార్య. 6 నెలలశిక్ష.
:—కలకత్తా. కుమారి అమితదత్తు (ఎం. ఏ. విద్యార్థిని) నాలుగునెలలుశిక్ష అనుభవించుచున్నది. కరపత్రములు ప్రకటించెనను వేరొకనేరమునకై విచారింపబడెను. పోలీసువారు కేసు ఉపసంహరించుకొనుటచే ఆమె విడుదలచేయబడెను.
:—బాలసూరు. నల్లమందుపికెటింగుకై అహల్యాదేవియు, మరిఏడ్గురుస్త్రీలు ఎరస్టు.
:—మెహర్పూరు. ఉత్సవముజరిపిన లీలావతిదేవి అరెస్టు.
:—బేలూరుగాటు. గాంధిబాలికావిద్యాలయస్థాపకురాలు సరళరాయిగారికి 6 నెలలశిక్ష.
:—కరీంగంజి. పికెటింగు సరోజినిపాలు, గిరిజబాలగుప్తలకు చెరి 6 నెలలుశిక్ష.
:—బొంబాయి. తొమ్మిదవ సత్యాగ్రహసంఘమునకు అధ్యక్షురాలగు శ్రీమతి సుభద్రాదేవిగారును కార్యదర్శులగు శ్రీమతులు జయదేవి, సరళాదేవిగార్లును నిన్నను చౌపట్టీలో జాతీయపతాకము నెత్తబోయినందులకు ముగ్గిరికిని చెరియొకవత్సరము కఠినశిక్ష, 300 జుల్మానా లేక మరినాలుగునెలలు శిక్ష వేయబడెను. వీరు ముగ్గురు అక్కచెల్లెండ్రు.
:—చేబ్రోలు. గొల్లమూడి రత్తమ్మ, వాసిరెడ్డి పార్వతమ్మ, పాటిబండ్ల అన్నపూర్ణమ్మగార్ల ఎరస్టు.
:—తిన్నవెల్లి. లక్ష్మమ్మ సోరనాదమ్మాళ్ ఏడాది విడిఖైదు. రు. 300 జరిమానా లేదా మరి 6 నెలలు.
:—మంగుళూరు. మరుదేశ్వర సీతారత్నబాయి, కల్యాణిబాయిగార్లకు నాలుగునెలలు కఠినశిక్ష.
:—బెల్గాం. శాంతాబాయిగారి అరెస్టు.
:—కాకినాడ. పంచాంగము రామానుజమ్మ, తట్ట ఆండాళమ్మగార్ల అరెస్టు, శిక్ష.
3:—కీ. శే. మోతీలాల్ నెహ్రూకుమార్తెలు పండిట్ సతి, కుమారికృష్ణానెహ్రూ, ఒక గొప్పవకీలుకోడలు పూర్ణిమబెనర్జీగార్లకు అలహాబాదులో స్వతంత్రదినోత్సవమునందు పాల్గొనినందుకు ఏడాది కఠినశిక్ష. పండిట్ సతిగారికి రు 300 జరిమానా, చెల్లింపనిచో మరి ఆరువారములశిక్ష. వకీలు విశ్వామిత్రగారి భార్య పిషావరుఉత్సవమున పాల్గొనినందుకు ఏడాది కఠినశిక్ష.
:—అహమ్మదాబాదు. వసుమతి దేశాయిగారిపై విధింపబడిన జరిమానాకు ఆమెభర్తయింటిలో జప్తుచేసి రు 200 గైకొనిరి. ఆమెభర్త రామప్రసాదుదేశాయిగారు కోర్టులో చర్యజరుపనున్నారు.
:—చేబ్రోలులో ఎరస్టుచేయబడిన పాటిబండ పార్వతమ్మగారికి 6 నెలల విడిఖైదు.

:—బొంబాయి. మణిభాయిదేశాయిగారి అరెస్టు.

:—కలకత్తా. శ్రీమతి కల్యాణిదేవిగారి అరెస్టు.

:—కుష్టియా. శ్రీమతి ఉషాబాలగారికి 6 నెలలు విడిఖైదు.

:—శ్రీమతి భారతీరంగాగారు, తెనాలి మునిసిపలు వైస్‌ఛేర్మెనుగారిభార్య శ్రీమతి తాయారమ్మగారు, కావూరువాస్తవ్యులగు తుమ్మల బసవయ్యగారిభార్య శ్రీమతి దుర్గాంబ, శ్రీమతి పాదర్తి కనకసుందరమ్మగార్లపై క్రిమినలులా సవరణచట్టము 7-1 సెక్షనుక్రిందతేబడినకేసు విచారణ. భారతీరంగాగారికి 1 సంవత్సరము సామాన్యశిక్ష, 500 జరిమానా, చెల్లింపనిచో మరిమూడునెలలు శిక్ష. తాయారమ్మ, సుందరమ్మగార్లకు 1 సంవత్సరము విడిఖైదు, 500 జరిమానా, చెల్లింపనిచో 6 వారములు ఖైదు. శ్రీమతి దుర్గాంబగారికి 6 నెలలు విడిఖైదు, 500 జరిమానా లేక 6 వారములు శిక్ష.

3:—లాహోరు సర్ గంగారాముగారికోడలు, హరిరావులగారిసతి, బారిస్టరు దేవరాజుగారితల్లి, శ్రీమతి సహోనీజ్ఞానదేవిగార్లకు నాలుగునెలలశిక్ష, రు. 50 జరిమానా, లేదా 15 దినముల అధికశిక్ష. పుష్ప దేవిగారికి రు. 100 జరిమానా, లేదా నెల కఠినశిక్ష.

:—పూరి. నిశమనిదేవి, శ్రద్ధామనిదేవి క్రి. లా. స. చట్టము 17 (2) ప్రకారము ఒకనెల విడిఖైదు.

:—సూరతు. శ్రీమతులు జయావతిమున్షి, మధురికామెహతాగార్లకు చెరి నాలుగునెలలశిక్ష.

:—బొంబాయి. శివలక్ష్మీబాయి, భానుమతీబాయి, నూరాబెను అరెస్టు. సావిత్రిబాయిపతంకరుకు శిక్ష.

4:—బొంబాయి. చందనబెనుగారికి 6 నెలలు శిక్ష.

:—సూరతు. పద్మావతిదేశాయి (సాంతరాంపూరు దివానుకూతురు) అరెస్టు.

:—కలకత్తా. శ్రీమతులు నిహారమలగంగూలీ, కుమారశాంతి సుధాచాసూ దేవరాణిసర్కారుగార్ల అరెస్టు. మృణాళినిడేగారికి రు. 100 జుర్మానా.

:—కటకము. రామదేవి, కిన్నను బాలసేనుగారికిని జుర్మానాలువేయబడెను.

:—గుంటూరు. క్రొత్తపల్లి భూషమ్మ, పరచూరి సత్యవతి, రంగమ్మ, మల్లపెద్ది పంతమ్మ ఎరస్టు.

:—మిద్నపూరు. అవనీదాసి, చారుబలాదాసిగార్లకు శిక్ష.

:—మధుర. శ్రీమతులు తాయమ్మాళ్, సీతాలక్ష్మి, లక్ష్మీబాయిగార్ల అరెస్టు.

5:—బందరు. అంగలూరువాస్తవ్యులు కమ్మస్త్రీలు త్రిపురనేని కౌసల్యాదేవి, ఆరికపూడి నాగభూషణము గారిసతి ఉషామణెమ్మ, గురజాడవాస్తవ్యురాలు పాలడుగు సుబ్బారావుగారిభార్య వరలక్ష్మమ్మ గార్లను పికెటింగుచేయుచుండగా గొనిపోయి పోలీసులు స్టేషనులో రంగునీళ్లుకొట్టిరి.

:—బొంబాయి. శ్రీమతి జమూచేనువేజ్లీగారికి 18 నెలలశిక్ష.

:—మదరాసు. శకుంతలాబాయిగారికి 11-వ తేదీవఱకు రిమాండు.

6:—నెల్లూరు తూర్పుతీరమున అనాదిగా యిప్పటికిని వేయిఆవులకుపైగా పోషించుచున్న కుటుంబమునకు చెందిన శ్రీమతి యానాటిచెంచులక్ష్మమ్మ, శ్రీమతి రెంటాలసుబ్బమ్మగార్లు మైపాడులో ఎరస్టు.

:—లాహోరు. గోపీచందుసతిగారి అరెస్టు. లీలావతిగారు క్రి. ప్రొ. కో 108 క్రింద అరెస్టు.

:—అమృతసరము. మాల్వాదేవిగారికి 6నెలలఖైదు, రు. 50 జరిమానా.

9:—బళ్లారి డా. నివర్తిలక్ష్మీదేవిగారికి ఏడాది విడిఖైదు. బి. తరగతి.

:—అహమదాబాదులో శ్రీమతి గంగాబెనుసతిగారి అరెస్టు.

10:—నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెం. శ్రీమతి చవనం తిరుపాలమ్మగారి ఎరస్టు.

:—అహమదాబాదులో గంగాబెనువైద్యాగారి ఎరస్టు.

:—కాలికట్టు. శ్రీమతి మెట్టిల్డా, బి. కలన్‌సతి, శ్రీమతి దేవకీఅమ్మకన్యాగార్ల అరెస్టు.

:—బాపట్ల. తన్నీరు సీతారామమ్మ, తుమ్మల తులశమ్మ, పట్టికూటి రాధమ్మ, రావిపాటి జయలక్ష్మమ్మ గార్ల ఎరస్టు.

:—అహమదాబాదు. గుజరాతు డిక్టేటరు మణిబెనుజవేరి సతిగారిని అరెస్టుచేసి వదలివేసిరి.

:—లాహోరు. డాక్టరు రామప్యారీగారి అరెస్టు.

:—గయబంధ. మహామాయాదేవిగారి అరెస్టు.

:—మీరుగంజ్. జయప్రకాశసతి, చంద్రకాంతదాససతిగార్లకు రెండేండ్ల కఠినశిక్ష.

7:—గుంటూరు. మునగపాటి రాజలక్ష్మమ్మ, గొల్లమూడి రత్నమ్మ, పాటిబండ్ల అన్నపూర్ణమ్మ, వాసిరెడ్డి పార్వతమ్మగార్లను స్టేషనుకు తెచ్చి వదలివేసిరి.

8:—నెల్లూరు. ఎనేటి చెంచులక్ష్మమ్మ, రెంటాల వేంకటసుబ్బమ్మగార్లకు క్రి. లా. స. చట్టము 17 (1) ప్రకారము ఆరేసినెలల కఠినశిక్ష. సి. తరగతి.

:—బొంబాయి. లక్ష్మీబాయిగుల్వంకరుగారికి 3 నెలలఖైదు రు. 150 జరిమానా, లేదా మరి 3 నెలలశిక్ష.

11:—లాహోరు. సుదేశకుమారికి ఆరునెలలశిక్ష. ధరమ్‌కారుగారి అరెస్టు.

:—ఢిల్లీ. అసఫాలీసతిగారికి 6 నెలల విడిఖైదు. 206 రు. జరిమానా.

12:—చెన్నపురి. 8-వ స్త్రీసర్వాధికారిణి శివభోగంగారికి 1 సంవత్సరముశిక్ష. రు. 50 జరిమానా బి. తరగతి.

:—దినాజ్‌పూరు. స్నేహలతాగంగూళికి రెండునెలలశిక్ష.

:—కలకత్తా. ప్రమిళాగుప్త, సుశీలగుప్తకన్యల అరెస్టు.

13:—మంగళగిరి. ముప్పలనేని పుష్కరాంబ, నెలగా నాగరత్నం, గాంధి జనార్దనమ్మగార్లు పికెటింగు చేసిరి. పోలీసులు జోక్యముకలిగించుకొనలేదు.

14:—నెల్లూరు. చపనం తిరుపాలమ్మగారికి నాలుగుమాసములశిక్ష. ముత్తుకూరు కామమ్మగారికి 4 నెలల కఠినశిక్ష. దుర్భ వేంకటరమణమ్మ, యస్. అన్నపూర్ణమ్మగార్లకు 4 నెలల విడిఖైదు.

:—కలకత్తా. సునీతి బాలాదాసుగుప్త, కమలారాయి, సరోజనీమిత్ర, వీణాపాణిసర్కారు, చపలా బాలానేన్ గార్లకు 3 నెలలు విడిఖైదు విధింపబడెను. పసిబిడ్డలను చేతుల్లోబెట్టుకొని వచ్చిన రాధా రాణి, సుధారాణిగార్లకు చెరిఒకనెల విడిఖైదు విధింపబడెను. బి. ఏ. ప్యాసయిన పార్శీపిల్ల శివాక్షీ మోడీగారికి 9 నెలలు కఠినఖైదు విధింపబడెను.

:—కటకం. శ్రీమతి సరళాదేవిగారికి మరి యిరువురుస్త్రీలకును ఆర్డినెన్సుప్రకారము రూ. 300, రూ. 400, రూ. 200 జరిమానా విధించబడెను.

:—అహమ్మదాబాదు. ప్యారీలాలుగారితల్లి తారాదేవి, వీరికి ఎసయిచ్చిన కుశాలుబెను ముఖర్జీ, అమినా బెన్ గార్ల ఎరస్టు.

:—మదరాసు 9-వ డిక్టేటరు రుక్మిణిఅమ్మాళ్, గౌతమిఅమ్మాళ్ ఎరస్టు.

15:—అహమదాబాదు. సబర్మతీస్త్రీలచెరసాలలో స్థలముచాలకపోవుటచే డేరాలవేసిరి.

16:—ఏలూరులో కంది నాగరత్నమ్మ, కారింగుల వేంకటరత్నమ్మ, తిరగపల్లి తాయారమ్మగార్ల ఎరస్టు.

:—డక్కా. శచీరాణిదేవిగారికి ఒకనెలఖైదు.

:—జెస్సూరులో పికటింగుకోసము ప్రతిభారాణిదత్తుగారిఅరస్టు.

:—విశాఖపట్టణము. దిగుమర్తి జానకీబాయి, గుండుమళ్ళ రింగనాయకమ్మగార్లకు శిక్ష. మొదటివారికి ఒకసంవత్సరము, బి క్లాసు. రెండవవానికి ఆరుమాసములు, సి. క్లాసు.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.